
ఆంధ్రపత్రిక
సచిత్ర వార పత్రిక
నన్నయ
నాగార్జునుడు
పోతన
రాజరాజనరేంద్రుడు
త్యాగరాజు
వేమన
"ఆంధ్ర హృదయేశ్వరుడు శ్రీరాముడు"
దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు
4 అణాలు
31-10-'56
ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సంచిక



# దీపావళి!

దీపావళి పండుగ శుభసమయాన ఆనందించని వారెవరు? యీ సంతోషకరమైన పండుగ వాతావరణములో, గత సంవత్సరాన్ని సింహావలోకనము చేసుకొని, రాబోవు నూతన సంవత్సరములో అభివృద్ధి కొరకై ప్రణాళికను తయారు చేసుకొనెదరు మేము కూడ దీనికి ఎంతమాత్రము తీసిపోము, నూతన సంవత్సరానికి మొదటి అంతస్తుగా సురక్షిత బిరడా (pilfer proof) గల సీసాలతో మా మందులు కొన్నింటిని అందించబోవుచున్నాము మా ఖాతాదారులందరికి దీపావళి అభినందనలు




ఆయుర్వేదాశ్రమ ఫార్మసీ లి.,

అహమ్మదునగర్



**కాకతీయ చక్రవర్తులకు అదేవత కాకతి**

కాకత్యాః పరశక్త్యైకృపయా కూష్మాండవల్లికా కాచిత్ పుత్రమసూత తదేతత్కుల
మనఘం కాకతీయ సంజ్ఞమభూత్ [కలువచేరు శాసనం]

సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 9
31 10-56

దుర్ముఖ ఆశ్వయుజ బహుళ త్రయోదశి బుధవారం



ఆంధ్రప్రదేశ్ ప్రారంభోత్సవం జరుపనున్న ప్రధాని నెహ్రూ

## విషయానుక్రమణిక



## ఆంధ్రచరిత్ర: కొన్ని ప్రధాన ఘట్టాలు



| | | |
|---|---|---|
| ఆంధ్రజాతి తొలిప్రస్తావన (ఐతరేయబ్రాహ్మణము) | క్రీ పూ | 1000కు ముందు |
| మెగస్తనీస్ ప్రస్తావన | ,, | 320 |
| శాతవాహన రాజ్యస్థాపన | ,, | 221 |
| గౌతమీపుత్ర శాతకర్ణి | క్రీ శ | 78 |
| శాతవాన రాజ్యపతనం | ,, | 203 |
| విష్ణుకుండిను ని-మాధవవర్మ (iii) | ,, | 546-611 |
| వేంగీరాజ్యస్థాపన | ,, | 624 |
| గుణగవిజయాదిత్యుడు | ,, | 849-892 |
| నన్నయ భారతరచన | ,, | 1022 1061 |
| పల్నాటి యుద్ధం | ,, | 1176-1182 |
| బసవయ్య | ,, | 1100 1165 |
| కాకతీయ యుగం | ,, | 1000-1323 |
| గణపతిదేవుడు | ,, | 1198 1262 |
| ఓరుగల్లు పతనం | ,, | 1323 |
| విజయనగరరాజ్యస్థాపన | ,, | 1336 |
| కృష్ణదేవరాయలు | ,, | 1509-1530 |
| తళ్ళికోట యుద్ధం | ,, | 1565 |
| ఈస్టిండియా కంపెనీ ప్రవేశం | ,, | 1639 |
| తంజావూరు నాయకరాజ్యం | ,, | 1535-1673 |
| మధుర నాయక రాజ్యం | ,, | 1539-1736 |
| క్షేత్రయ్య | ,, | 1633-1673 |
| త్యాగరాజు | ,, | 1700 |
| గోలకొండరాజ్యం | ,, | 1572-1687 |
| బొబ్బిలియుద్ధం | ,, | 1757 |
| యోగివేమన | ,, | 1750 |
| ఉత్తరసర్కారులు బ్రిటిష్ స్వాధీనం | ,, | 1761 |
| దత్తమండలాల స్వాధీనం | ,, | 1769 |
| వీరేశలింగం | ,, | 1848 1917 |
| ఆంధ్రపత్రిక స్థాపన | ,, | 1907 |
| ప్రథమాంధ్రమహాసభ | , | 1913 |
| దేశోద్ధారక నిర్యాణం | ,, | 1938 |
| పొట్టిశ్రీరాములు నిర్యాణం | ,, | 1952 డిశంబర్ |
| ఆంధ్రరాష్ట్రావతరణ | ,, | 1953 అక్టోబర్ 1 |
| ఆంధ్రప్రదేశ్ అవతరణ | ,, | 1956 నవం 1 |



విశ్వదాత, ఆంధ్రులకు విజ్ఞానదాత   కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

# త్రిలింగమురళి

[విరియాల రామకృష్ణ]

వికచములై హృదయమ్ములు
చకితపరిస్ఫూర్తి వెలుగ జనతకు వైతా
ళికగీతిక వినిపించిన
ఒకనాడిది మఱలి వచ్చి ఉయ్యెల లూపెన్!
అల నన్నయ్య మహర్షి తెన్గు మురళిన్
ప్రారంభవాగర్థ సం
కలనమ్మందున తేనియల్ వెలిపె,
తిక్కన్నయ్య మేల్కొల్పె, వె
న్నెలమల్లెల్ విరబూచినట్టులు
మహాంధ్రీయప్రమోదమ్ముగా
వెలసెన్ విశ్వమునన్ త్రిలింగమురళీ
విద్యావినోదక్రియల్!

పూలమొగ్గలందు పాలబుగ్గలయందు
ముద్దులొలుకు తెలుగుమురళియందు
కానుపించె నేడు కళ్యాణకంఠమై
తెలుగుతల్లి మల్లె లొలుకు నవ్వు!
సంజవేళ వెలుగు జాబిల్లి రేకలో
నవ్వువోలె, కన్నెపువ్వువోలె
తెలుగుమురళిమీద మెలగు కమ్మనిపాట
తేనెతేటచినుకు వాన కురిసె!

ఇంపారన్ తెలుగుంబసందు మును పెన్నే
జిహ్వలన్ పాడి, నై
లింపశ్రీ సుఖమెల్ల గాంచి, "తెలుగే లె" స్సంచు
నల్దిక్కు మ్రో
గింపన్ సాగిన సార్వభౌములకు
సాహిత్యామృతాస్వాదివై
సొంపుల్ చిందెడి నీ త్రిలింగమురళిన్
సుశ్లోకముల్ నింపవే

ఉదయోత్సవమోయీ! యిది
పద! పద! యూరేగవలయు పండుగ నేడే!
కదలుము! త్రిలింగమురళీ
నదదోంకారమ్ము పిలిచె నవనవ నవమై!!
ఆవేశమ్మును పెట్టిపుట్టిన మహాత్మా!
తెల్గువీరా! పురా
హేవాకమ్ములు పండు వెన్నెలలు
నీయింటన్—పునర్నవ్యమై
సేవింపన్ పయనించి వచ్చినవి లే!
శృంగారగానమ్ముతో
గ్రీవమ్మెత్తి త్రిలింగముగ్ధమురళిన్
కీర్తించి నర్తింపుమీ!

తెగరా దీమురళీనినాదములు క్రొందేనెల్
గుబాళించి పో
జగమెల్లన్ హృదయానురాగములుగా
జాల్వారి మేల్వాసనల్
మిగులన్ పాడుము మాటలల్లి;
మనతల్లిశ్రా ప్రాచ్యఖండానకున్
సిగపూవై వెలయంగ కట్టుము కళా
శిల్పమ్మనల్పమ్ముగన్.
మంగళకైశికిలో నీ
బంగారు త్రిలింగమురళి పాడుము; హృదిలో
పొంగిన కౌతుకహేలా
సంగతి మేల్బంతి వగుము సర్వంసహాలో!!



ఒరిస్సా

ద్విభాషా బొంబాయి

ఆదిలాబాదు

గోదావరి నది

ప్రాణహిత నది

నిజామాబాదు

కరీమ్‌నగరం

శ్రీకాకుళం

మెదక్

వరంగల్లు

విశాఖపట్టణం

హైదరాబాదు

నల్గొండ

ఖమ్మంమెట్టు

తూ గోదావరి

ప గోదావరి

రాజమండ్రి

ఏలూరు

మహబూబునగరం

కృష్ణా నది

కృష్ణా

గుంటూరు

కర్నూలు

బంగాళా ఖాతము

అనంతపురం

నెల్లూరు

పెన్నా నది

చిత్తూరు

మైసూరు

మద్రాసు

# ఆంధ్రప్రదేశ్

వైశాల్యం: 1,10,000 చ.మైళ్లు
జనాభా: 3,22,00,000
జిల్లాలు: 20

DR

# తెలంగాణా సిరిసంపదలు



ఆంధ్రరాష్ట్ర సంసిద్ధికోసం ఆత్మార్పణచేసిన మహాతపస్వి, పొట్టి శ్రీరాములు.

ఆంధ్ర ప్రదేశ్ మొత్తం వైశాల్యం 1, 10, 000 చ. మైళ్ళు. మొత్తం ఇరవై జిల్లాలోను తెలంగాణా జిల్లాలు 9 ఈ 9 జిల్లాల విస్తీర్ణం 48, 282 చ. మైళ్ళపై చిలుకు ఉంటుంది. మొత్తం ఆంధ్రప్రదేశ్ జనాభా 3,22,00, 000. ఇందులో తెలంగాణా జనాభా 1, 07, 61, 000.

తెలంగాణాలో హైదరాబాదు, మహబూబ్‌నగర్, అదిలాబాద్, నిజామాబాద్, మెదక్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మంమెట్టు, నల్గొండ జిల్లాలు, బీదర్‌లోని నారాయణఖేడ్, జహీరాబాద్ తాలూకాలు రాయచూర్‌లోని గద్వాల, ఆలంపూరు తాలూకాలు, గుల్బర్గాలోని తాండూరు, కొడంగల్లు తాలూకాలు ఉన్నాయి. మొత్తం 70 తాలూకాలు ఉన్నాయి.

తెలంగాణా జనాభాలో పురుషులు 54, 35, 000 మంది, స్త్రీలు 53, 25, 000 మంది ఉన్నారు. పట్టణాలలో 22, 36, 000 మంది, పల్లెలలో 85, 24, 000 మంది ఉంటున్నారు. లక్షపైగా జనాభాగల పట్టణాలు 2 ఉన్నాయి.

వ్యవసాయంమీద ఆధారపడిన జనాభా 65, 80, 000, ఇతరవృత్తులమీద ఆధారపడిన జనాభా 41, 81, 000. మొత్తం సాగయ్యేభూమి 1, 14, 15, 000 ఎకరాలు; బంజరుభూమి 25, 39, 000 ఎకరాలు. వ్యవసాయేతర ఉపయోగాలకు వాడబడే భూమి 13, 72, 000 ఎకరాలు. వ్యవసాయ యోగ్యమైన బీడు భూమి 10, 06, 000 ఎకరాలు.

మొత్తం పంటభూమి 1, 16, 85, 000 ఎకరాలు. వరి 5, 32, 300 టన్నులు, జొన్న 46, 66, 600 టన్నులు, సజ్జ 32. 700 టన్నులు. గోధుమ 4, 100 టన్నులు, మొక్కజొన్న 66, 900 టన్నులు, రాగి 17, 200 టన్నులు, వేరుసెనగ 2, 42, 200 టన్నులు, ప్రత్తి 39, 600 బేళ్లు, చెరకు 1, 36, 200 టన్నులు, పొగాకు 8, 500 టన్నులు పండుతాయి.

గనుల్లో 19,705 మంది పనిచేస్తున్నారు. ఏటా 15.97 లక్షల టన్నుల బొగ్గు, 39700 టన్నుల ఇనుము, 1,07,100 టన్నుల సున్నపురాయి ఉత్పత్తి అవుతాయి.

ఏటా 4,15,20,000 గజాల గుడ్డ, 1,28,36 000 పౌ॥ నూలు, 9,61,000 టన్నుల చక్కెర, 2,68,000 హండ్రెడ్ వెయిట్ల కాగితం, 473,79,00,000 సిగరెట్లు, రేయాన్ నూలు 25 78 లక్షల పౌనులు, రేయాన్ గుడ్డ 9 39 లక్షల గజాలు, విద్యుచ్ఛక్తి 6,57,27,000 కిలోవాట్లు, పారా 3,67,000 గాలన్లు, గాజు 1,399 టన్నులు, ఎరువులు 12,156 టన్నులు ఉత్పత్తి అవుతాయి.

2,067 పోస్టాఫీసులు, 59 తంతి ఆఫీసులు ఉన్నాయి. 7,422 ప్రాథమిక పాఠశాలలు ఉన్నాయి. వీటిలో విద్యార్థులు 4,68,555, ఉపాధ్యాయులు 17,787 మంది ఉన్నారు.

మాధ్యమిక పాఠశాలలు 150, ఉన్నత పాఠశాలలు 106, వృత్తిపాఠశాలలు 25, కళాశాలలు 15, వృత్తికళాశాలలు 7 ఉన్నాయి. 26 ఆస్పత్రులు, 185 ప్రభుత్వ డిస్పెన్సరీలు, 4707 పడకలు ఉన్నాయి. 480 మంది ప్రభుత్వ డాక్టర్లు ఉన్నారు. ★

---

శ్రీ కె. వెంకట కిషన్‌రావు అన్నగారికి

మీరు తెలియపరచకుండా అకస్మాత్తుగా దక్షిణయాత్రకై బయలుదేరి దాదాపు రెండు మాసములు గడచినవి. మీరు ప్రస్తుతము ఎక్కడ ఉన్నారు—ఎప్పుడు తిరిగి రాగలరు—యీ విషయం తెలియక చాలా విచారముగ ఉన్నది.

పైగా నేను, నవంబర్ మొదటివారంలో ట్రైనింగ్ కొరకై ఒక సంవత్సరము వరకు ఆంగ్ల దేశము పోవుచున్నాను. గనుక నాకు మీ యొక్క దర్శనభాగ్యము త్వరలో నే కలుగజేతురని నమ్ముచున్నాను.

విధేయుడు తమ్ముడు పి. రాఘవేంద్రరావు,
హైదరాబాద్.



ఆంధ్ర రాజధాని హైదరాబాదులో రాజ వీధి

# ★ మహాంధ్రోదయం ★

రేపే, ఆంధ్రమహోదయ శుభదినం! ఆంధ్రుల మహదాశయం సిద్ధిస్తున్న చరిత్రాత్మక దినం,

చిరయశస్వి పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానం ఫలితంగా మూడేళ్ళక్రితం ఏర్పడిన ఆంధ్ర సువిశాలరాష్ట్రం కాబోతున్నది దీపావళీ పర్వసమయంలో భాగ్యనగరం రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతరణమహోత్సవాన్ని జరుపుకుంటున్నాము ఆంధ్రరాష్ట్రానికి ప్రారంభోత్సవం జరిపిన ప్రధాని నెహ్రూ ఆంధ్రప్రదేశ్ కు కూడా ప్రారంభోత్సవం జరపడం మహద్భాగ్యమనే భావించాలి. దాదాపు నాలుగు దశాబ్దాలక్రితం ప్రారంభమైన ఆంధ్రోద్యమానికి మూలపురుషులైన ఆంధ్ర మహా పురుషులను సంస్మరించవలసిన పవిత్రదినం ఇది. పూజ్యులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు, ఆంధ్ర భీష్మ న్యాయవాది సుబ్బారావు పంతులు, సురవరం ప్రతాపరెడ్డి ప్రభృతుల పవిత్రాత్మలకు ఎనలేని సంతృప్తికలిగించే రోజు ఇది

ఆంధ్రప్రదేశ్ అవతరణ — ఆంధ్రుల సమగ్ర జాతీయ మహోదయానికి మంగళాచరణమనే చెప్పాలి



ఆంధ్రప్రదేశ్ ప్రప్రథమ ముఖ్యమంత్రి కానున్న శ్రీ నీలం సంజీవరెడ్డి

ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెస్ పక్షనాయకుడుగా శ్రీ నీలం సంజీవరెడ్డిని సభ్యులు మొన్న కర్నూలులో ఎన్నుకున్నారు వీరు నూతనరాష్ట్రానికి ప్రప్రథమ ముఖ్యమంత్రిగా వ్యవహరిస్తారు శ్రీ సంజీవరెడ్డి యువకుడు, ఉత్సాహవంతుడు, కార్యదీక్షాపరుడు వీరి నాయకత్వాన ఆంధ్రభూమి స్థిమితంగా, దిన దిన ప్రవర్ధమానంగా భాసిస్తుందని ఆశిద్దాము

"చిరకాలం కలలుకన్న మహాంధ్రోదయం జరుగుతున్నది ఇది సువిశాలమైన రాష్ట్రం అభిప్రాయభేదాలను విస్మరించి విశాల హృదయంతో నూ, దూరదృష్టితో నూ రాష్ట్ర వ్యవహారాలను నిర్వహించాలి ఏక కుటుంబంగా మెలగాలి" అని శ్రీ బూర్గుల రామకృష్ణరావు కర్నూలులో చేసిన విజ్ఞప్తి ప్రాధాన్యాన్ని నాయకులు గమనిస్తారని ఆశిద్దాము

జాగరూకతా పరిపాలనా వ్యవహారాలను నిర్వహించి, సమైక్యకృషి సాగించేపక్షంలో 110 వేల చదరపుమైళ్ళ విస్తీర్ణం, మూడు కోట్ల 22 లక్షల మంది ప్రజలు, దాదాపు 40 కోట్ల రూపాయల సాలుసరి ఆదాయము, బ్రహ్మాండమైన నదులు గల ఆంధ్రప్రదేశ్ భారతదేశంలోని రాష్ట్రాలలో మకుటాయమానంగా రూపొందేమాట వాస్తవం

# ఆంధ్రజాతి జాతకకథ

ఆంధ్రపితా మహ
మాడపాటి హానుమంతరావు

రెండు వేల మూడువందల ఏండ్లకు పైగా చారిత్రిక ప్రసిద్ధికలిగిన ఆంధ్రజాతి భారతదేశంలోని ఆధునిక జాతులన్నిటిలోకీ ప్రాచీనతమమైన జాతుల్లో ఒకటి క్రీస్తుశకానికి వెయ్యేళ్ళముందే ఆంధ్రజాతి ఉందని ఋగ్వేద విభాగమైన ఐతరేయ బ్రాహ్మణంలో ఒక ప్రస్తావన ఉన్నది ఆంధ్రుల పుట్టుకను గూర్చి ఐతరేయంలో ఉన్న కథ ఇది

ఇక్ష్వాకురాజైన వేధసుని కుమారుడు హరిశ్చంద్రుడు హరిశ్చంద్రునికి చాలకాలం వరకూ సంతానం లేకపోగా, మహర్షుల సలహామీద వరుణదేవుని ప్రార్థించాడు. వరుణదేవుడు ప్రసన్నుడై ప్రత్యక్షమయ్యాడు. హరిశ్చంద్రుడు తనకు పుత్రులు లేరని మనవి చేసుకున్నాడు. పుత్రుని ప్రసాదించడానికి వరుణుడు అంగీకరించాడు. కాని ఒక షరతు పెట్టాడు. "నీకు పుత్రుడు పుట్టగానే వాణ్ణి యజ్ఞపశువుగా చెయ్యాలి. దీనికి అంగీకరిస్తావో లేదో నీ ఇష్టం" అన్నాడు వరుణుడు. కొడుకు పుట్టాక చూసుకుందాంలే అని హరిశ్చంద్రుడు ఒప్పుకున్నాడు.

కొన్నాళ్ళకు హరిశ్చంద్రుని భార్య గర్భందాల్చి నవమాసాలు నిండాక కొడుకును కన్నది. వాడికి రోహితుడని పేరు పెట్టారు.

వరుణుడు వచ్చి "నీకు కొడుకు పుట్టాడు కదా వాడిని యజ్ఞపశువుగా చేసి యజ్ఞం చేస్తానన్నావుగదా ఇంకా ఆలస్యమేం" టని అడిగాడు

హరిశ్చంద్రుడు లేక లేక పుట్టిన ఆ బిడ్డని యజ్ఞపశువుగా చెయ్యడానికిష్టంలేక "పురిటి శుద్ధికాగానే అలాగే చేస్తా" నన్నాడు పది రోజులు గడిచాక వరుణుడు మళ్ళీ వచ్చి ఇదివరటిలాగే అడిగాడు "పిడికింకా పళ్ళయినా లేవే అప్పుడే యజ్ఞంలో బలి ఇవ్వడం ధర్మమా?" అన్నాడు హరిశ్చంద్రుడు అతడు చెప్పినది న్యాయంగానే తోచి వరుణుడు వెళ్ళిపోయాడు

దంతాలు మొలిచాక మళ్ళీ వచ్చి అడగా "ఇప్పుడు మొలిచినవి పాలపండ్లు గట్టిపళ్ళు రాగానే యజ్ఞం చేస్తా" నన్నాడు గట్టిపళ్ళు వచ్చిన తరువాత "సర్వవిద్య నేర్చనిదే ౦ జ పుత్రుడు రాజపుత్రుడు కదుగదా ధనుర్విద్యాభ్యాసానంతరం యజ్ఞం చేస్తా" నన్నాడు

రోహితుడు పెద్దవాడయ్యాడు విలువిద్య బాగా నేర్చుకున్నాడు అ[illegible]సి ఇంత కాలం హరిశ్చంద్రునిమాట తోసివెయ్య లేక ఆగిన వరుణుడువచ్చి నిక్కచ్చిగా అడిగాడు ఈ సారితప్పించుకోడానికి వీల్లే హరిశ్చంద్రుడు చాలాదుఃఖించాడు యజ్ఞం చేయడానికి ఒప్పుకున్నాడు

తన్ను యజ్ఞపశువుగా చెయ్యడానికి తండ్రి అంగీకరించినటు రోహితుడికి తెలిసింది వాడికి భయంకలిగింది ఇంట్లోంచి పారిపోయి అడవులు పట్టాడు

యజ్ఞం ఆగిపోయినందుకు వరుణునికి ఆగ్రహంకలిగింది హరిశ్చంద్రుడు జలోదర వ్యాధితో బాధపడేట్లు శపించాడు హరిశ్చంద్రుడు వ్యాధితో బాధపడసాగాడు

ఈ సంగతి అడవుల్లోఉన్న రోహితుడు విన్నాడు తండ్రిని దుఃఖపెట్టినందుకు చింతించాడు తనకుబదులు ఎవరైనా

(63-పేజీ చూడండి)

పండిత డి. గోపాలాచార్యులవారి
అరుణా
గర్భాశయ రోగనివారిణి
ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్ మద్రాసు 17

# భాగా నగరం

ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరనామం హైదరాబాదు అయితే ఆదిలో ఆ నగరానికి ఆ పేరు లేదు ఆదిలో అది భాగా నగరం అనే పేరుతో పుట్టింది

భాగానగరం అనే నామం యొక్క ఉత్పత్తి అరయతగింది భాగానగరం భాగ్యమతి అనే ఒకానొక ఉంపుడుకత్తె పేర పుట్టిందని చెపుతారు

కొన్ని ప్రసిద్ధనగరాల ప్రారంభం స్త్రీ సంబంధమైందిగా వుండడం కద్దు హైదరాబాదు తోడినగరాలైన బొంబాయి, కలకత్తాల ప్రారంభం స్త్రీ సంబంధపరమైంది కావడం చరిత్రలు చెపుతున్నాయి

కలకత్తా తొలుతటి పేరు కాళీఘటమనీ, అది స్త్రీ దేవతయగు కాళి పేర పుట్టిందనీ చెపుతారు

బొంబాయి నగరానికి మాంబాయిదేవి అధిష్ఠానదేవత అనీ, మాంబాయిదేవి పేరనే బొంబాయి పిలవబడుతూవుందని చెపుతారు

ఆ మహానగరాలకు గల స్త్రీ సంబంధం ఇట్లా స్త్రీ దేవతాత్మకం మాత్రమే

## ఉంపుడుకత్తె

హైదరాబాదునగరం ప్రత్యక్షం ఒక స్త్రీ పేరిటనే పుట్టింది ఆ స్త్రీ కాళికాదేవివలె, మాంబాయిదేవివలె స్త్రీ దేవత కాదు హైదరాబాదు నగరానికి ఆదిమనామమైన భాగానగరం అనే పేరిచ్చిన ఆమె ఒక మహమ్మదీయ మహారాజుకు ఉంపుడుకత్తెగా ఉండిన ఒక హిందూసుందరి

ఉంపుడుకత్తెయైన ఆ హిందూసుందరి పేరు భాగామతి ఆమెను ఉంచుకున్న మహమ్మదీయరాజు గోలకొండ కుతుబ్ శాహి నవాబుల్లో ఐదవవాడైన మహమ్మదు కులీ ఆ ఉంపుడుకత్తెపు సంబంధం ఒకానొక మహానగర నిర్మాణానికి దోహదమిచ్చింది ఆ ఉదంతం వినతగింది

## చాచల్ బంద

నేను హైదరాబాదు నగరం వెలసిన చోట నాలుగు వందల ఏండ్లకు పూర్వం చాచల్ బంద అనే చిన్న పల్లెటూరు ఒకటి ఉండేది చాచల్ బందా అనే జనపదం కృష్ణానది ఉపనదుల్లో ఒకటయిన మూసీనది తీరాన ఉండేది

## ఆంధ్ర శేషగిరిరావు

చాచల్ బందా గ్రామం ఉండిన ప్రాంతాన్ని ప్రస్తుతం శిహా ఆలీ బందా అంటారు చాచల్ బంద గ్రామంగా ఉండిన ప్పుడు అక్కడ నివసించే వారిలో పెక్కుమంది బ్రాహ్మణులు ఈ ప్రాంతాన నివసించడానికి వచ్చిన మొదటి మహమ్మదీయుడు కాజాచరాగ్ మెసపొటేమియాలోని నాజాకు చెందిన మతజీవి అతడు హైదరాబాదు నగర స్థాపనానికి దశాబ్దులు పూర్వం అక్కడకు వచ్చి చాచల్ బంద గ్రామభాగమైన ఒక చోట స్థిరపడ్డాడు అతడు నివసించిన చోటనే అతని శ్మశానం—దాని ఈనాడు మీర్ మోమిన్ శ్మశానం అంటున్నారు

మూసీనది అవతలి ఒడ్డున చాచల్ బందాకు ఐదారు మైళ్ళదూరంలో కుతుబ్ శాహిరాజుల రాజధానీ నగరమైన గోలకొండ మహానగరం ఉండింది

## రాత్రియాత్రలు

ఆ మహానగరాన్నుండి గుర్రంమీద బయలుదేరి గోలకొండ రాజకుమారుడు రోజూ రాత్రులు ఐదారు మైళ్ళు స్వారీచేసి చిన్న జనపదమైన చాచల్ బందాకు వచ్చేవాడు

మహారాజకుమారుడు మహానగరాన్ని వీడి రాత్రిళ్ళు చిన్న జనపదానికి రావడానికి కారణం ఏమిటి?

చాచల్ బందా అతని ఉపస్త్రీ భాగామతికి కాపురపు కాణాచి కావడమే.

మూసీ నది నిండు వరదలో ఉన్నా ఆ రాజకుమారుడు గోలకొండనుంచి చాచల్ బందాకు రాత్రి రాకలు మానేవాడు కాడు వరదలో ఉన్నా మూసీనదిని అతడు గుర్రం మీదనే ఉత్తరించేవాడు

## పురానాపుల్

ఆ గోలకొండ రాజకుమారుని పేరు మహమ్మదు కులీ అతడు గోలకొండ నాలుగవ నవాబు ఇబ్రహీమ్ కుతుబ్ శాహి రాజా కొడుకు

తన కొడుకు రోజూ రాత్రులు ఇట్లా వెళుతూ వుండడం, వరదలో వున్న నదిని కూడా గుర్రం మీదనే దాటి పోతూ వుండడం ఇబ్రహీమ్‌కు తెలిసింది తోడనే అతడు గోలకొండనుంచి చాచల్ బందాకు పోయే బాటమీద మూసీ నదికి వంతెన కట్ట

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు

దానికి ఏర్పాటుచేశాడు లక్షా యాభైవేల ఖర్చుతో పద్దెనిమిది మాసాలలో ఆవంతెన 1578 లో తయారైంది

శాహాకులీబంధు చెంత ఉండిన చాచెల్ బంధ్ గ్రామంలో నివసించే భాగ్యమతి అనే భోగముదానివద్దకు రాత్రిళ్లు వచ్చి పోతూవుంటే రాజకుమారునికి మూసీనదిని దాటేటప్పుడు ప్రాణాపాయశంక లేకుండా మార్గం సుకరం చేయడం కోసం నిర్మింపబడిన ఆవంతెన నేటికి కూడా హైదరాబాదులో ఉండి పురానాపుల్ అనే నామంతో వ్యవహరింపబడుతూ వుంది

## స్థలాన్వేషణ

గోలకొండ నాలుగవ నవాబైన ఇబ్రహీమ్ కాలమునాటికే గోలకొండ పట్టణం బాగా పెరిగింది అచ్చట జనాభా క్రిక్కిరిసింది నీటికి ఎద్దడి కలిగింది జనాభా క్రిక్కిరియడంచేత, నీటి సరఫరా బాగాలేకపోవడంచేత అక్కడ అనారోగ్య దేవత పీటపెట్టింది

అనారోగ్య పరిస్థితుల్లోపడిన ఆ నగరంలో జనసాంద్రత తగ్గించడానికి, రాజధాని నగరాన్ని అభివృద్ధిపరచడానికి అన్యస్థలం ఎన్నుకుంటే బాగుంటుందనే భావం కలుగుతూ వచ్చింది

ఆ పరిస్థితుల్లో 1581 లో ఇబ్రహీమ్ చనిపోయాడు అప్పుడు అతనికుమారుడు మహమ్మద్ కులీ గోలకొండ రాజ్యానికి రాజయ్యాడు

## నూతనస్థలం

అతడు రాజైన పదేళ్లలో గోలకొండ నగరపు జనాభా మరింత హెచ్చింది కాగా అతడు అన్యస్థలాన్వేషణ తీవ్రంగా పూనుకున్నాడు ఒకనాడు వేటకువెళ్ళి నేడు హైదరాబాదు నగరం ఉన్న ప్రాంతంలో అతడు వేటాడుతున్నాడు

ఆ ప్రాంతం జలసమృద్ధి కలిగి ఉండడం అతడు కనిపెట్టాడు దగరలో మూసీనది ఉంది పైగా ప్రదేశం మంచి ఎత్తులో ఉంది అచ్చటి వాతావరణం అతిఆహ్లాదమైందిగా ఉంది అతని ప్రేమకలాపపు యాత్ర నిరపాయంగా సాగడానికి, కోటతో సంబంధం నిలుపుకోడానికి తండ్రి కాలంలో మూసీనది మీద నిర్మితమైన వంతెన ఉంది రక్షణ కార్యకలాపాలకు కూడా అనువైన ప్రదేశం ఇన్ని అనుకూల్యాలు కనిపించడంచేత ఆస్థలం అతనికి నూతన రాజధానీ నగర నిర్మాణానికి వరణీయమైంది

## ఉంపుడుకత్తె ఉనికిపట్టు

ఈ అనుకూల్యాలన్నిటికి శిఖర ప్రతిష్ఠగా అక్కడికి అత్యంత సమీపంలో ఉన్న చాచల్ బందా అనేచిన్న గ్రామంలో తన ఉంపుడుకత్తె అయిన భాగమతి నివసిస్తూవుంది ఆమె రూపానికి ముగ్ధుడైన అతనికి ఆమె గ్రా



ఆంధ్రప్రదేశ్ శాసనసభామందిరం

# బహూకృతి

పి. గణపతి శాస్త్రి

"రేపురా! మాపురా! అని ఇంకా ఎన్నిసారులు తిప్పుతారండీ?"

అని గర్జించి అడిగాడు విద్యానాథుడు

"ఏం చెయ్యను! బాబూ! వేతాళ నాయనింగారు పరబ్రహ్మ వచ్చినా మరి ప్రభు దర్శనం వల్లపడదంటున్నారు! నా వల్ల ఏమవుతుంది?"

అని కొంచెం సర్ది చెప్పాడు సోమయామాత్యుడు

"ఇన్నిసార్లూ తిప్పి చిట్టచివరికిలాగేనా పన్నాయి నొక్కులు నొక్కడం? ఏమన్న పెద్దమనిషివయ్యా! ఆ మాట మొట్టమొదటే ఏడవలేకపోయావూ? నే నేదో మరోదారి చూసుకుందును గా!"

అని ఈసడించి కసిరి కొట్టాడు విద్యానాథుడు

"మాటలు మాత్రం తిన్నగా రానీ! ఏమిటి నువ్వు చూసుకునేది? గోదారి?" అని కళ్ళెర్ర జేశాడు సోమయామాత్యుడు.

"అదిగో! ఆ ఏకవచన ప్రయోగం చేశావంటే మాడు విచ్ఛిన్నం జేస్తానో!"

"ఏమిటయ్యా! నువ్వు చేసేది? ప్రభు దర్శనార్థం వచ్చి పడిగాపులుపడి ఉండవలసిన మనిషి కింత తలపొగరా?"

అని రాసీ రాసీ గంటం అక్కడ పెట్టి లేచి నిలబడ్డాడు సోమయామాత్యుడు వెంటనే విద్యానాథుడతని మీదికి వెళ్ళి విరుచుకు పడ్డాడు

ఆ పైన విద్యానాథుడు, సోమయామాత్యుడు ఒకరొకరితో గట్టిగా తలపడే దాకా వచ్చింది కాని ఆపక్కనే కూర్చున్న నలుగురైదుగురు విశ్వేశ్వరాగ్రహారీకులు ఆ ఇద్దర్నీ చేరిఒక పక్కకి నెట్టివేశారు ఎవరికి సర్దిసర్ది చెప్పవలసినట్టు వారికి సర్ది చెప్పారు ఆ ఇద్దరూ మళ్ళీ రోషాలు పెంచుకుని ఒకరొకరితో తలపడకుండా ఇద్దరిద్దరు చొప్పున వారిద్దరి జబ్బలు గట్టిగా పట్టుకొన్నారు అయినా వారిద్దరు పెనగులాడడం మానలేదు సోమయామాత్యుడు మరి విద్యానాథునివైపు చూడడం మానివేసి పక్కనున్నవారికేసి చూస్తూ మండిపడ్డాడు

"మహారాజ దర్శనం అంటే మాటలా? ఇంకెందరో కొమ్ములు తిరిగిన వాళ్ళే కాళ్ళా వేళ్ళా పడితే చివరికి వేతాళనాయనింగారి దర్శనం కూడా కాలేదు ప్రతి పంచాంగ బ్రాహ్మడికీ మహారాజ దర్శనమేనా?"

"ఇదిగో! శాస్త్రి పెద్దా, పిన్నా తారతమ్యం చూసుకుని మరీ మాట్లాడు! లేకపోతే నిన్ను, ఆ వేతాళ నాయణ్ణీ చెరో జబ్బ దొరకబుచ్చుకుని గోదావరిలోకి విసిరివేస్తాను! ఆ తరవాత నేనే స్వయంగా మహారాజదర్శనానికి వెళ్ళిపోతాను! ఎవ్వరడ్డగిస్తారో చూస్తానుగా!"

సోమయామాత్యుడు మళ్ళీ ఉగ్రుడైపోయాడు పక్కనున్న ఇద్దరగ్రహారీకులు అతన్ని మరింత గట్టిగా అదిమి పట్టుకున్నారు

"నిన్ను మహారాజులుంగారి స్కంధావారం దరి మానానికికూడా చేరనివ్వను! ఏమనుకున్నావో! సోమయామాత్యుడంటే! మాడు వాతడాఖా!"

"నీలాంటి అప్రాచ్యుల్ని, అశక్త దుర్జనుల్ని చాలామంది నే చూశానులే! నువ్వు లాంటి గోముఖవ్యాఘ్రానివని నేను మొదటే అనుమానించాను ఈపైన నువ్వు చేసేదేమిటో నేను చూస్తానుగా!"

అని కన్నుమూసి కన్ను తెరిచేలోగా విద్యానాథుడక్కడినించి వెళ్ళిపోయాడు

సోమయామాత్యుని వీథిచావడిలో ఒక్కమారుగా వాన కురిసి వెలిసినట్లయింది

అమాత్యుడు కిందఉంచిన గంటంమళ్ళీ చేతబట్టి తల ఎత్తకుండా ఎంతో గంభీరంగా కవిలె కట్టలు తిరగవెయ్యడం మొదలు పెట్టాగ చుట్టూ కూర్చున్న వారిలో వెంకటభట్టే మొట్టమొదటగా ప్రసంగం ప్రారంభించాడు

"ఎందుకాయన కంతటిమిడిసిపాటు? శాస్త్ర ఎదటివారి అంతరం తన అంతరం చూసుకోనక్కరలేదూ? ఇంతకీ ఎవరండీ ఈ విద్యానాథుడు?"

"ఏమో! ఎవడో! ఎవడైతే మనకేం!" అన్నాడు సోమయామాత్యుడు

"పాపం! మనిషి గొప్పవాడేనండీ! ఎందుకిలాగ తొందరపడ్డాడో గాని!" అన్నాడు శేరిభట్టు

"మీరు గాని ఈయన్ని ఇంతకుపూర్వం ఎక్కడైనా చూశారా?"

అన్నాడు సోమయామాత్యుడు రాసీరాసీ గంటం నిలబెట్టి

"చూడడమేమిటి? ఆయన్ని బాగానే ఎరుగుదును

ఆయనది మా మామగారి గ్రామమే. షట్శాస్త్రముల యందున్నూ నికరమైన పాండిత్యం కలిగినటువంటి మహావిద్వాంసుడు ఆపైన దేవతావాణిలో అనర్గళంగా ఆశువు చెప్పగలిగినటువంటి మహాకవీశ్వరుడు కూడాను. అయితేమాత్రం అన్నప్పుడు



తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం.

ప్రభుదర్శనం దొరకడమంటే మాటలుటండీ!"

అని సోమయామాత్యుణ్ణి కొంతవరకు సమర్థిస్తూ తన ప్రసంగం చప్పరించేశాడు అమాత్యునికి ప్రసంగంతో కొంచెం ఊపిరి తిరిగింది.

"మొట్టమొదట దర్శనం సాధ్యపడుతుందేమోననే ధైర్యంతో కొంచెం మాట ఇచ్చాననే అనుకోండి. అయితే అంత మాత్రంచేత నలుగురిలోను పెద్దపిన్న తారతమ్యం చూడకుండా అలాగ దులిపివేస్తాడా?"

ఆపైన పేరింభట్టు వ్యంగ్యంగా ఒక చిరునవ్వు విసిరాడు:

"అలాగ దులిపివెయ్యడం తప్పేనను కోండి. కార్యవాదికంతటి గురుసుతనం పనికిరాదు. కాని, మీరు గట్టిగా తలుచుకుంటే ఆయనకొమాత్రం దర్శనం దొరకకపోతుంది గనకనా? ఎందుచేతనో మీకే అలాంటి సత్సంకల్పం కలిగినట్టు కనబడదు."

"ఎందుకు కలగాలీ! ఈయన మొదటినించీ ఇదే వరస! తానేదో మహావిద్వాంసుడైతేమాత్రం! ఎదటివాళ్ళేమైనా పురుగులనుకున్నాడా?"

"పాపం రేపురా! మాపురా అని తిప్పితే మరి దర్శనం కాదని కంగారుపడి ఉంటాడు ఇంతకీ మహారాజులంగారు ఇక్కడ ఇంకా ఎన్నాళ్లుంటారో!"

"ఇంకా ఎన్నాళ్లేమిటి? ఎల్లుండి ఉదయమే గోదావరిదాటి వెళ్ళిపోతూంటేనే!"

అని సోమయామాత్యుడు మళ్ళీ కవిలె కట్టలు తిరగవెయ్యడం మొదలు పెట్టాడు చుట్టూరా కూర్చున్నవారంతా అది చూచి చల్లచల్లగా తమ ఇళ్లకు జారుకున్నారు.

౨

విశ్వేశ్వరాగ్రహారానికి విద్యానాథుడు కొండంత ఆశతో వచ్చాడు ప్రత్యేకంగా అతడక్కడికి రావడానికొక ముఖ్యకారణం ఉంది.

ప్రతాపరుద్రదేవమహీపతి గోదావరికి అవ్వలి ఒడ్డున బలిసిన సాంద్రారణ్యంలో వేటాడనున్నాడన్న వార్త కర్ణాకర్ణిగా అతని చెవినిపడింది ఆ అగ్రహారం గోదావరీతీరాన్ని ఆనుకునేఉంది వేట బలగంతో గోదావరిదాటేముందు మహారాజు విశ్వేశ్వరాగ్రహారంలో రెండు మూడురోజుల పాటు విడిదిచెయ్యడం ఒక పరిపాటి విద్యానాథుడు ముందుగానే ఆ విషయం తెలుసుకున్నాడు

ఎలాగైనా మహారాజు దర్శనం చేసుకోవాలని సంకల్పించాడు. ఆ సంగతి ముందుగా సోమయామాత్యునితో ప్రస్తావించాడు:



ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు

"దానికేమిటి? మహారాజు బహు సులభులు! అందులోను మృగయా వినోదం సందర్భంలో విద్వద్గోష్ఠి అంటే వారు చెవి కోసుకుంటారు ఏదో సమయంచూచి నేను దర్శనం ఇప్పించే ఏర్పాటుచేయిస్తానులెండి!" అని అమాత్యుడు విద్యానాథునికి భరవసా ఇచ్చాడు

కాని మహారాజు అగ్రహారంలో విడిది చెయ్యవలెనని నిర్ణంచుకొన్న మూడురోజులలోను రెండురోజులప్పుడే గడిచిపోయాయి అగ్రహారంలోని నలుగురైదుగురు విద్వాంసులకప్పుడే అనాయాసంగా రాజదర్శనం లభించింది కాని విద్యానాథునికి మాత్రం దర్శనం దొరకలేదు అమాత్యునితో ఎన్నిసారులు చెప్పినా 'అదిగో ఇదిగో' అని కాలక్షేపం చేశాడు ఇక ఇంకొక్కరోజే మిగిలిఉన్నదనగా విద్యానాథుడు మేల్కొన్నాడు

అయితే తలవనితలంపుగా ఇప్పుడతనికీ సోమయామాత్యునికీ మధ్య పెద్ద బద్ధవిరోధం ఏర్పడింది తనమీద అమాత్యునికంతటి ఉపేక్షాభావం కలగడానికి గల కారణమేమో విద్యానాథునికి తెలియలేదు మొట్టమొదట సోమయామాత్యునితో ఆ విషయం సంప్రతించినప్పుడతడు కొంచెం సుముఖంగానే ఉన్నాడు తరవాత తరవాత అంటీ అంటనట్టుగా మాట్లాడడం మొదలుపెట్టాడు ఓర్వలేనితనంవల్ల అగ్రహార విద్వాంసులెవరయినా దర్శనంకాకుండా చేయించవలసిందని చెవి కొరికారేమో! లేకపోతే సోమయామాత్యునికి ముట్టవలసిన మామూళ్ళేమైనా ముట్టలేదని అక్కసు బయలుదేరిందేమో! ఎవరు చెప్పగలరు?

ఆలోచించగా ఆలోచించగా విద్యానాథునికి దర్శనం దొరక్కపోవడానికీ రెండింటిలోను ఏదో ఒకటి ప్రబలకారణమై ఉండవచ్చునని తోచింది అతనివద్దఉన్న నాలుగు వరహాలు దారిబత్తెంకిందే హరించుకుపోయాయి అదీగాక తనవంటి మహావిద్వాంసుడు, కవీ దర్శనానికి వచ్చినా ఈ మామూళ్ళగోలేనా? ఏమిటీదౌర్జన్యం?

అని అవిఘ్నమైన ఆవేశంతో కవి హృదయం కుతకుతలాడిపోయింది ఇక ఒకరోజులో ప్రతాపరుద్ర మహీపతి అగ్రహారంలో వేయించిన తన స్కంధావారం యావత్తు ఎత్తివేయించి వేటబలగంతో సహా గోదావరిదాటి వెళ్లిపోతున్నాడు. ఆయన మళ్లీ తిరిగివచ్చేసరికి ఇంచుమించుగా ఒక పక్షంరోజులు పట్టవచ్చును తిరిగి వచ్చేటప్పుడాయన తొందర తొందరగా ఓరుగలు వెళ్లిపోవచ్చును! ఇప్పుడు కాని దర్శనం ఇక ఎప్పుడో అవుతుందనే నమ్మకంమాత్రం ఏమి ఉంది!

అతనికి విశ్వేశ్వరాగ్రహార ప్రాంతం అంతా కొత్త అక్కడివారినెవరినీ ఎరగడు. ఇక ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు ఒకమారు వేతాళనాయణ్ణి సందర్శించి ఆయనతో తనకు జరిగిన అన్యాయం అంతా పూసగుచ్చినట్టు చెప్పి తిరిగీ న్యాయ్యం జరిగించవలసిందని కోరాలని సంకల్పించాడు. వేతాళనాయని దర్శనమైనా దొరుకుతుందో! దొరకదో! అయినా అధైర్యపడక శిష్యుడు భీమేశ్వర శర్మను పిలిచి ఆ విషయం మెలుకువగా





శేముషీ ధురంధరులైన ఆంధ్ర మహామంత్రులు

మాదన్న అక్కన్న

వర్తకం చేయదలచుకున్న వాళ్ళు కొనడం అమ్మడమే కాదు, ఇచ్చి పుచ్చుకోవడం కూడా నేర్చుకోవాలి ప్రభూ!" అన్నాడు లింగప్ప

మహామంత్రి తల పంకించారు సాలోచనగా, ఆమోద సూచకంగా

పాదిలి లింగప్ప ఘటికుడు బహు సమర్థుడు

ఈస్టిండియా కంపెనీ దృష్టిలో మాత్రం పెంకె ఘటంవంటి వాడు ఆ వర్తకులు ఆ విధంగానే అతనిని గురించి మహామంత్రికి ఫిర్యాదు చేస్తున్నారు చెన్నపట్టణానికి తాము సరుకులు చేరవేసుకోబోతే లింగప్ప ఆటంక పరుస్తున్నాడని విన్నవించుకున్నారు

మహామంత్రి లింగప్పను పిలిపించి సంగతి కనుక్కున్నాడు

* * *

వర్తకం చేసుకునే వారు క్రయవిక్రయ విధానాలతో పాటు ఇచ్చి మరీ పుచ్చుకునే పద్ధతులు కూడా నేర్చుకోవద్దా ప్రభూ అన్నాడు లింగప్ప సవినయంగానే

మహామంత్రి పరేంగితజ్ఞుడు

వినయంగానే అయినా, ధ్వన్యాత్మకంగా లింగప్ప అన్న ఈ మాటలలో గర్భితమయిన అభిప్రాయం ఆయనకు త్రుటిలో అవగతం అయింది ఈ త్రుటిలోనే ఆయన భ్రుకుటి ముడుచుకుంది నాటి రాజకీయ స్థితిగతులు, రాజుల, రారాజుల తీరుతెన్నులు, సైన్యాల, కయ్యాల ధోరణులూ ఆ అపరకౌటిల్యుడి యోచనా ప్రపంచంలో మనోగోచరాలయ్యాయి బిజాపూర్ సుల్తానుకు తమపట్ల అఖండమయిన ఆదరాభిమానాలు ఉప్పొంగటం లేదు అటు ఔరంగజేబు చక్రవర్తి తమవంక, కురంగాన్ని శార్దూలం చూచేటంత వాత్సల్యంతో తిలకిస్తున్నాడు ఈవంక శివాజీకి తమమీద అపారమయిన అనురాగం ఉందని చెప్పటానికి వీలు లేకపోయినా, ఆగర్భ శత్రుత్వ భావం మటుకు లేదు అయితే గియితే, అతనితోనే చెలిమి కలుపడానికి, తద్వారా ఔరంగజేబు దృష్టిలో తమ 'బలిమి కలిమి' ని ఇతోధికంగా చూపి అట్టే నిలబెట్టడానికి అవకాశాలున్నాయి వర్తకానికి వచ్చిన ఆంగ్లేయులతో మంచిగా ఉండడం కూడా కొంతలో కొంత మేలు ముఖ్యంగా ఆంగ్లేయులకూ ఔరంగజేబుకూ మధ్య అన్యోన్యమైన అను

# ★ అక్కన్న; మాదన్న ★

రాగ రసవాహిని పొంగిపొరలటం లేదు ఆంగ్లేయులతో మైత్రికి కూడా ఇదే తగిన తరుణం త్వరగా ప్రయత్నించి అర్థించ వలసిన అగత్యం లేదు వారంతట వారే, వారి అవసరం మీదే సద్భావం, సదుపాయం కోర వచ్చారు.

అయితే మిత్రులుగా వారు కోరిన వరాలు ఇచ్చినా, వర్తకులుగా వారి ప్రభుత్వానికివ్వతగు వరహాలు వదులుకోవడంలో వివేకంలేదు. అయితే, వరాలడుగ వచ్చిన వారిని తానే వరహాలడిగితే, తానిచ్చిన వరాలు కొనసాగవు వాటిలో సొగసు వుండదు మెప్పూ మెహర్బానీ ఉండవు ఆశించిన ఫలితం ఉండదు ఇది ఎక్కడా వికటించకుండా జరుపవలసిన వ్యవహారం. ఇందుకు యోగ్యుడు, సమర్థుడు లింగప్ప ఒక్కడే. మంజూర్లు తాను చేసి, వసూళ్లు అతడికి ఒప్పగించడం ఉత్తమవిధానం

చివరకు, కంపెనీ వారిని ఇబ్బంది పెట్టవద్దని లింగప్పను ఆజ్ఞాపించాడు మహామంత్రి

కంపెనీవారు సంతోషించారు.

అయితే, కంపెనీవారితో ప్రభుత్వం లావాదేవీలన్నీ చూచే పూచీ పేచీలన్నీ లింగప్పే నిర్వహించాలనికూడా ఆజ్ఞాపించారు మహామంత్రి.

లింగప్ప ఆనందించాడు

రాజప్రతినిధిగా ఆ యీ వ్యవహారాలూ ఎంతో సామర్థ్యంతో నిర్వహించాడు.

* * *

ఉభయతారకంగా, సున్నితంగా, లవలేశం అప్రతిష్ఠ లేకుండా, దూరదృష్టితో వ్యవహారాలను ఈ విధంగా నడిపిన రాజనీతి విశారదుడే, ఆనాటి గోల్కొండ రాజ్య ప్రధానమంత్రి పింగళి మాదన్న పంతులు గారు.

సర్వదా వేదాంతగోష్ఠిలో కాలక్షేపం చేసే తానీషా హృదయపూర్వక విశ్వాసానికీ, గౌరవాభిమానాలకూ పాత్రుడై ఆనాటి రాజకీయ కల్లోల సమయంలో, గోల్కొండ రాజకీయరథాన్ని సమయస్ఫూర్తితో నడిపిన సారథి, ధీశాలి

ఈ విధంగా, ఈస్టిండియా కంపెనీకి, స్థానిక ప్రభుత్వంనుండి సదుపాయాలూ, తద్వారా, వారి వ్యాపారమూ పెరిగాయి. తత్ఫలితంగా ఆ ప్రభుత్వంపట్ల ఆంగ్లేయుల సద్భావం, దాంతోపాటు ప్రభుత్వానికి పన్నుల రాబడీ పెరిగాయి. నేర్పూ, ఓర్పూ చూపుతూనే, అవసరాన్నిబట్టి నిష్కర్షగా వ్యవహారం నడపిన లింగప్ప ప్రతిపత్తి కూడా పెరిగింది రెండేళ్లు తిరిగే సరికి (1682 లో), అతడు కృష్ణానదికి దక్షిణాన ఉన్న గోల్కొండరాజ్యం అంతటికీ సుబేదార్ గా నియుక్తుడయ్యాడు అతని కార్యదక్షతకు నిదర్శనం వంటిది, అతడు మద్రాసు గవర్నరుకు 1682 జూలైలో వ్రాసిన ఒక లేఖ పెరుగుతున్న వ్యాపారాన్ని బట్టి, కంపెనీవారు ఏడాదికి 12 వందల వరహాలు పన్ను చెల్లించవలసి ఉంటుందని అతడు నిష్కర్షగా వ్రాశాడు అదికాక, ఉన్న మొహమాటాలనుబట్టి, అక్కన్న గారి ఒడల విషయంలో కొంత సహాయం చేయవలసిందనికూడా వ్రాశాడు

నిజానికి ఆనాడు ఈస్టిండియా కంపెనీ, ఇలాంటి ప్రత్యుపకారాలలో ఎటువంటి లోపము రానిచ్చేదు ఆనాడు చెన్నపట్టణం చాలా చిన్నపట్టణం. ఇప్పటి జార్జిటౌన్ అన్నమాట. క్రమంగా, శాంతోం (మైలాపూరు), ఎగ్మూరు ప్రాంతాలను కౌలుకు అడిగి తీసుకొన్నారు విశాఖపట్నం రేవులో వసతులు కావాలనికోరి వీటకోసం వారు అడపాతడపా అరణాలు సమర్పించుకునేవారు. శుభ కార్యాలకు, పండుగలకూ పబ్బాలకూ కానుకలంపేవారు.

మాదన్న గారి కుమారుడు మల్లప్ప పెళ్ళికి వీసెడు బంగారపు గొలుసులు కావలసి

(65 వ పేజీ చూడండి)



హైదరాబాదు రాజ్యపరిపాలనను సామర్థ్యంతో నిర్వహించిన శ్రీ బూర్గుల రామకృష్ణారావు ఇకమీద కేరళ రాష్ట్రానికి గవర్నరుగా వ్యవహరిస్తారు

my Coffee

చిరునామా మార్పు

మా ఖాతాదారులు, శ్రేయోభిలాషులు మా చిరునామా మార్పు గమనించ వలసినదిగా కోరుచున్నాము ఇచటి నుండి అధిక సదుపాయములతోను, శ్రద్ధతోను సేవచేయ గలమని హామీ యిస్తున్నాము.

లేని చోట్ల ఏజన్సీస్ కావలెను

మై కాఫీ కంపెనీ,

అప్పారావ్ గార్డెన్స్ (సాల్టుకొటార్స్ దగ్గరగా)

చూళై : మద్రాసు-7.

# విజయనగర ప్రతిష్ఠ

## ఏకాంకిక

## సూరంపూడి భాస్కరరావు

[శరత్సమయంలో ఒక అపరాహ్ణ వేళ: 1336 : శృంగేరిలో ఒక విశాలమైన శిలా మంటపం. మధ్య ఉన్నతమైన వేదికమీద పీఠాధిపతి విద్యాతీర్థస్వాములవారు కాషాయాంబరాలు ధరించి, ఆసీనులై ఉన్నాడు. ఎడమవైపున ఎదురుగా శంకరానందుడూ, భారతీ తీర్థుడు, కుడివైపున వేంకటనాథుడూ మాధవుడూ, తెల్లని పంచలూ, ఉత్తరీయములూ ధరించి దర్భాసనాలపైన కూర్చుని ఉన్నారు.]

విద్యాతీర్థుడు: శంకరానందా! (అని రెండోవైపు తిరిగి) వెంకటనాథా! మీ విద్యలు పూర్తి అయినాయి. ఇక మీ మీ ఆసక్తులను బట్టి గార్హస్థ్యాదులను మీరు అవలంబించవచ్చని చెప్పి మిమ్మల్ని పంపుకోవాలనే ఇప్పుడు పిలిపించాను

శంకరానందుడు: (చేతులు జోడించి) స్వామీ, నాకు సన్యసించి మీ సన్నిధానంలోనే సమాధినిష్ఠకై సాధన చేస్తూ ఉండిపోవాలని ఉంది. నాకు గార్హస్థ్యం యెడల ఆదరం లేదు.

విద్యాతీర్థుడు: (పాలోచనగా తల ఊపి భారతీతీర్థుడి వంక చూస్తాడు)

భారతీ తీర్థుడు: శంకరానందుడు కోరినట్టుగానే నా మనస్సుకూడా అభిలషిస్తోంది.

విద్యాతీర్థుడు: (చిన్నగా నవ్వి) మీరంతా సన్యసిస్తే నాకిష్టమనుకుంటున్నారా?

భారతీ తీర్థుడు: (మౌనంగా ఉండిపోయిన శంకరానందుడివైపు చూచి, మళ్లీ గురువు వంక చూచి) కాదు స్వామీ, మీరు నిర్బంధం చేసినా, గార్హస్థ్యం గాని సంసార వాసనలను గాని నే నంగీకరించలేను.

విద్యాతీర్థుడు: మంచిది. నీవేం చేదామనుకుంటున్నావు వెంకటనాథా?

వేంకటనాథుడు: స్వామీ నేను కాంచీపురానికి పోవాలనుకుంటున్నాను.

విద్యాతీర్థుడు: పోయి—?

వేంకట: కోరినవాళ్ళకు వేదాంతదర్శనం బోధిస్తూ కాలక్షేపం చేస్తాను.

విద్యా: ఇంకా—

వేంకట: పుణ్యక్షేత్రాలు సేవించుకుని,

విద్యా: ఊఁ.

వేంకట: (కొంచం సంకోచంగా) చేతనైనంతవరకూ కవిత్వం వ్రాసుకుందామనే కోరిక కూడా ఉంది.

విద్యా: ఏమైనా వ్రాశావా?

వేంకట: వ్రాయాలనే బుద్ధి పొడమింది. మొన్న—

విద్యా: మొన్న—!

వేంకట: (మాధవునివంక చూసి) మీదగ్గర సెలవుతీసుకుని నేనూ, మాధవుడూ పంపా సరస్తీరానికి వెళ్ళినప్పుడు—

విద్యా: వెళ్ళినప్పుడు—ఏం జరిగింది మాధవా?

మాధవు: అక్కడ మతంగపర్వతమూ, మాల్యవత్పర్వతమూ, సుదుఃఖారోహణమూ ఎక్కాము. తుంగభద్రలో స్నానం చేశాం. విరూపాక్షు దేవుణ్ణి దర్శించాం.

వేంకట: నేను చెప్పాలనుకున్నది వేరు స్వామీ!

విద్యా: ఏమిటది!

వేంకట: మేమూ మాల్యవంతాన్ని ఎక్కుదామనుకొంటూ ఉండగా, శిఖరం మీద బరువుగా అనుకుని ఒక నల్లని మేఘం కనుపించింది.

విద్యా: ఊఁ

వేంకట: వెంటనే నాకు ఉత్తరరామ చరిత్రలో

సోఽయం శైలః కకుభసురభి ర్మాల్య
వా న్నామ యస్మి
న్నీలః స్నిగ్ధః శ్రయతి శిఖరం నూతన
స్తోయవాహః!

అన్న పంక్తులు జ్ఞాపకానికివచ్చాయి.

విద్యా: "శ్రయతి శిఖరమద్రే ర్నూతన స్తోయవాహః" అన్న మాలతీమాధవంలో పంక్తి స్ఫురించలేదూ?

వేంకట: స్ఫురించింది స్వామీ. అక్కడ మాధవుడు పంపిన సందేశశ్లోకాలూ, పై మందాక్రాంతమూ చూడగా శ్రీరామ చంద్రుణ్ణి నాయకుడిగాచేసి ఒక సందేశ కావ్యాన్ని నిర్మించవచ్చని భవభూతి మహాకవి సూచన చేసినట్టు తోచింది.

విద్యా: ఆ సందేశ కావ్యం నీవు నిర్మించదలుచుకున్నావన్న మాట.

వేంకట : తమ రాశీర్వదిస్తే; కాళిదాసు ఉత్తరదేశాన్ని మాత్రమే వర్ణించాడు. నేను దక్షిణదేశాన్ని వర్ణిస్తాను.

విద్యా: సత్యదూరమైన వర్ణనలు చేయకు సుమా.

వేంకట: మరచిపోను స్వామీ! అక్కడ

### విద్యానగరం

"భోగస్థితా భోగవతీ చ నిత్యం
సుపర్వ రమ్యా దివిజస్థలీవ
పురీహ విద్యానగరీ చకాస్తి
తుంగా తరంగై రభితః పవిత్రా"

(కల్లనాథుడు)

"ఇంద్రున కాంగిరసుడు, నిష
ధేంద్రున కా సుమతి, రఘుపతికి వారుణినాక
సాంద్ర సువిద్యారణ్య బు
ధేంద్రుడు కులగురుడు బుక్కదేవేంద్రునకున్."

(పరాశర మాధవీయ వ్యవహారకాండ ననుసరించి)

చెరుకుతోటలూ, సగం తెలుగు సగం కన్నడంగా పాటపాడుకునే ఆ శాలిగోపికలూ కళ్లకు కట్టినట్టున్నారు.

విద్యా: సరే: మాధవా పంపాపతి సన్నిధానంలో నీవేం చూచావు!

మాధవ: విరూపాక్ష స్వామియొక్క — సర్వగోచరమైన మహిమను సందర్శించాను. అగస్త్య మహామునియొక్క — లోకోత్తర శక్తి నాకు స్ఫురణకి వచ్చింది. తుంగభద్రా తీరంలోనుంచి గుండె కదిలించే ఆక్రందనం వినపడింది. ఆ శాంతి రాల్లో రగులుతూన్న చిచ్చుకు తాళలేక పోతున్న శతసహస్ర రోదద్యమాన కంఠాలు దరీముఖాలలో ప్రతిధ్వనించాయి యుగంధర, యౌగంధరాయణ చాణక్య ప్రభృతులైన మహామంత్రులు లోక్కసారి నా మనస్సులో మెరిశారు. చలించిన మనస్సుతో జ్వలించిన చైతన్యంతో కలయజూచాను. పంపాపతియొక్క రక్షాదత్తమైన హస్తం ఆ ప్రదేశంలో సర్వప్రకృతికీ అభయమిస్తూ కనుపించింది. నా అంతఃశ్రవణాలలో ఆ ఆక్రందనలూ, నా అంతశ్చక్షువులలో ఆ విరూపాక్షహస్తం అనుక్షణమూ తాండవిస్తున్నాయి. ఆనాటినుంచీ కూడా నేను ఉన్నవిధంగా ఉండలేకుండా ఉన్నాను

విద్యా: నీమనస్సులో ఏమిటీ అశాంతి మాధవా?

మాధవు: స్వామీ, కాకతీయ ప్రభుత ముసల్మానులకత్తి కాహుతి అయిపోయింది. ఓరుగల్లు మట్టిదిబ్బ అయిపోతూ ఉన్నది. మళ్ళీ ఇంతలో ఆ ముసల్మానులధాటికి ద్వారసముద్రం మ్రగ్గిపోయింది. కాని వీటన్నిటికీ వెనక మట్టిదిబ్బ అయిపోతున్నదీ మ్రగ్గిపోతున్నదీ వేరొకటి ఉంది స్వామీ, మనం ఆశ్రమాల్లో విద్యాపీఠాల్లో వేదాలు వల్లిస్తున్నాం. మన కళ్ళముందు భారతీయ ధర్మం తునాతునకలైపోతోంది కాదా స్వామీ?

విద్యా: నీవుచెప్పింది ఒక అంశం. ఇంకొక అంశం ఉన్నది. బహిశ్శత్రువులకంటె అంతశ్శత్రువులే నాశహేతువులు.

మాధవు: (గురుపాదాలనంటి లేచి) ఔను. నాస్తికులు, చార్వాకులు, పాషండులు, కపటవర్తనులు వీళ్లు ఈ ధర్మభ్రంశానికి కారకులు.

విద్యా: (అర్ధనిమేషం ఆగి) సంసారాన్ని చూచి భీతిపడి, శమసాధ్యమైన జ్ఞానాన్ని వెతుక్కుంటూ వచ్చేవాళ్ళకు శంకరానందుడూ భారతీ సహాయపడదలిచారు. నీవు వేరువిధంగా శ్రమించదల్చావన్నమాట.

మాధవుడు: (నమస్కరించి) గురుపరమేశ్వరా! మీబాహిరమైన అనుమతిని పొందకుండా నేను కొంత అతివర్తించాను. ఆశీర్వదిస్తారుకదూ? (సాయణుడు ప్రవేశించి ప్రక్కగా కుర్చుంటాడు)

వేంకటనాథుడు: బాల్యంలో నేర్చుకున్నాడో యేమో, అప్పుడప్పుడు సంగీతశాస్త్రాన్ని తిరిచిచూస్తూ ఉండడం నేను చూచాను

శంకరానందుడు: దర్శనశాస్త్రాలన్నింటినీ మాధవుడు మధిస్తూ ఉండడం నేను గమనించాను.

భారతి: ఇతడు స్మృతులన్నింటినీ ఏకరువుపెడుతూండడం నేనెరుగుదును.

విద్యా: ఊ-నాదగ్గర వేదార్థం మాత్రమే చదువుతూన్నట్టు నటించావు.

మాధవుడు: స్వామీ నను క్షమించరూ. నన్ను ఆశీర్వదించరూ?

విద్యా: (సాయణుడివంక చూచి) ఏమి సాయణా?

సాయణు: అన్నగారు నాచేత వ్రాయించినవీ. సేకరించినవీ తాళపత్ర సంపుటాలు ఒక మహారణ్యంలా మా కుటీరంలో నిండి ఉన్నాయి.

విద్యా: మీ కుటీరంలోనే కాదు, మాధవుడి మనస్సులోనే సకలవిద్యలూ ఒక మహారణ్యంలా గూడు కట్టి ఉన్నాయి.

మాధవు: స్వామీ మీ సెలవైతే నేను పంపాతీరంలో ఆశ్రమం నిర్మించుకుని మిగతా కర్తవ్యం నిర్వహించుకుంటాను.

విద్యా: మీతండ్రిగారి దగ్గరకు పోవూ?

మాధవు: మా భోగనాథుడు పిత్రూణం తీర్చుకుంటున్నాడు. నిర్వహించవలసిన కర్తవ్యం పెనుభూతంలా నన్నావహించి ఉండగా, తండ్రిగారి దగ్గిర నేను చేయగలిగిన దేమున్నది?

విద్యా: సాయణా-నీవేమి చేయదల్చావు?

సాయణుడు: స్వామీ నా విద్యాభ్యాసం పూర్తి కానేలేదు కదా? నేను చేయవలసింది కేముంది?

విద్యా: నీకు ఎవరు పాఠం చెప్తున్నారో వాళ్ళదగ్గర నువ్వు విద్యాభ్యాసం పూర్తి చేసుకోవాలి.

సాయణు: అన్నగారి దగ్గర ఉండమని మీ ఆజ్ఞ కాబోలు.

(బయటనుంచి స్వామీ అని పిలుపు)

విద్యా: ఎవరో చూచిరా.

[సాయణుడు వెళ్లి ఇద్దరు వీరులతో ప్రవేశిస్తాడు. ఇదరూ గురువుకు సాష్టాంగ ప్రణామం చేస్తారు స్వాములవారు ఆశీర్వదిస్తారు. మిగతి శిష్యులకు నమస్కారం చేస్తారు. సాయణుడు రెండు దర్భాసనాలు తెచ్చి వేస్తాడు వాళ్లు కూర్చుంటారు.]

బుక్కరాయలు: ఈయన మా అన్న హరిహరరాయలు. నా పేరు బుక్కరాయలు.

మాధవుడు: (జ్ఞప్తికి చేసుకుని) అంటే మీరు సంగమనాయకుని కొడుకులా?

బుక్కరాయలు: చిత్తం.

మాధవుడు: (హరిహరరాయలు వైపు చూచి) అవును. అదంతా ఒక పురస్కారం క్రిందటి మాట అప్పుడు కాకతీయ రాజ్యంలో కోశాధికారులుగా ఉండేవారు.




# పూవు మీ అదృష్టం చెప్పగలదు

నీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, నీ సరియైన చర్య గురించిన్నీ నీవు తెలుసుకొన గోరినట్లయితే ఒక పోస్టు కార్డు పైన నీ కిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, నీవు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, నీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపుము.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, నీవు కార్డు వ్రాసిన తేదీ లగాయతు 12 మాసములలోను నీ యొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో నీకు జయము కలుగును. నీ ఉద్యోగం విషయంలో మంచి చెడ్డలు, మార్పులు, ఆరోగ్య విషయము, పరదేశ గమనము. తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధి నిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభం మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రము వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవైనా వున్నయెడల శాంతి చేయు విధానం కూడా తెలుపుడు చేయడమగును వివరములు మా పూచీపైని పంపబడును. మేము పంపిన భోగటా నీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును ఒకసారి పరీక్షించి చూడుడు మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి

Shree Swami Satyanarain Jyotish Ashram (W. P. A.), NAKODAR (Pb.)

# ఆంధ్రజనని

జయము! జయమ్మాంధ్ర జగ
జ్జననీ! మముగన్న తల్లి!
జయ! జయ! హేద్వీపాంతర
వలిత లలిత కీర్తివల్లి!

నీ పురాప్రభం దలంచి,
నీపదముల మోళులుంచి,
పూజించెద మెదల మేము
తేజోమయవిగ్రహమ్ము!
తరళ కృష్ణవేణీ గో
దావరీ హృదయహారా!
చరణోచ్ఛలసాగరమణి
కిరణోజ్జ్వల మంజీరా!

జయము జయమ్మాంధ్ర జగ
జ్జననీ! మము గన్నతల్లి!
నిఖిలాంధ్ర మ్మొకగళముగ
నీ ఘనజయమంగళముగ
స్థాపించెద మనుదినమ్ము
మా పూర్వ ప్రాభవమ్ము
వీరరెడ్డి నృపతిమనో
హారి మధూత్సవతోరణ!
సార్వభౌమ కృష్ణరాయ
జయనీరాజితవదనా!

దిగ్దిగంత జలనిధులన్
దిగ్దంతి శ్రుతిగతులన్
ఘోరను గాకాంధ్రయశో
భేరీ గంభీరఘోష!
శాసితాంధ్ర రాణ్మహేంద్ర
జనపతి పూజితచరణా!
భారతకవితారుణ మం
దారమాలికాభరణా!

జయము! జయమ్మాంధ్రజగ
జ్జననీ! మముగన్నతల్లి!
జయ జయ హే! ద్వీపాంతర
చలిత లలిత కీర్తివల్లి!

"శాస్త్రి"

బుక్కరాయలు: ప్రస్తుతం ఒక విధమైన అజ్ఞాతవాసంలో ఉంటున్నాము మేము దాదాపు అయిదారు సంవత్సరాలుగా కుంజరకోణంలో ఒక చిన్న సంస్థానం ఏర్పరచుకొని కాలక్షేపం చేస్తున్నాను. ఒక నూరుగు రాశ్వికులూ ఒక వెయ్యి కాల్బలమూ ఇప్పుడు మాకున్న బలం.

విద్యాతీర్థుడు: అయితే, మా పీఠానికి రావటంలో గల కారణం నాకవగతం కాలేదు.

హరిహరరాయలు: పంపాపరిసరాల్లో మీరు తరుచు సంచరించే ఉంటారు.

విద్యా: విశేషంగానే సంచరించామని చెప్పవచ్చు.

హరిహర: మేమీ ప్రాంతంలో నిన్న లాంఛనంగా వేటకి వచ్చిన సందర్భంలో—

బుక్క: ఒక మహాశ్చర్యం జరిగింది ఒక కుందేలు మా వేపిని తరుముకొని వచ్చింది. వేపి తోకముడుచుకొని మా గద్దశరణు పొందింది.

హరిహర: దీని అంతర్యమేమో తమరు సెలవియ్యగలరని మా ఆశ!

విద్యా: చిరునవ్వుతో శిష్యులవైపు చూస్తాడు. శంకరానందుడు భారతీ నివ్వెరపోతారు. వెంకటనాథుడు సాలోచనగా తల పైకెత్తుతాడు)

మాధవు: స్వామీ నేను మీకు విన్నవించుకునే ఉన్నాను, విరూపాక్షదేవుని రక్షాదీక్షమైన హస్తాన్ని ఆ స్థలంలో ప్రతిగడ్డిపోచలోనూ నేను సందర్శించానని. వానరులు కూడా రాక్షసనిహంతలు కాగలిగిన పుణ్యదేశం కదా అది. మతంగముని, అగస్త్యముని పావనం చేసిన పవిత్రక్షేత్రం కదా అది. శ్రీరామచంద్రుడు అంజనానందనుణ్ణి కలిసిన దివ్యస్థానమది. ఇదే స్వామీ భారత ధర్మపతాకకు అలంబభూమి! ఇదే ధర్మద్రోహులను భస్మం చేయగల విరూపాక్షదేవుని ఫాలపట్టిక!

హరిహర: అయ్యా ఈయనెవరో తమ శిష్యులనుకుంటాను ఈయన పలుకులు వింటూంటే నాలో ఏదో ఉత్సాహం ఆశ జనిస్తున్నాయి.

మాధవు: నా ఆవేదనకు ఆలంబం ఇప్పుడే ప్రసాదించాడు పరమేశ్వరుడు. (రాయలనుద్దేశించి) అయ్యా మీ ఒక్కరిలో జనించితే చాలదు ఈ నా తపస్సుతో అశేష ప్రజాహృదయంలో ఉత్సాహం ఆశ జనించాలి. ఆర్యధర్మం పునఃప్రతిష్ఠితం కావాలి.

హరిహర: అట్టి ఆశీర్వాదాన్నే మీ గురువులవద్ద మీవద్ద పొందడానికి వచ్చాం.

బుక్కరాయలు: ధర్మసంస్థాపనార్థమైన ఈ దీర్ఘసత్రారంభం ఏవిధంగా జరగాలో సెలవియ్యాలి.

మాధవు: గురుపాదుల అనుజ్ఞ ఉంటే సర్వ సమారంభమూ చేయవచ్చును.

విద్యా: కరణీయమేమిటంటావు మాధవా?

మాధవు: అయ్యా ఆ తుంగాపునీత ధర్మక్షేత్రంలో ఒక నూతననగరం నిర్మింపబడాలి ఆ విరూపాక్షమూర్తి ఛత్రచ్ఛాయలో అరిగుర్భేద్యమైన ఒకదుర్గం ప్రతిష్ఠాపించాలి. కాదా స్వామీ?

(విద్యాతీర్థుడు సాలోచనగా తల పంకిస్తాడు)

మాధవుడు: (ఖేదంతో) ఆచార్యా! తమకేదో శంకకలుగుతూ ఉన్నట్టు తోస్తోంది. మీరు సర్వాత్మనా నా ఈ మాటల నాదరించటం లేదు.

విద్యా: మాధవా, ఈ వీరులదగ్గర ఉన్న బలం స్వల్పం. విధ్వంసకులబల మనల్పం. ఆ బలాన్ని అరికట్టగల రాజ్యస్థాపన చేయాలని నీ సంకల్పం. ఇది సాధ్యకల్పమేనా?

మాధవుడు: ఎందుకు సాధ్యంకాదు. కోటలు నిర్మించాలంటే, నగరాలు నిర్మించాలంటే బహుళసైన్యాన్ని భరించాలంటే ఎంతద్రవ్యమైనా కావలసిఉంటుంది. అలనాడు చాణక్యుని తలపెట్టి రాజ్యస్థాపన చేయలేదా స్వామీ?

విద్యా: చాణక్యుడని చులకనగా చెబుతున్నావు. ఆయనకు గల పట్టుదల అందరికీ ఉండదు. అతడు తక్షశిలలో విద్యాభ్యాసం పూర్తి చేసిన తరువాత ఒకరోజున అతడి తల్లి దుఃఖిస్తూ వుంది. అదిచూచి "ఏమిటి నీ దుఃఖ కారణం?" అని తల్లి నడిగాడు చాణక్యుడు. ఆమె అంది "నాయనా, నీ ముఖలక్షణాలు చూస్తే సామ్రాజ్యధురంధరుడవౌతావనిపిస్తోంది. ఆనాడు ఈ ముసలితల్లిని నీవాదరిస్తావో లేదో అని దుఃఖపడుతున్నాను" అని. "తల్లీ నీ చాణక్యుడు అధికారలోభంచేత మాతృద్రోహం చేయగల

# ★ విజయనగరం ప్రతిష్ఠ ★

మహాపాపి కాదు ఆ ముఖలక్షణం ఏమిటో చెప్పమన్నా ఇప్పుడే నేను బుజువుచేస్తాను" అన్నాడతడు. "నీపలుకులు అలా ఉందిరా" అందావిడ. వెంటనే ఆ బ్రహ్మచారి తన బ్రహ్మదండంతో పలువరుసను రాలగొట్టుకొని "నిన్ను విడువను నీ సేవను మరువను నమ్ము తల్లీ" అని ఓదార్చాడు. అంతటి కఠోరనిశ్చయుడతడు. అదీకాక, అతని యత్నమంతా ఒక అధికారాన్ని నిర్మూలించి మరొక ధర్మప్రభుతను స్థాపించడం వరకే! కాని నీవు నగరం నిర్మించాలంటే ధనసమృద్ధి ఉండాలి కదా?

మాధవు: ఆచార్యదేవా నా దీక్షను శంకించకండి. నన్నాశీర్వదించండి. నేను లక్ష్మిని ప్రసన్నను చేసుకుంటాను. రసవిద్యను అభ్యసిస్తాను. అభ్యసించడం మాత్రమే కాదు కనకవర్షం కురిపిస్తాను. హరిహరరాయా మీరు అధైర్యపడవద్దు. గురువుల అనుమతికోరండి. భూలోకంలో సాటిలేనిదిగాగల మహానగరాన్ని నిర్మిద్దాం. ఆ నగరం విజయపరంపరాభివృద్ధి నందుతుంది. దానికి విజయనగరం అన్నది సార్థకనామం అవుతుంది.

విద్యా: మాధవా, నీవు రసేశ్వరవిద్యనభ్యసిస్తావా?

మాధవు: తమ అనుగ్రహం ఉంటే అచిరకాలంలోనే రసేశ్వరసిద్ధిని పొందడానికి బ్రహ్మప్రయత్నం చేస్తాను. (మొక్కరిల్లుతాడు)

విద్యా: (సంతోషంతో దీవించి) శంకరానందా అభిషేకజలం తీసుకోండి (అందరూ కమండలువులు గ్రహిస్తారు మంత్రం జపించి చేతుల్లో జలంతీసుకుని) నేటినుంచి విద్యారణ్యుడనే పవిత్రనామంతో ఇతడు నరలోక చతుర్ముఖుడై ఆచంద్రార్కమైన యశస్సునందుగాక. (నీరు మాధవుని శిరస్సుమీద చల్లుతాడు శిష్యులకూడా మంత్రజలం చల్లుతారు)

విద్యా: హరిహరరాయా, ఈ విద్యారణ్యుడీనాటినుంచీ మీకు గురువు అదేకదా మీరుకోరుకున్నది?

హరిహర: ఈ మీ ఆశీర్వచనము ఋషివాక్కు.

విద్యా: మాధవుడి భుజంమీద చేయివేసి రాయలూ! ఇతడు సకలవిద్యానిధి ఈతని ప్రజ్ఞాచక్షువుకు కానరానిదిలేదు. ఈ విద్యారణ్యుని వదనసరస్వతిని ఆదరించినంతకాలం మీకు సకలశుభములూ కలుగుతాయి. భారతజాతిలో నూతనోత్తేజం కలిగించడానికి ఆవిర్భవించినయుగపురుషుడీతడు. రేపటిబహుళ చతుర్థికి విరూపాక్షవనంలో నగరప్రతిష్ఠ చేయండి. ధర్మరాజ్యపునఃప్రతిష్ఠచేయండి. అది విజయనగరమై విద్యానగరమై భాగ్యనగరమై విలసిల్లుతుంది.

హరిహర: తమ ఆశీర్వచనబలం (హరిహరుడూ, బుక్కరాయలూ నమస్కరిస్తారు)

విద్యా: మాధవా నీవు విరూపాక్షనిలయానికి పోయేముందు నాకు వాగ్దానమిచ్చిపోవాలి

మాధవు: ఆజ్ఞాపించండి స్వామీ,

విద్యా: నీవు పరాశరస్మృతి చదివావా

మాధవు: చిత్తం

విద్యా: అందులో వ్యవహారకాండ ఉన్నదా?

మాధవు: కానరాలేదు

విద్యా: మరిరాజ్యపాలనకవసరం కాదా?

మాధవుడు: అత్యవసరం.

విద్యా: ఆ వ్యవహారకాండను నీవు సంగ్రహించాలి,

మాధవుడు: తమ ఆజ్ఞ

విద్యా: ఇంకొకటి నీవు వేదభాష్యం రచించాలి. సాయణ రాజకార్యభారంలో మీ అన్న చేయలేనిది నీవు చేయాలి. ఈ వేదభాష్యాన్ని మీరు మరువకూడదు

(సాయణుడు మాధవుడూ తలలు వంచి నమస్కరిస్తారు)

విద్యా: విద్యార్థులకు విద్యావితరణమూ, నీపరిజ్ఞానాన్ని గ్రంథస్థంచేయడమూ నీవిధి.

మాధవు: తమ ఆజ్ఞ మీరను

విద్యా: అంతర్శత్రునిర్మూలనం మరువవు కదూ?

మాధవు: మరువను

విద్యా: శంకరానందా, వేంకటనాథా, శిక్షావల్లి చెప్పండి.

అందరూ: సత్యంవద. ధర్మం చర. స్వాధ్యాయాన్మా ప్రమద

(తెరపడును)

తెరలో

విద్యారణ్య కటాక్షము
కర్పూరపు టవాసమొ
కల్హారకుసుమ మాయొ
ఇదుమయూఖమొ చర్విత
చదమోదుగవార్ని
ధీవీచికయో

విద్యారణ్యముని గ్రుడు
కలువయొ! లు మొగము లేవి?
లివాకడో! భు ములేవి?
శివుడా? ముక్కటి గాడె!
చె వేయే? ర
జ్యోతియితడే!

(శాసనమునుసరించి) ★


నిగనిగలాడు దీర్ఘ కుంతలాలకు

కేశవర్ధని

KESAVARDINI

SOUTH INDIA CHEMICALS COIMBATORE

తలోని
చుండును
పోగొట్టండి

కురుపును దురదను మాన్పండి వెంట్రుకలురాలుట
ఆపండి అకాలంలో వెంట్రుకలు యెదుకు నెరియాలి
నెరియుట ఆస్యకానివ్వండి

కేశవర్ధనితో కేశాకు క్రొత్త కళ చేకూర్చండి
కేశ శుభ్రతకు సువాసన షాంపూ వాడండి

కేశవర్ధని ఆ. 14 షాంపూ అ 14 పోస్టేజి అదనం అన్నిచోట్లా లభించును

కేశవర్ధని ప్రాడక్ట్సు కోయంబత్తూరు

నేషనల్ సేల్సు & సర్విస్ (సదరన్) లిమిటెడ్ కిగ్గావ్ పేట బెజవాడ N

[అనంతపురం జిల్లా కదిరి పట్టణము పొలిమేరలలో క్రీస్తుశకము 1429 ప్రాంతమున కట్టబడి నేటికీ చెక్కు చెదరకుండా నిలచి వున్న "చంద్రవదన - మోహియార్" గోరీకి సంబంధించిన కథ. హిందూ యువతికి - మహమ్మదీయ యువకునకు కలిపి ఒకే గోరీని కట్టిన విచిత్ర ఘట్టమది.]

# చంద్రవదన

అరుణోదయ రుధిరకాంతులు సముద్ర గర్భములోని బడబాగ్ని జ్వాలలవలె పైకి వస్తున్నాయి పాలగచ్చు చేయబడిన రాజాంతఃపుర సౌధోపరిభాగమున అరుణ కాంతులు ప్రతిఫలించి మహా రక్తపాతము వలె విభ్రాంతి గొలుపుతూవుంది

చెలికత్తె కాలాంబ ఉపాహార పళ్లెముతో వచ్చింది కాని రాకుమార్తె చంద్రవదన అలంకరణ మింకనూ పూర్తి కానేలేదు

"ఏమమ్మ యీనాడు మరీ సింగారించుకొంటున్నావు."

"ఈ వేళతో వసంతోత్సవం పూర్తవుతుంది కదవే"

"ఓహో! కదిరి పట్టణము ప్రయాణానికా? సాయంకాలం ప్రయాణానికి యిప్పటినుంచీ యెందుకమ్మ" కాలాంబ తాను తెచ్చిన పళ్లెమును మేజామీద పెట్టి చంద్రవదన అలంకార నిర్వహణములో సాయపడుతూ వుంది

"అంతఃపురందాటి అవతల అడుగుపెట్టే రోజు యీ ఒక్కటేకదవే! మళ్లీ సంవత్సరం గడచి యీరోజు వస్తేగాని యిటువంటి అవకాశము రాదుగదా! సంవత్సరానికి యీ ఒక్కరోజే నే మా రాచకన్యలకు కాస్తస్వేచ్ఛ - ప్రకృతినిచూచేభాగ్యం కలుగుతాయి తక్కిన సంవత్సరమంతా మేము నేరము చేయకపోయినా అంతఃపురంలో బందీలమే పసిడిపంజరాలలోని మాటలు నేర్చిన చిలుకలమే అంతేగా" అంటూ అలంకరణ పూర్తిచేసి బొట్టుపెట్టుకొందామని నిలువుటద్దం ముందునిలచి బంగారపు కుంకుమబరిణ అందుకొంది చంద్రవదన.

"అందుకని - యీనాడే మీ సోయగాన్నంతా వసంతోత్సవం చూడవచ్చే రాకుమారులకు ప్రదర్శించాలనా" అని నవ్వేసి పారిపోతూవుంది చెలికత్తె కాలాంబ.

"ఛీ! పో! పాడుపిల్లా" అంటూ— ఆ కోపంలో ఆలోచించకుండా చేతిలో వున్న కుంకుమ బరిణని కాలాంబమీదికి విసిరివేసింది చంద్రవదన ఆ బరిణ గోడకు తగిలి మూతవీడి క్రింద పడిపోయింది. కుంకుమంతా నేలపాలయి పోయింది. చంద్రవదన, నుదుట బొట్టు లేకుండానే వుంది రాచబిడ్డ ఫాలభాగానికి తిలకం దిద్దవలసిన ఆ కుంకుమ నేలపాలయి బలిసలమునంగు రక్తమువలె కనిపిస్తూవుంది

నేటి "ఆంధ్రప్రదేశ్" సరిహద్దులే యించుమించు నాటి ఆంధ్రరాజ్యపు ఎల్లలు ఆ తెలుగురాజ్యాన్ని రేచెర్ల

## "కావ్యశ్రీ"

వంశమువాడగు మూడవ సింగమనాయకుడు పరిపాలిస్తున్నాడు ఇతడు - క్రీస్తుశకము 1330 మొదలు 1430 వరకు తెలంగాణము నేలిన పద్మనాయకులలో కడపటివాడు ఈ పద్మనాయకులు కాకతీయులవద్ద దండనాథులుగా పనిచేసి సామ్రాజ్యపతనానంతరం స్వతంత్రులయ్యారు. తెలంగాణమును యవన పాదాక్రాంతము గాకుండ కాపాడిన మహావీరుడు ముసునూరి కాపయనాయకుడు ఇతడు యవనులనోడించి క్రీస్తుశకము 1337 లో ఓరుగల్లు దురమును స్వాధీనము చేసికోవటముతో తెలంగాణము కేవలము తెలుగు మాగాణమై నిలచింది అప్పటినుంచీ కూడా ప్రతిరాజు స్థానిక తురుష్క హిందూ సమైక్యతకు విశేష కృషిచేస్తూ వచ్చారు. పద్మనాయకులలో కడపటివాడు సింగమనాయకుడు క్రీస్తుశకము 1410 మొదలు 1430 వరకు రాజ్యపాలన చేశాడు. ఇతని కాలములో హిందూ ముస్లిములు జాతిభేదము మరచి అన్నదమ్ములవలె కలసిమెలసి జీవిస్తున్నారు. ఈ రేచెర్ల సింగమనాయుని యేకైక పుత్రికయే "చంద్రవదన"

చంద్రవదన సార్థకనామధేయ - షోడశవర్ష నవయౌవనజిత సంపూర్ణ శరచ్చంద్ర వదన. మహా వైభవోపేతముగా జరిగి నేటితో ముగుస్తూవున్న వసంతోత్సవానికి వెళ్ళటానికి అలంకరించుకొంటూవుంది రాచకన్నె చంద్రవదన

పీర్ల పండుగలకు గుమ్మటాలునిలిపి హిందువులు మసీదులో నమాజుచేసే ఆ బంగారు కాలంలో-హిందూదేవాలయాలలో ముస్లిము ఫకీరులు భాగవతరామాయణ గాథలు గానముచేసే ఆ రత్నాలసీమలో వసంతోత్సవం మహోత్సాహంగా జరుగుతూవుంది. ద్వారపాలకుని మొదలు రాజ్యపాలకుని వరకు రాజ్యములోని ఆబాలవృద్ధులు స్త్రీ పురుషులు వసంతోత్సవ క్రీడావినోదాలతో ఆనందిస్తున్నారు ఆ వసంతోత్సవం మానవ సమైక్యతా మహోత్సవం!

ఆ రోజు వసంతోత్సవాలకు కడపటి రోజు రాజ్యములోని మొత్తము జనాభాతో కదిరి పట్టణము పిక్కటిల్లిపోతూవుంది. నృసింహస్వామి ఆలయము చుట్టూ నాలుగు మైళ్ల దవరంలో ఎటుచూచినా ప్రజలే! ఎటుచూచినా ఆనందమే! ఆ మహాప్రజ కోలాహలధ్వని మహాసముద్ర ఘోషలా వుంది

నృసింహస్వామి ఆలయ ప్రాంగణమునకు తూర్పుదిక్కున ఒక్కటే ద్వారం! రాకపోకలు ఆ ద్వారాన్నే జరుగుతాయి ఆలయము చుట్టూ, ప్రాంగణము వెలుపల నవరత్నాల దుకాణాలు-పగడాల అంగడులు-కాశ్మీరు శాలువల శాలలు-అరేబియా గుర్రములు-రత్నకంబళుల విక్రయశాలలు-వినోద ప్రదర్శనలు-కోడిపందెములు-పొట్టేళ్ల యుద్ధ

## తెల్లవెంట్రుక లుండవు

(GOVT REGD)

రంగులనుచూచి మోసపోవద్దు. అది తాత్కాలికము మా సువాసన "మన్ మోహిని హేర్ ఆయిల్" అనేక వనమూలికలతో ఆయుర్వేద పద్ధతిలో తయారైనది 60సం॥ల వయస్సువరకు వెంట్రుకలను నల్లగా వుంచును ఇదిగాక మెదడుకు చల్లదనము నిచ్చును. ఉన్మాదము, తలనొప్పి వగైరా జబ్బుల నాశియగు "జ్ఞాపక శక్తి"ని కంటిచూపును వృద్ధిచేయును కొద్దిగా నెరసివుంటే ఒక సీసా రు 5-0-0, 3 సీసాలు రు 12-0-0 సగము నెరసివుంటే ఒక సీసా రు 6-0-0 3 సీసాలు రు. 15/ పూర్తిగ నెరసివుంటే ఒక సీసా రు 7/-లు 3 సీసాలు రు 18/-లు. పని చేయలేదని ఋజువుపర్చిన పూర్తి సొమ్ము వాపసు చేయబడును.

Guarantee Supplied on Special request
GENERAL LABORATORIES,
(P W) P.O. Rajdhanwar (H. Bhagal).






## కలవరపడు స్త్రీలకు



"కుమారి" (మాత్రలు) ఋతువకండి మీ ఆరోగ్యం రక్షించును చింతఅనవసరం

వెల (సాదా) రు. 3/-
(స్పెషల్) 5/-
(ఎక్స్ట్రా స్పెషల్) 8/-
పోస్టేజి ప్యాకింగ్ ప్రత్యేకం

Mrs. P. Devee, F.D.S. (AP) Calcutta-40.
స్టాకిస్టు: Indo Medical supplies
No. 3 Paulliappan st, Seven wells
Madras - 1.





# ★ చంద్రవదన ★

ములు-దొమ్మరి ఆటలు-వున్నాయి వెన్నెల రాత్రులు కావటంవల్ల ప్రజల వినోదార్థం రాత్రికి జక్కుల యక్షగాన ప్రదర్శనలకు-వైష్ణవాచార్యుల భాగవత ప్రదర్శనలకు-బొమ్మలాటలకు శాలలు నిర్మించారు చుట్టు పట్టుగల రాకుమారులు అనేకమంది వచ్చారు. నవరత్నాలు-గుర్రాలు వారి నెక్కువగా ఆకర్షించాయి ప్రాంగణ ద్వారమున కెదురుగా దౌలత్ ఖాన్ పచ్చల పగడాల దుకాణముంది. ఖాన్ రాకుమారులతో పచ్చల బేరము సాగిస్తున్నాడు అతని వెనుక ఒక యువకుడు కూర్చుని మహాదీక్షతో బంగారు తీగతో "పచ్చల-పగడాల' హారం అల్లుతున్నాడు.

సాయంకాలం సమీపించింది. వృద్ధ భానుని తప్త సువర్ణ మయూఖాలు-గంధ కర్పూర వసంతాలతో తడిసి ఎగపెక్కిన ప్రజల వస్త్రాలపైబడి మరింత రక్తవర్ణముతో ప్రకాశిస్తున్నాయి ప్రజలలో కలకలం బయలుదేరింది. శంఖారావం వినిపించింది జై జై నినాదాలు మిన్నుముట్టాయి. రాజధానినుండి సకుటుంబ సపరివారముగా వెడలి వచ్చాడు రాజు నృసింహస్వామిని సేవించి తిరిగి రాజధానికి వెళ్ళిపోతారు. రాచకన్నెలలో పెండ్లికి సిద్ధముగానున్న వధువు స్వామికి పూజచేసి హిందూ సాధువులకు-ముస్లిము ఫకీరులకు వస్త్రప్రధానం ప్రాంగణము లోపల చేసేసి వెళ్ళిపోతుంది పూజానంతరం రాజకుటుంబము తిరిగి వెళ్ళిపోయేవరకూ రాజు, సాధువులు, ఫకీరులు తప్ప తక్కిన పురుషులెవ్వరు ప్రాంగణంలో కాలుపెట్టరాదు అది ఆనాటి ఆచారం! చంద్రవదన-రాజమాత-చెలికత్తెలు ప్రాంగణ ద్వారము చెంతనే పల్లకీలుదిగి కాలినడకతో ఆలయానికి వెళ్లారు చంద్రవదన స్వామిని యథావిధి పూజించింది బయటకువచ్చి చెలికత్తె అందించిన వస్త్రాలు సాధువులకు ఫకీరులకు దానం చేసింది. అంతా ఆమెను ఆశీర్వదించారు. తిరుగు ప్రయాణము ప్రారంభమైంది. ద్వారము చెంతకువచ్చి చంద్రవదన పల్లకీ యెక్కబోతూవుంది. ఇంతలో ప్రజామధ్యమునుంచి బ్రహ్మాండమైన ఆర్తనాదాలు హాహారవాలు ఒక్కుమ్మడిగా కోటి గొంతులతో వినిపించాయి. అంతా నిశ్చేష్టులై నిలచిపోయారు. నాలుగు బారల నాగరాజు పడగవిప్పి బుసలుకొడుతూ ప్రజలమధ్యపడి వచ్చేస్తున్నాడు. ప్రజలు భయభ్రాంతులై వికావికలై తండోపతండాలుగా పారిపోతున్నారు. ఆ పాము తిన్నగా చంద్రవదన దగ్గరకువచ్చి నిలువెత్తున లేచింది, చూచీ చూడటంతోనే చంద్రవదన కొయ్యబారిపోయింది రాజు, సైనికులు-తక్కిన వారంతా చేత ఆయుధాలుపట్టి కూడా శిలాప్రతిమలులా నిలుచుండిపోయారు ప్రజల ఆక్రందనలకు అంతులేదు అంతలో ఖాన్ దుకాణముపై కూర్చుని "పచ్చల పగడాల" హారం అల్లుతూవున్న ఆ యువకుడు చటుక్కున లేచివచ్చి మొలలోని బాకుతీసి పాము పడగపై బలంగా పొడిచాడు. ఆ పోటుతో బాకు పడగనుచీల్చుకొని భూమిలోకి దిగిపోయింది. అందరకూ ఒక్కసారిగా చైతన్యము కలిగింది చంద్రవదన స్పృహవచ్చి చూచేటప్పటికి ఆ పామింకా కొట్టుకొంటూనే వుంది దానితోక పట్టుకొని మెలివెట్టి మెలివెట్టి అది చచ్చిపోయిన తర్వాత వదిలేశాడా యువకుడు. దౌలత్ ఖాన్ పరుగెత్తుకువచ్చి దూరంనుంచే సలాం చేసి రాజు పాదాల చెంత వాలిపోయాడు.

"పగడాల వర్తకుడు దౌలత్ ఖాన్ సాహేబా? ఏమిటిది?"

"అవును హుజూర్! తమరు రక్షించాలి" అంటూ పాదాలుతాకి సలాము చేశాడు.

"ఎందుకు?" ఆశ్చర్య పడ్డాడు రాజు.

"వీడు ఆలోచించకుండా సాహసానికిదిగి తప్పు చేశాడు హుజూర్! జనానా ఉన్న చోటుకు రాకూడదని తెలిసికూడా యువరాణీ సాహేబాకు పామువల్ల ప్రమాదం వస్తుందేమోనన్న భయంచేత యింతసాహసానికి తెగించాడు కాని మరేంగాదు మహారాజా! ఈ పిల్లవాడిని రక్షించాలి ప్రభూ!"

"ఎవరీయువకుడు?"

"నా కొడుకే జహాబ్"

అప్పటికే పల్లకీయెక్కి అతనివంకఓరగా చూస్తూవున్న చంద్రవదన ఆ యువకుని కన్నులు తన కన్నులతో కలియగానే చూపు మార్చింది

"పేరు?" సాలోచనగా అడిగాడు రాజు.

"పేరు-మొహియార్ హుజూర్"

చంద్రవదన మొహియార్లు మరొకసారి చూచుకొన్నారు రాజు నవ్వి అన్నాడు.

"ఖాన్! నీ తనయుని క్షమించటంగాదు సన్మానిస్తున్నాను నేనుకూడా కర్తవ్యాన్ని మరచి నిర్జీవంగా నిలచిపోయిన ఆ విపత్సమయంలో ప్రాణాలకు తెగించి మా చంద్రవదన ప్రాణాలను కాపాడినందుకు నీ తనయుని అభినందిస్తున్నాను"

ఈసారి మొహియార్ రాజుకు నమస్కరించి చంద్రవదన వంక చూచి చిన్నగా నవ్వాడు. చంద్రవదన సన్నగా నవ్వి పల్లకీ తెరలు మూసేసింది.

"మోహియార్! నిన్నొక దండనాయకుని చేస్తాను ఇష్టపడితే కొలువుకురా!"

"జహాపనా! యీ చేత్తో కత్తిపట్టటం చూచి మీరలా అనుగ్రహిస్తున్నారు అవసర సమయం కొకటే కత్తిపట్టవలసి వచ్చిందే గాని - ఇంతకుముందెన్నడూ - యీ చెయి కలము నేగాని కత్తినిబట్ట నెరుగదు" విన్నవించాడు మోహియార్

"హుజూర్! మీ దయవల్లనీకు తెలుగులో కవిత్వం చెప్పతాడు! బాగా పాడతాడు కూడాను" ఖాన్ సాహెబు చల్లగా అన్నాడు రాజు ఆశ్చర్యంగా చూస్తూ! "ఏమిటీ! అలాగా! అయితే రాజదర్బారు నీకు మహానందంతో స్వాగతమిస్తుంది తప్పకరా" అని పల్లకీ యెక్కాడు రాజు

"అలాగే హుజూర్" అన్నాడు ఖాన్

"నమస్కారం" సెలవు తీసికొంటూ వున్న మోహియార్ వంక పట్టుపరదా చాటు నుంచి తొంగిచూచి చిరునవ్వు నవ్వింది చంద్రవదన తర్వాత మోహియార్ చచ్చిన పామునుచూచి విచలితుడైనాడు అతని మనసెందుచేతనో అకస్మాత్తుగా కలతబారి పోయింది ఆ పామును తీసికొనివెళ్లి పట్టణానికి ఉత్తర దిక్కున పొలిమేరలలో సమాధి చేశాడు ఆ సమయంలో తన కంఠానికా పాము చుట్టుకొన్నట్లు భావించి స్తంభించి పోయి—చైతన్యం తెచ్చుకొని ఆ నకటు వంటి భావన యెందుకు కలిగిందో తెలియక అర్థంకాని ఆవేదనతో బాధపడుతూ ఆపాము సమాధిపై శిరసువైపు చిహ్నముగా నొక రాతిని పాతి వేదనాందోళితుడై తిరిగి వచ్చాడు

* * *

"ఏమిటమ్మా యీ చిరాకు! ఏ వస్తువూ నచ్చటం లేదా! ఇందాకనగా పెట్టివెళ్లిన ఫలాహారం అలాగే వుందే! ఇంత పరాకెలా వచ్చిందమ్మా?"

"ఏమిటే నీగోల?"

"ఏముందమ్మా! నా మనసు మీమీద— మీ మనసు మోహియార్ —"

"ఛీ! పో! పాడుదానా" లేనికోపం తెచ్చుకొని పళ్లెంలోని ద్రాక్షగుత్తి కోలాంబ ముఖాన్న వేసికొట్టింది కోలాంబ ఆ ద్రాక్షగుత్తిని జాగ్రత్తగా అందుకొని వయ్యారంగా తింటూ" అయితే నేను వెళుతున్నాను ఆ కవిగాయకశిఖామణి వచ్చారు దర్బారులో—" అంటూ వెళ్లిపోబోయింది చంద్రవదన సిగ్గు దొంతరలచాటునుంచి నవ్వు వెన్నెలలు విరజిమ్మింది

"మాటే—"

"ఏమిటమ్మా—"

"ఏమే! ఆ వచ్చారా"

"ఎవరమ్మా?"

"అతనేనే"



కడపజిల్లాలోని ప్రఖ్యాత పుణ్యక్షేత్రం — పుష్పగిరి దేవాలయం

—ఫోటో: శ్రీపాద వెంకన్న.

"అంటే ఏ నవ్వసుందరుడో! నాకెలా తెలుస్తుందమ్మా"

"అబ్బా! వాకే! ఆనాడు పామును చంపి—"

"మీ మనసు దోచుకొన్న మోహియార్ మాటా"

"అవునే"

"అయితే వచ్చారు. దర్బారులో కవిత్వపు గారడీ చేస్తున్నారు తర్వాత సంగీతపు కచ్చేరీ వుంటుందట ఆ సంగతి చెబుదామనివస్తే కొట్టిపొమ్మన్నారు వెళుతున్నా"

"అబ్బా! నిలుచోవే నేనూ వస్తున్నా"

"ఏమిటి? ఇలాగే? ఏ అలంకారం లేకుండానే?"

"అవునే! త్వరగా కొంచెం కురులు ముడు"

"ఓహో! నాకు చావొచ్చింది! మీ చీరలు—రవికలు—హారాలు—ఎన్ని తేకవసాను"

"అబ్బా! మాట్లాడక త్వరగా పాపట తీయవే!"

* * *

మోహియార్ కవితా ప్రాగల్భ్యానికి అంతా సంతోషించారు ఆస్థానకవీశ్వరులు ఆశీర్వదించారు మహమ్మదీయుని ఆంధ్ర కవిత్వప్రతిభకు ముగ్ధుడై సింగమనాయకుడు తన మెడలోని ముత్యాలహారం తీసి స్వయంగా మోహియార్ కంఠసీమ నలంకరించాడు ఆ దేసమయంలో చంద్రవదనవచ్చి ప్రఫుల్ల వదనంతో మందస్మిత కటాక్ష వీక్షణముతో గౌరవించింది మోహియార్ నరాకుమార్తెకు సలాము చేసి ద్విగుణీకృతోత్సాహముతో గొంతెత్తి పాట నారంభించాడు తేనెల సోనగా—వెన్నెల వాకగా — మధురగానసుధాలహరి ప్రవహించింది కిన్నెరకంఠం వీణానినాదముతో మేళవించింది ఆగొంతులో వేయి మురళీ స్వరాలు—వేవేల మయూర రవాలు వినిపించాయి రాజు పరమానందభరితుడై పోయాడు "మోహియార్! అడుగు! నీకేం కావాలో"

"అడగమంటారా మహారాజా"

"అడుగు రేచెర్ల వంశేయులు మాట తిరుగరు"

"అయితే" అంటూ తన అంగీజేబులో నుంచి బంగారుతీగతో స్వయముగా కట్టిన "పచ్చల పగడాల" మాలతీసి చంద్రవదన మెడకి విసరి

"ఆ ప్రాణమున్న బంగారు బొమ్మను— చంద్రవదనను ఇప్పించండి" అన్నాడో లేదో రాజు ఉలిక్కిపడ్డాడు దర్బారులో సంచలనం రేగింది గర్జించిందా నాయక సింహం! బంధించారు మోహియార్ ను "దేశబహిష్కారం తెలవారి నవెనుక తెలుగురాజ్యములో కనిపిస్తే తలతీసేస్తారు" శిక్ష విధించివేశాడు రాజు చంద్రవదన మూర్ఛపోయింది పచ్చల పగడాలహారం చేయిజారి క్రిందబడి పగిలిపోయింది మోహియార్ ను రాజ్యపు ఎల్లలు దాటించి వచ్చారు రాజభటులు

* * *

చంద్రవదన దుఃఖానికి అవధిలేకుండా వుంది చెప్పరాని దుఃఖం దామకోలేని దుఃఖం పొంగులువారి పిలుపుతూ వుంది నిరుడీరోజున యెంత ఆనందం యెంత ఉల్లాసం! వసంతోత్సవం అంతా మామూలుగానే జరిగిపోతూ వుంది ఈ పేళ ఆఖరు రోజు కూడాను నృసింహస్వామి పూజకు కదిరిపట్టణం వెళ్లటానికి సన్నాహాలు పూర్తి కావచ్చాయి అయినా

# ★ చంద్రవదన ★

యేం ముఖం పెట్టుకొని — యేమనసుతో పూజ చేస్తుంది తాను. కాలాంబ సంతోషంతో పరుగెత్తుకు వచ్చింది.

"అమ్మా! అమ్మా! మంచివార్త!"

చంద్రవదన సాలోచనగా చూచి ఒక దీర్ఘనిశ్వాసం విడిచింది.


సిరోలిన్

మీ దగ్గుకి

కారణము

నిర్మూలము చేస్తుంది

— మీ దగ్గుటను

అపుట

మాత్రమే కాదు

సిరోలిన్ మీకు దగ్గును
కలిగించే అపాయకరమైన రోగ
క్రిములను నిర్మూలిస్తుంది






## దాంపత్య రహస్యములు

ఇది పటములతో 284 పుటలు గలది. వెల రు. 2/- కామకళా లేక కొక్కోకము. పటములతో వెల రు. 1/-పోష్టుఖర్చు ప్రత్యేకం. D S మిత్రా & కో., 26 (BEAT) బీటు, సౌకారుపేట, మద్రాసు-1.


"చాలా మంచి వార్తమ్మా"

"ఏమిటే అది?"

"మోహియార్ —" నోరు నొక్కుకొంది

చంద్రవదన గుండెలు క్షణంసేపు ఆగినటనిపించాయి. ఆనంద వారిధి గట్టులు త్రెంచుకొని ప్రవహిస్తోంది. నరనరాల్లోని రక్తము వేడెక్కి ఉప్పెనలా విజృంభించింది.

"వచ్చారా?" కన్నులు కలువరేకు లయ్యాయి

"ఊహు! నేను చెప్పను" మూతి బిగించింది.

"అబ్బా చెప్పవే చంపక"

"బహుమానం?"

"నువ్వుకోరిన హారం"

"అయితే చెపుతున్నా. మోహియార్‌ను చూశాను"

"ఎక్కడ?"

"కోట గుమ్మం వెలుపల"

"మాట్లాడేవా?"

"ఆ"

"ఏమన్నారే"

"మిమ్మలిని అడిగేనని చెప్పమన్నారు"

"అబ్బా పోదూ" అంటూ వుండగానే దేశబహిష్కార శిక్ష గురుకు వచ్చి గజ గజ వణికి నిలువునా కూలిపోయింది చంద్రవదన. కాలాంబ కంగారుపడి ఆమెను పట్టుకొని పక్కమీద పరుండబెట్టి పన్నీరు చల్లి అడిగింది "ఏమిటమ్మా!"

"ఎంత దుర్వార్త తెచ్చావే"

"దుర్వార్తా?" తెల్లబోయింది కాలాంబ.

"కాక — దేశబహిష్కారమునందినవ్యక్తి దేశంలో కనిపిస్తే యేమవుతుందో తెలుసుగా" తెల్లవారి నతర్వాత కనిపించే పున్నమ చంద్రుని లా తెల్ల తెల్లగా పాలిపోయింది. చంద్రవదన పూర్ణచంద్రవదనం. కాలాంబ చేతులు పట్టుకొని ప్రార్థనాపూర్వకముగా వేడుకొంది.

"నీకు పుణ్యముంటుంది వెళ్ళి వెంటనే వెళ్లి పారిపొమ్మనవే! చెప్పవే! నీకు కావలసిన హారాలన్నీ యిస్తానే! త్వరగా వెళ్ళవే"

కాలాంబ పెద్దగా నవ్వింది. చంద్రవదన నివ్వెరబోయింది. తర్వాత కాలాంబ ఆమె చెవిలో యెంతో మంతనంగా గుసగుసలాడింది. చంద్రవదన కుహ్కనేత్రాలు ఆనంద తేజముతో తళుక్కుమన్నాయి. కాలాంబ బయటకు వెళ్ళిపోయింది. చంద్రవదన గుండెలలో గుబులెత్తిన సంబరపు గుబాళింపు వణచుకోలేక కూనిరాగాలు పాడుతూ నృసింహస్వామి పూజకై కదిరి పట్టణం వెళ్ళటానికి ముస్తాబవుతూ వుంది.

నృసింహస్వామి పూజ అయిపోయింది. చంద్రవదన ఫకీరులకు వస్త్రదానం చేస్తూ వుంది ఆమె చేతులు వణకుతున్నాయి మనసు మనసులో లేదు ఆఖరు ఫకీరుకూడా వస్త్రము పుచ్చుకొని వచ్చేస్తున్నాడు అతని వెనుక చంద్రవదన ఆ వెనుక తక్కిన వారంతా వస్తున్నారు. సరిగా ప్రాంగణ ద్వారము దగ్గరకు రాగానే ఆ ఆఖరు ఫకీరు దటుక్కున చంద్రవదనను చంక నెత్తుకొని ప్రక్కనే సిద్ధముగానున్న సైన్యాధిపతి గుఱ్ఱముమీదకి ఉరికాడు చెంతనే నిలుచున్న సైన్యాధిపతి షర్షాషరీఫ్‌వాడి ఖడ్గం ఫకీరు గుండెలను చీల్చింది ఆ ఫకీరు వేషం తీసివైచి "చంద్రా" అంటూ నేల కొరిగాడు "మోహియార్ మోహియార్" ప్రజలంతా కేకలు పెట్టారు. రాజు గర్జించాడు. దానికి జవాబుగా మరొక సైనికుని శూలం నేలబడివున్న మోహియార్ గుండెలను దూసుకొని భూమికంటా దిగిపోయింది. మరు క్షణమే మోహియార్-అక్కడే-క్రిందటి వసంతోత్సవం కడపటి రోజున తాను పామును చంపినచోట మరణించాడు. ఆనాడు బొట్టు పెట్టుకోకుండా నేలపాలయి పోయిన కుంకుమలా చంద్రవదన ప్రియుని రక్తము కాలువలుగట్టి భూమిపాలయి పోతూ వుంది. చంద్రవదన మోహియార్ వేడి రక్తముతో తిలకము దిద్దుకొని "ప్రియా" అంటూ మోహియార్ శవాన్ని కౌగలించుకొంది వెంటనే రాజు చేతిలోవున్న కరవాలం స్వయంగా చంద్రవదన హృదయాన్ని చీల్చింది. ఆమెకూడా ప్రియుని అనుసరించింది ఆ ప్రేయసీప్రియుల యౌవనరక్తము రాజుకు పరివారానికి వసంతము జల్లింది. సాయంసంధ్యా సమయం. కోప కషాయ దీధితులతో ఎరుపెక్కిన వృద్ధభానుడు ఆ రక్త ప్రవాహములో మరింత యెర్రగా కనుపించాడు చంద్రవదన మోహియార్లను కలిపి ఒకేచోట-పాము సమాధి దగ్గర-సమాధి చేశారు. రాజు వెళ్లిపోయాడు! సూర్యుడస్తమించాడు. ఆ ప్రియుల సమాధిపై "చంద్రవదన-మోహియార్" పేరుమీద ఒక గోరీ నిర్మితమయ్యింది 1430 లో బహమనీ సుల్తాను సింగమనాయని ఓడించాడు. నాయడు మరణించాడు. రాజులు గతించారు. రాజ్యాలు అంతరించాయి కానీ ఆ ప్రేయసీ ప్రియుల ప్రేమచిహ్నమైన ఆ గోరీ యిప్పటికీ నిలచి మానవ హృదయ కాఠిన్యాని వెక్కిరిస్తూ వుంది.



# తెలంగాణ

"నా తెలంగాణ కోటిరత్నాల వీణ"! అన్న దాశరథి వాక్యం తెలుగుజాతి గుండెలలో ఒక దివ్య మంత్రంగా మారు మ్రోగుతుంది. చరిత్ర ప్రసిద్ధి పొందిన స్థలాలూ, కట్టడాలూ, గుళ్లూ, గోపురాలూ తెలంగాణా ప్రాంతమంతటా కనిపించి, మురిపించి, మన పూర్వవిభవాన్ని మన స్సులో మెరిపించి "ఇటనెచట త్రివ్వినను బంగరే నట!" అన్న విశ్వనాథ వారి మాటలని గుర్తుకి తెస్తవి.

దక్షిణాపథాన వర్ధిల్లిన ఆంధ్ర సామ్రాజ్యానికి రాజధాని వరంగల్లు, హనుమకొండ అనే పేరుతో విష్ణుకుండినుల కాలంనుంచీ, బౌద్ధయుగానికి పూర్వంనుంచీ వాసికెక్కిన నగరం ఈ పటణమూ, పరిసరాలూ చరిత్రలో నేకాక సాహిత్యంలో కూడా ప్రముఖ స్థానాన్ని సంపాదించుకున్నవి కలమూ హలమూ ఒకే చేతపట్టుకుని, మనుజేశ్వరాధములకు కాక పంటవలంతి అల్లునికే తన బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకను అంకితంచేసిన మహాకవి పోతన ఏకశిలా నగరమనే పేర పరగిన వరంగలులోనే జీవయాత్ర సాగించాడు అయన అమర సాహితికి ఆటపటు కావటం మూలంగా వరంగల్లు తెలుగు గుండెలలో భద్రమైన స్థానాన్ని పొందగలిగింది

గణపతి దేవుడు కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించే కాలంలో నెల్లూరు మండలంనించి మహాకవి తిక్కన ఏకశిలానగరానికి రాయబారిగావచ్చి తన చాతుర్యాన్ని పాండిత్యాన్నీ ప్రదర్శించాడు. కవిశేఖరుడే కాదు; అమాత్యశేఖరుడుగా కూడా తిక్కన ప్రస్తుతి నందుకున్నాడు.

పురుష వేషంలో తిరుగుతూ శత్రువులకు సింహస్వప్నంగా, వీరరసానికి మానవాకారంగా వెలసిన రుద్రమదేవి గణపతిదేవుని పుత్రిక ఆమె శౌర్యపరాక్రమాలు, యాదవ రాజుల సేనలను సర్వనాశనంచేసిన ఆమె రుద్రశక్తీ, కదనరంగంలో పురుష వేషంలో భద్రగజమెక్కి వీరవిహారంచేసిన ఆమె కాళీస్వరూపం ఎవరు మరిచిపోగలరు? వీర రుద్రమ స్మృతితో మన వరంగల్లు ఆంధ్ర తేజానికీ, పౌరుషానికీ, అబలకాని ఆంధ్ర మహిళ ప్రబలశక్తికీ గొప్ప నిదర్శనంగా నిలబడిపోయింది.

కంచిదాటి తిరుచినాపల్లి దాకా తెలుగు రాజ్యాన్ని వ్యాపింపజేసిన ప్రతాపరుద్రుడు ఆంధ్రులకి అభిమానపాత్రుడు ఇరవై యేళ్లలో ఆరుసార్లు దండెత్తివచ్చిన ఢిల్లీ సుల్తానుల ధాటికి తట్టుకుని చెక్కు చెదరని స్థైర్యంతో రాజ్యపాలన సాగించిన రాజశేఖరుడు ప్రతాపరుద్రుడు ఏడవసారి వచ్చిన దండయాత్రకి తట్టుకోలేక ఢిల్లీ బలానికి ప్రతాపరుద్రుడు లొంగిపోయాడు. కాని ఆ ధీరహృదయం ఈ పరాభవాన్ని భరించలేకపోయింది బందీగా ఢిల్లీకి వెళ్తూ దారిలో నర్మదానది ఒడ్డున ప్రాణత్యాగం చేసి ప్రతాపరుద్రుడు తనపేరు చెరిగిపోకుండా నిలుపుకున్నాడు.

కాకతీయుల ఛత్రం నీడలో తెలుగుదేశం వెలుగులు విరజిమ్మింది వర్తకవాణిజ్యాలూ, సిరిసంపదలూ తొణికిసలాడినవి ఉత్తమ కళామందిరాలనదగిన దేవాలయాలు వెలిసినయ్ సంస్కృతాంధ్ర సాహితీ లతలకు కాకతి రాజులపాలన పూలపందిరి అయింది. ప్రతిభావంతులైన కవులూ, పండితులూ, శిల్పులూ తమ ప్రసూనాలతో కళాలక్ష్మికి పాదపూజ చేశారు రంగనాథరామాయణం, బసవపురాణం, భాస్కరరామాయణం వంటి గొప్ప కావ్యాలు అవతరించిన కాలం అది తెలుగుజెండా ఆకాశంలో ఎగిరి, తెలుగు సాహితి నవోన్మేషంతో విలసిల్లిన బంగరు కాలం అది. ఆంధ్రుల మహోజ్వల చరిత్రలో కాకతీయయుగ మొక మరువలేని ఘట్టం హనుమకొండలోని వెయ్యిస్తంభాల గుడీ, వరంగల్లుకోటా. పాలంపేటలో వున్న రామప్ప దేవుడూ ఆ వైభవానికి స్మృతి చిహ్నాలు. వరంగలు నగరం ఇరవై యెదు మైళ్ళు విస్తరించిన కోట గోడలతో, బలమైన ద్వారాలతో, అందమైన తోరణాలతో ఎందరో యాత్రికులని ముగ్ధులని చేసింది మార్కోపోలో అనే యాత్రికుడు నగర సౌందర్యాన్ని కొ[illegible]డి, అక్కడ తయారయే నేత బట్టలు సాలీడు గూళ్ళంత నాజూకుగా అందంగా వున్నవని మెచ్చుకున్నాడు.

---

**అమరేంద్ర**

---

## మహాంధ్రోదయం

నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీ
రొత్తి
కొనుచు నాపై ప్రేమ
మినుమడించె
గోదావరమ్మ సమ్మోదమ్ముల్లో
నాకు
ముఖమార్జనకు జలమ్ముల
నొసంగె
తుంగమ్మ తన పైటకొంగుతో
నా మోము
తుడిచి నిద్దుర చిన్న లడచి
వేసె
పెన్నమ్మ తన పయఃపీయూ
షము నొసంగి
ఆకలిమంట చల్లారగొట్టె
మూడు చెరగుల నేలల మూడు
కోట్లు
ముడివడినయట్లు కన్ను ముందు
తోచె
అందలము నెక్కి యావజ్జనాళి
మెచ్చ
సుందరోషస్సు వచ్చె వసుం
ధర కయి!

—దాశరథి

గణపతి దేవుని కాలంలో తవ్వించిన రామప్ప చెరువు ఎనభై చదరపుమైళ్ళు విస్తరించి వేల ఎకరాలకి జీవనాధారమై ఆశ్చర్యం కలిగిస్తుంది. కాకతీయ ప్రభువుల ప్రజానురంజనానికి ఈ తటాకం ప్రబల సాక్ష్యం.

గోదావరి తీరాన భద్రాచలం ఆంధ్రుల అభిమాన క్షేత్రం భద్రుడనే ఋషికి శ్రీరాముడు దర్శనమిచ్చిన తావు కనక భద్రాచలమనే పేరు వచ్చింది. గోపన్న

# ★ రత్నాల వీణ ★

గారు వసూలుచేసిన శిస్తులతో సీతమ్మ వారికి చింతాకుపతకం చేయించి వంతల పాలై చెఱసాలలో తానీషావల్ల బాధలు పడటం తెలియని వాళ్ళెవరున్నారు? తానీషాని కూడా రామ భక్తుని చేసిన గోపన్న రామదాసుగా తన కీర్తనలతోనూ, దాశరధి శతకంతోనూ అమరమూర్తి అయినాడు

నీలగిరి అనే పేరు క్రమంగా నల్లగొండగా మారి ఆ ప్రాంతమంతా పవిత్రమైన పౌరాణిక చారిత్రక స్మృతి చిహ్నాలకి ఆలవాలమయింది. కృష్ణా, మూసీ నదులతో ప్లావితమైన ఈ ప్రాంతం పులకేశి చక్రవర్తిని ఎదిరించిన ఆంధ్ర వీరుల జన్మభూమి పద్మనాయక వైభవానికి తార్కాణమైన భువనగిరి దుర్గం, పానగల్లులోని ఆలయాల శిల్ప వైభవం, యాదగిరి నరసింహస్వామి ఆలయపు సౌందర్యం చూస్తే ఈ ప్రాంతం ప్రాచీన కాలంలో ఎంత ఉజ్వలంగా వెలిగిందో తెలుస్తుంది. ఈ ప్రాంతంలోవున్న పిల్లలమఱ్ఱి గ్రామం వరంగల్లు ఆస్థానానికి ఆభరణమైన పిన వీరభద్ర కవి పుట్టినచోటు.

కృష్ణానది మూసీ నదితో చేతులు కలిపే చోటవున్న అగస్తీశ్వర నరసింహస్వాముల ఆలయాలు ఆశ్చర్యకరమైనవి నదీ తీరానికి నాలుగువందల అడుగుల ఎత్తున నిర్మించిన శివలింగానికి పాతాళగంగ నిత్యాభిషేకం చేస్తూ వుంటుంది. ఈ దృశ్యం విస్మయం కలిగించే ప్రకృతి విన్యాసం. నరసింహస్వామి ఆలయపు గర్భగుడిలో వెలిగించిన జ్యోతి ఎప్పుడూ మిణుకు మిణుకుమంటూ మిగతా వాటితో పోలిస్తే విలక్షణంగా కనబడుతుంది. ఆ దీపం స్వామి నిర్నిద్ర హృదయ స్పందనానికి ప్రతీకమని అక్కడి భక్తులు విశ్వసిస్తారు.

ఈ జిల్లాలో గాజులబండ తాలూకాలో దొరికిన వస్తుసంచయం రెండువేల యేళ్ళ కిందటిదని చరిత్రకారుల తీర్పు భద్రగజం ఒక వైపునా స్వస్తిక రెండో వైపునా కనిపించే నాణెం దొరికింది అది అతి పురాతన ఆంధ్ర చక్రవర్తుల కాలానిదని కనుగొన్నారు అరవై అడుగుల పరిధి కలిగిన చక్రంమీద నిర్మించిన స్తూపం ఒకటి అపూర్వమైనది బైట పడింది శాతవాహన చక్రవర్తుల నాణెములు చాలా దొరికినై ఈ ప్రాంతం చరిత్రకారులకు గొప్ప కాణాచి

కృష్ణాతీరం వజ్ర వైడూర్యాలకు ప్రసిద్ధి చెందిన సంగతి బృహత్ సంహిత కాలం నించీ అందరికీ తెలిసిందే వజ్రాలని ఎగుమతి చేసే కేంద్రంగా గోలకొండ గొప్ప పేరు పొందింది. కోహినూరు వజ్రం కూడా కృష్ణవేణీతీరంలోనే దొరికింది. విశ్వాన్ని విస్మయంలో ముంచిన అమూల్యమైన వజ్రాలు కృష్ణాతీరంలోనే దొరికినయ్

భారతదేశానికి రెండుసార్లు రాజధాని కాగలిగిన ఘనత ఔరంగాబాద్ జిల్లాకే దక్కింది ఔరంగాబాద్ రాజధానిగా చక్రవర్తి ఔరంగజేబు పరిపాలించాడు తుగ్లక్ రాజధానిని ఢిల్లీనించి దౌలతాబాదుకుమార్చి మళ్ళీ కొన్నాళ్ళ తరవాత ఢిల్లీకి తరలించాడు.

అజంతా, ఎల్లోరా గుహలు భారత శిల్పానికి ఆంధ్రజాతి సమర్పించిన అపూర్వ నీరాజనాలు. అజంతా గుహలలోని బౌద్ధ చిత్రాలు క్రీస్తుపూర్వం రెండో శతాబ్దానికి చెందినా నేటికీ తరగని ఆకర్షణతో కాలపు కరాళదంష్ట్రలచేత కాటువడని సౌమ్య సౌందర్యంతో ముగ్ధుల్ని చేస్తయ్ మొదటి గుహలోని పద్మపాణి బోధిసత్వుడిని ఒకసారి చూస్తే జన్మకి మరిచిపోలేం. ఆ రంగులలో, రూపాలలో, రేఖలలో ఏదో తెలియని ఇంద్రజాలం! విషాదంతొంగిచూసే యశోధర విశాలనయనాలలో, అమాయకత్వం ఉట్టిపడేరాహులుడిముఖంలో ఏదో మరుపురాని, చెప్పలేని రసప్రపంచం సాక్షాత్కరిస్తుంది

హిందూ, బౌద్ధ, జైనధర్మవాహినులకి త్రివేణి ఎల్లోరా! ఒంటిరాతిలోంచి చెక్కిన కైలాస గుహ తన సౌందర్యంతో మంటినుంచి మింటికి స్వర్ణసోపాన పంక్తి నిర్మిస్తుంది భారత శిల్ప ప్రపంచానికే ఈ గుహ కైలాస శిఖరం అనిపిస్తుంది.

రుక్మిణీ కృష్ణుల ప్రణయగాథ, దమయంతి స్వయంవర వృత్తాంతం పురాణయుగంలో విదర్భలో జరిగినవని భారతకథవల్ల అందరికీ తెలుసు ఆధునిక కాలంలో ఆ విదర్భ బీదర్ జిలా అంటే ఆశ్చర్యం కలుగుతుంది. చాళుక్యుల రాజధానిగా రాణకెక్కిన కళ్యాణి ఈ బీదర్ జిల్లాలో ప్రముఖనగరం. బిల్హణకవి ఆ నగరవైభవానికి పరవశుడై త్రిలోకాల్లో త్రికాలాల్లో అంత అందమైన నగరం మరొకటి దొరకదన్నాడు

ఒక యజమాని కోపావేశంలో తన నమ్మకమైన పెంపుడుకుక్కని చంపి, తరవాత పశ్చాత్తాపంతో మగ్గిపోయి, ఆ కుక్కకి గొప్ప గోరీ కట్టించాడు నోరులేని జంతువు ఋణాన్ని ఈ రూపంలో తీర్చుకుని ఆత్మశాంతి పొందాడు ఈ గోరీ, బీదర్ జిల్లా వింతలలో ఎన్నదగినది మానవహృదయానికి అదొక మౌన వ్యాఖ్యానం!

తెలంగాణాలో బౌద్ధజైన సంస్కృతుల ప్రభావం గాఢంగా సోకిన ప్రాంతాలెన్నో వున్నయ్. ఆధునిక చరిత్రలో హిందూ మహమ్మదీయ సంస్కారాల సహజీవనం శాంతంగా కొనసాగిన ప్రాంతం తెలంగాణా. ఆలయాలతో గోపురాలతో, కొండలతో నదులతో, శిలాలతో శిల్పాలతో అలరారే తెలంగాణా ఆంధ్రప్రదేశమై అవతరించి ముక్కోటిరత్నాల మాణిక్య వీణ కానున్నది!

ఇతిహాసమూ చరిత్రా చేతులు కలుపుకుని రాళ్ళలో నదులలో, విగ్రహాలలో నగరాలలో నాట్యంచేసిన పవిత్ర భూమి ఇది. ఔరంగజేబు కాలం మొదలుకొని అగస్త్యుని కాలందాకా, పాండవుల కాలందాకా, శ్రీరాముని దక్షిణాపథ యాత్రదాకా పురాణస్మృతుల సౌరభాన్ని తెలుగు గుండెల్లో మేలుకొలిపే ప్రసిద్ధభూమి ఇది గతచరిత్ర మహోత్తరమైనదని పొంగిపోక "భావియుగముల కళ్యాణపథముబట్టి వెలుగు నీడల జీవన వేణువూది' మనం ప్రగతివైపుకే నడకసాగించాలి అప్పుడే తెలుగుజాతికి వెలుగుబాట. అప్పుడే తెలుగు కలలకు పసిడిపంట. ★





రవి టాయిలెట్స్ అందముకు, వర్చస్సుకు

రవి గ్లిసరిన్ సోప్:—అన్ని కాలములలో, ముఖ్యముగా వేసవి కాలములలో వాడదగినది శరీరమును మృదువుగను, కాంతిగను ఉంచును.

రవి వెజిటబుల్ హేరాయిల్.– శిరోజములను విసారముగా పెంపొందించును. దాని చక్కని సున్నితమైన సువాసన అందరికి ఆనందము కలుగచేయును.

రవి స్నో:–ముఖవర్చస్సును కాపాడి ...స మును పెంపొందించును. సోల్ ఏజెంట్లు:–

దిన్యూ స్టార్ & కంపెని, 10, వైద్యనాథ మొదలివీధి, తండియార్పేట, మద్రాసు-21.

# గాంటి పలుకు

## పాత్రలు:

| | |
|---|---|
| రాయన భాస్కరుడు | : కాటయ వేముని ప్రాయన కాడు. మహాదాత. |
| రంగయ్య | : గ్రామకరణం. |
| భైరవరాజు / పెద్దిరాజు | : భట్రాజులు. |
| సూరాంబ | : రాయన భాస్కరుని కోడలు. |
| భాస్కరుడు | : రాయన భాస్కరుని మనుమడు. |
| విష్ణు | : భాస్కరుడికి స్వాధ్యాయి |

(రాయన భాస్కరుని కచేరిసావిడి గ్రామోద్యోగులతో ను, నౌకర్లతోను నిండి వుంటుంది. రాయన భాస్కరుడు ప్రవేశించ గానే అందరూ లేచి నిలబడి నమస్కారం చేస్తారు.)

రా భా : (అందర్నీ కూర్చోమని, ఆయన కూడా కూర్చుంటాడు) మిమ్మల్నందర్నీ పిలిపించిన కారణం మీకు చెప్పవలసివుంది ఒక రాజ్యానికి రాజెలాంటివాడో గ్రామానికి మీరలాంటివారు ప్రభుత్వమనే మహా వృక్షానికి మీరు కూకటివేళ్ళలాంటివారు మీరంతా సుహాసూళు వసూలు చేస్తేనే రాజులు రాజ్యం చెయ్యగలిగేది ఇప్పుడు...

రంగయ్య : ఇంతకీ మమ్మల్ని పిలిపించిన కారణం సెలవిప్పించేరు కారు.

రా. భా : రంగయ్యగారూ! తొందర పడక సాంతం సమిళంగా వినండి కుమార గిరి ప్రభువులు ఈ చిత్రభాను సంవత్సర మకర సంక్రమణం నాడు పరమపదించారు గదా?...

అందరూ : ఆ మహానుభావుని ఆత్మకి శాంతి కలగాలి.

రా. భా : ఆయనకి పుత్రసంతతి లేదు. ఈనాడు రాజమహేంద్రవర ప్రభువులైన కాటయ వేమారెడ్డిగారు కుమారగిరి ప్రభువు సహోదరిభర్తగారన్న విషయం మీకు తెలియనిది గాదు. కాటయ వేమారెడ్డిగారికి కుమారులున్నారు. వారికి దౌహిత్రేణా సింహాసనార్హత ఉన్నదనే సంగతి శాస్త్ర సమ్మతమే గదా?

అందరూ : అవును గాక

రా. భా : అందుకు వ్యతిరేకంగా ఈనాడు కుమారగిరి పినతాత మనుమడైన పెదకోమటి వేమారెడ్డి తానే వారసుడనని కొండవీడు-సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. అంతేగాక తానే సర్వాధికారి అని ప్రకటిస్తూ, కాటయ వేమారెడ్డి తన సామంతుడని ఆ ప్రకటనలో నిర్వచిస్తూ, హుకుంలు జారీ చేస్తున్నాడు.

రం : ఏమని ప్రభూ!

రా. భా : మహాసూళ్ళన్నీ వారి కోటకే, కొండవీడు తీసికెళ్ళి అప్పగింత చెయ్యాలిట. ఆ మహాసూళ్ళ లెక్కలు వారికే దాఖలుపరచాలట.

## ఎం. వి. జగన్నాథరావు

రం : సరిసరి. బాగానే వుంది....మంత్రివర్యులు మామనవి ఒకటి వినాలి

రా. భా : అవశ్యం చెప్పండి.

రం : మహాసూళ్ళ వసూళ్ళు పూర్తి అయ్యాయి ఆయా గ్రామాలలోని ప్రభుత్వ ధాన్యాగారాలకు చేర్చడం కూడా జరిగింది గ్రామ తలయార్లు జాగ్రత్తగా కాపలా వుంటున్నారు వెలి కావలివారు అచ్చు కావలివారు అప్రమత్తులై పహారా కాయిస్తున్నారు. అయినప్పటికీ కొన్ని అరాచకాలు జరుగుతున్నాయి.

రా. భా : ఆస్తులకేమైనా నష్టం కలిగిందా? ముఖ్యంగా రైతాంగానికి?

* రం : కలిగింది ప్రభూ! మా గ్రామంలోనే ఒక రైతు తాలూకు వరిపంట కొంత దొంగిలింపబడ్డాది అది మరోటి మరోటీ కాదు. కర్పూరపుభోగాలు. ఆ చేలో 40 కేసరిపాటి పుట్లు ధాన్యం అవుతుందని అంచనా వేశాము.

రా. భా : కళ్ళంలోనా? ఇంటిదగ్గరా ఇది జరిగింది?

రం : కళ్ళంలోనే స్వామీ! నాలుగు రోజులు తాళితే నూర్పి ఇంట పోసుకునేవాడే

రా భా : ఆ నష్టం భర్తీచేసే పూచీదారు వెలికావలివాడు గదా? అతనేం చేస్తున్నాడు?

రం : అచ్చుకావలివారు వెలికావలివారు కలసే ఈ వ్యవహారం పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నారు.

రా. భా : ఎవరు వారు?

రం : చిప్పెటి బోడిలింగమనాయుడు, అడపా సింగమనాయుడు. వీరిద్దరు అచ్చు కావలి వెలికావలి కార్యకర్తలు. వీరికి అనవేమారెడ్డిగారి కాలంలో ఈనికారకం ఒప్పగింత గేసేరు వారు సమర్థులే గాని, ఆరోజు వేళా విశేషం అలాంటిది...

రా. భా : సరే! ప్రభువువారి గ్రామకొటంలో వున్న నిలవమంచి తీసి రైతుకి కలిగిన నష్టం మేరకు భర్తీ చెయ్యండి. గ్రామనాఖర్లు మాన్యాలు బాగా పండినట్టేనా?

రం : అన్నీ బాగానే పండేయి విలాగూ, కరణాలంతా లెక్కలతో వచ్చేరు గనక తమరు జమాబందీ జరిపించి నిల్వలు తేల్చవచ్చు ధర్మప్రభువులు తమరే వ్యవహారం తేల్చడం ఉత్తమం. పరిస్థితులు బాగు లేవు గనక మహాసూళు త్వరలో కోటకి చేరుస్తాం

రా. భా : గ్రామానికి కావలసిన ఖర్చు వెచ్చాలకి సరిపోను మిగుల్చుకుని మరీ పంపండి

రం : ఆ వ్యవహారమేదో తమ సమక్షానే పరిష్కారం చేసుకుని అపనిచేద్దామని మేమందరం వచ్చాము.

పహారా జవాన్ : (ప్రవేశించి భాస్కరమంత్రికి నమస్కరించి) ప్రభో! ఇద్దరుభట్లు తమదర్శనంకోసం వచ్చారు. తమరు రాజకీయాలు చక్కబెడుతున్నారంటే వాళ్లు ఆకలిభాధను తాళలేమని గోల చేస్తున్నారు ప్రభో.

---

* ఒక కాసరిపాటి పుట్టి సుమారు 80 కుంచాలు.

రా. భా : సరే! ముందువారికి భోజనం పెట్టించి తరువాత తీసుకురా. కరణాలంతా, ప్రభువువారు వారికి యేర్పాటుచేసిన వసతులకు వెళ్ళి మజ్జన భోజనాదులు ముగించుకుని త్వరగా రావచ్చు. ఈ మధ్యాహ్నమే ఆయా వ్యవహారాలు పరిష్కారం చేస్తాము.

## 2

[భాస్కరమంత్రి కచేరీ కరణాలు వగైరా గ్రామోద్యోగులతోను, గ్రామ నౌకర్లతోను నిండివుంటుంది. ఇద్దరు భిట్రాజులు భైరవరాజు, సిద్దిరాజు అనే వాళ్లు వస్తారు].

ఇద్దరూ : ఓ ఆశ్రితజన కల్పభూజా! భాస్వద్రూప భానుతేజా!! సమస్త రాజలోక చూడామణీ! పూజితపద సరోజా!!! రాయని భాచరాజా!!!! జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవ.

భై: మహాప్రభో! తమరు ధర్మదాతలనిన్నీ, ఆశ్రితజన కల్పతరువులనిన్నీ, దీనజన రక్షాదక్షులనిన్నీ, దిగ్దిగంత విశ్రాంతింగా మీకీర్తి వ్యాపించడంచేత ప్రభువుల దరిశనం చేసుకుని పునీతులం కావడానికి యిలా వచ్చేం.

సి : ప్రభువులు నిరతాన్నప్రదాతలు. ఈ వసివాడిన లతకూనలమీద మీ దాన ధారలు జల్లి సేదదేర్చండి.

భై : అయితే సిద్దిరాజు! ప్రభువ్వారి కీర్తి యేలాగ్గా విస్తరించిందో ఒకపద్యం చెప్పవోయి.

సి : అయితే భట్టూ! మనంయిద్దరం బ్రహ్మనారదులం కావాలి. నేను నారదుడిగాను, నువ్వు బ్రహ్మగాను వుండాలి. బ్రహ్మకీ, బ్రహ్మమానసపుత్రుడైన నారదుడికీ యీవిధంగా సంభాషణ జరుగుతుంది.

నారదుడు (సిద్ధి): మ॥ సరి వేసై రిపుడేల ? భాస్కరులు భాషానాధా!

బ్రహ్మ (భైరవ): పుత్రా! వసుంధరయందొక్కడు మంత్రియయ్యె.

నా : వినకొండన్ రాయనామాత్య భాస్కరుండా ?

బ్ర : కాన్

నా : ఏన పహ్రసకర శాఖలేవే ?

బ్ర : అవే యున్నవే! తిరమై దానము




# 'అనాసిన్' లోని నాలుగు మందులతో మీ బాధా విముక్తిని పొందండి

'అనాసిన్' నాలుగు మందులయొక్క వైజ్ఞానిక మిశ్రమము ఇది వరముల ముఖ్య స్థానములందు తీవ్రమైన మిశ్రమచర్యను జరిపి, నొప్పి, తలనొప్పి, జలుబులు, జ్వరం,పన్నునొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రవిముక్తి నికలిగించును

### అనాసిన్‌లో ఇవి ఉన్నవి

1. క్వినైన్ : అధికశక్తినిచ్చు మరియు జ్వరనివారణ మొదర్పు గుణాలకు ప్రఖ్యాతి గాంచినది. జ్వరాన్ని తగ్గించడంలో మిక్కిలి శక్తిగలది.
2. కఫీన్: బలహీనానికి మరియు చిక్కిపోయినందులకు తగిన ఔషధమని విరివిగా వాడబడుచున్నది.
3. ఫినాసిటిన్: తీవ్రమైన బాధా నివారణి జ్వరనివారణి యని ఖ్యాతిచెందినది.
4. అసిటైల్ సాలిసిలిక్ ఆసిడ్: తలనొప్పి, మరియు అలాటి బాధలను పోగొట్టుటకు ఉపయుక్తమైనది.

ఈ నాలుగు మందుల వరిగ్గా వైద్యునియొక్క ఔషధయోగమువలె పనిచేయును 'అనాసిన్' గుండెకు హాని కలిగించదు కడుపును అవకతవక చేయదు. నొప్పి, తల నొప్పి జలుబులు పన్ను నొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రంగా మరక్షితమైన మరియు దీర్ఘమైన విముక్తి కొరకుఎల్లప్పుడూ 'అనాసిన్'నే వాడండి.




లక్షలాది మందికి బాధా విముక్తిని కలిగించును

సే యుహో గిప్పల హేం తి వే యుహో
ప్రా యుహో

అందరు: ఓహో! ఈ భట్లు యెంత చమత్కారంగా చెప్పేరు కవిత్వం.

సి: ఓహో! ఇంకా ప్రభువులకీ రీ యెలాగుందయ్యా భట్టూ!

భై: కలయ పసిండి గంటమున
కాటయ వేమ సమత్నుఁడుండు వ
త్సలముగ రాయని ప్రభుని
భావము వ్రాసిన వ్రాల మోతలన్
గిలుగలు గల్లు గల్లు రవ
ఇంటను మంత్రులకుం జేవిన్నియున్
జలు జలు జలు జలు రవ
సత్కవివర్యులు మేలు మేలనన్

అందరు: భేష్! భేష్!! శహభాష్ భట్టూ!

రా. భా: భట్టులారా! మీ చమత్కారానికి మేం మెచ్చుకున్నాం. నిజంగా నేనంతటి పొగడ్తకి అర్హుడను గాను. ఈ రెండు ముత్యాలహారాలు తీసుకుని మీరు వెళ్ళండి.

(భట్లు: నమస్కరించి భాస్కరమంత్రి దగ్గిరం శెలవుతీసుకుంటారు. లెక్కలపరిష్కారానంతరం సభముగిసింది. భాస్కరమంత్రి గృహోన్ముఖుడౌతాడు.)

## 3

(కాలవాహినిలో కలసి యెంతవారైనా ప్రయాణం చెయ్యకతప్పదు. భాస్కర మంత్రి అస్తమించాడు. సిరి కరగిపోయింది కాలం గిర్రున తిరిగింది.

ప్రవేశం: రాయనభాస్కరుని కోడలు మాచాంబ. 30 సం॥ రాలుంటాయి. మనుమడికి 12 సం॥రాలవయస్సు. పేరు భాస్కరుడే)

మా: నాయనా! భాస్కరా!!...... భాస్కరా!!!

భా: ఏఁవేఁవమ్మా! వస్తున్నాను.

మా: ఏం జేస్తున్నావయ్యా? ఎక్కడ గెంతుతున్నావు? ఛీ! ఛీ!! ఒళ్ళంతా ధూళే

భా: చిట్టిపొట్టాట, గోరంటలాట ఆడుకుంటున్నాం. కూర్చుని ఆడుకునే ఆటలే నమ్మా అవి. నేను గెంతలేదు

మా: స్నానం చేసి భోజనానికి రా.

భా: అమ్మా! నాకు పాలుపోస్తావా ఈ రోజు?

మా: సరిపోయింది. లేనిపోని అల్లరి పెట్టకు నాయనా! స్థితిగతులననుసరించి మనం నడుచుకోవాలి.

భా: తాతగారున్నప్పుడు రోజూ నాకు పాలుపోసేదానివే ఇప్పుడెందుకు లేవు?

మా: తాతగారితోనే ఆ లక్ష్మి అంతరించిపోయింది. నువ్వు మారాం చెయ్యకూడదు. నీకు వయస్సొస్తోంది. కష్టసుఖాలు తెలుసుకోవాలి. అల్లరిపెట్టి ప్రయోజనంలేదు. (కంటనీరు వత్తుకుంటుంది.)

భా: పోనీవే అమ్మా! నువ్వు కంటతడిపెట్టకు నేనడగనులే.

మా: ఎంతో ముద్దుగా పెరిగేవు, ఆ మహానుభావు డున్నంతకాలం. ఆ లక్ష్మీకళ ఆయనతోనే అంతరించిపోయింది. ఒకనాడు పట్టుపరుపులమీద కూర్చుని బంగారు తూగుటుయ్యాలలో వూగి ముద్దుగా పెరిగేవూ. అవన్నీ కలలోని వృత్తాంతాలై పోయేయి ఈనాడు వేళకి పట్టెడన్నం దొరకని పరిస్థితేర్పడుతోంది ఆకలని పైవాళ్లు సహితం అంటే అలించలేక తక్షణం మృష్టాన్నం పెట్టి, ప్రజానీకానికి నిత్య సంతర్పణలు చేసిన భాస్కర మంత్రి మనవడికి తినతిండీ, కట్టుకుద్దికి కరవౌతున్నా దంటే ఆ కట్టడి దైవాన్నే మనాలో తెలియదు ఆ పరమధార్మికుని కుటుంబానికి పలుకష్టాలు కలుగజేసే పరమాత్మకి హృదయం లేదనుకుంటాను. న్యాయాన్యాయ విచక్షణ దక్షుడైన ఆపరమకృపానిధి పడుకుని నిద్రావస్థలో వున్నాడు కాబోలు. అని కండ్లవెంబడి అశ్రుధారలు విడుస్తూ వడిస్తుంది. (భాస్కరుడు భోజనం చేసి లేస్తాడు.)

భా: అమ్మా! నేనాడుకోడానికి పోతాను.

మా: గురువుగారిదగ్గిర పాఠాలు నేర్చుకోవా?

భా: ఊఁ! ఊఁ!! ఈ రోజు మహార్నవమి - అనధ్యాయదినం అంచేతాడుకుంటానమ్మా! నీదగ్గిర కూర్చుంటే నువ్వు స్తమానూ యేడుస్తావు. నువ్వేడిస్తే నే చూడలేను. (అని పోతాడు).

## 4

[భాస్కర మంత్రి భవంతి పూర్వనైభవం చాటుతూ ప్రస్తుత పరిస్థితిలో కొంత శిథిలావస్థలో వుంటుంది. ఇంటిముందు పెద్ద వసారాలో కొందరు పిల్లలు గుమిగూడి గోలచేస్తూ వుంటారు. దాగుడుమూత లాడుకుంటూ వుంటారు.]

# వచ్చితివి తల్లీ!

చిల్లర భావనారాయణ రావు

ఎన్నాళ్లైనది రమ్మురమ్మ జననీ ఈ గడ్డఁ గాలూని మా
దన్నల్ అక్కన లైన మేమిడు సముద్యత్స్వాగత మ్మందుకో,
హృన్నవ్య ప్రసవోపహారములు నర్పింపఁగ ప్రమోదాశ్రువుల్
కన్నుల్ నిండెను, ఝంకరించెను తెలంగాణమ్మ నీ రాకతో!

మరచి పోలేదుగా మన యలంపుర శిల్ప
సుందరి మోమదే చూడవమ్మ
జ్ఞప్తియున్నది గదా గద్వాల సంస్థాన
కావ్యేందిరామణిఁ గాంచు మదిగో
పొల్పుకోవమ్మ నీ ముద్దు కుమారి కృ
ష్ణమ పసిపాపయై నడచె నిచట
పూలుగా నీ త్రోవ రాలిరి ప్రజ మొన్న
నిచ్చట కరుణ వర్షించవమ్మ
వచ్చితివి తల్లి నీ యింటి పట్టుకీవు
తెలుగు జగముల కోర్కె సిద్ధించె, నన్న
దమ్మ లేకమై నీదు పాదాల కొరుగ
నధివసింపు మహాంధ్ర సింహాసనాన॥

# ★ గూటి పలుకు ★

భాస్కర్ : ఓరే! విస్సూ!! అంతా దాక్కున్నారు పోయి వెతుక్కో.

వి : ఎవరెక్కడున్నారో నీకు తెలుసును గనక చెప్పవూ ?

భా : తప్పు! నేను తల్లిని అలా వాళ్ళ విషయం నాకు తెలిసినా నీకు చెప్పకూడదు. (గట్టిగా) పిల్లీ వచ్చె, ఎలుకా! దాగో, ఓరే విస్సూ! పోరా! ఫో!! నా దగ్గర నిలబడకూడదు.

(విస్సు పోతాడు. ఇద్దరు భట్రాజులు ప్రవేశిస్తారు).

1 వ భటు : సిద్ధిరాజా! చూశావా? కాలానపరిస్థితి. ఎంతలో యెంతమార్పు! ఏ మహానుభావుని యింటిదగ్గర ఆశ్రితులు సర్వకాల సర్వావస్థలయందు ఆశించిన కోర్కెలు పొందగలిగేవారో, ఏ ధీమంతుని ప్రాంగణంలో మహామహులు గుంపులుగూడి రాజకీయ సలహాలు పొందగలిగేవారో, ఏ వదాన్యుని గృహంలో నిరతాన్నప్రదానం విధి విరామం లేకుండా జరిగేదో, అలాంటి ఈ గృహం ఈనాడు పాడుబడి, బాగు చేయించే దిక్కు గూడా లేక, నిరస్తభూషయైన పేదయిల్లాలి వేషంలో కనిపిస్తోంది.

సి: ఔను, భైరవా! నాకు జ్ఞాపకం వచ్చింది. ఎంతలో ఎంతమార్పు వచ్చింది. అబ్బా! ఈ దివ్యభవనం చూసి ఆనాటి విషయం ఒక్కొక్కటే జ్ఞాపకం వచ్చి హృదయం కరిగిపోతోంది.

భై: సిదిరాజా. ఈదృశ్యం చూస్తేదుఃఖం పొర్లుకొస్తోంది. ఈ దృశ్యం చూసి ఎవరి మనస్సు నిలుస్తుంది. (అని పరికించి చూసి) నాయనా! అబ్బాయి. నువ్వెవరు నాయినా?

భా: అయ్యా! మీరెవరు (పిల్లలుగుంపుగా భట్రాజులచుట్టూ చేరుతారు).

భై. బాబూ! మేం భట్రాజులం. నువ్వెవరు నాయినా? యెవరి పిల్లవాడివి?

విస్సు: ఇతని పేరు భాస్కరుడండి. రాయన భాస్కర మంత్రిగారి మనవడు.

సి: ఓహో! ఆమహానుభావుడి పేరు వింటే వొళ్ళుపులకరిస్తోంది. ఆకలనే పేరు ఆలించలేని నవనీతులవంటి హృదయంగలవాడా మహానుభావుడు. చిన్ననాడు గణితం నేర్చుకునేటప్పుడు కూడా 'ల' కి 'యే' త్వము 'ఏ'కి కొమ్ము అని ఉచ్చరించని ఉదార స్వభావుడు-'పోయెగదా? కీర్తికాంత'

భా: 'పోలేదు సుమీ'

భై: ఏది నాయినా! మరి.

భా: (కుడిచేతితో యెడమచేతి బంగారు మురుగు బైటకితీస్తూ) ఇదిగో!

వి: ఎందుకురా? అలా లాగుతావు?

భా: విస్సూ! సాయంచెయ్యి బైటికి తీద్దామీ మురుగు (అని బైటకితీసి) అయ్యా! భట్రాజులు. ఇదిగో యీ మురుగు తీసుకోండి. (అని యిస్తాడు).

భై (పుచ్చుకుని) నాయినా! భగవంతుడు ఆయురారోగ్యఐశ్వర్యాలు నీకు కలగజెయ్యాలి.

వి: ఒరే! బంగారమ్మురుగు భట్రాజుల కిచ్చేసేవని మీ అమ్మతో చెప్తానుండు. (అని యింటిలోకి దౌడు తీస్తాడు. వెనకనే భాస్కరుడు జంకుతూ మెల్లిగా యింట్లోకి వెళతాడు.)

సి: భైరవా! ఈసితిలో వారిదగ్గర మనం బంగారు మురుగు పుచ్చుకోవడమేంటిరా? ఇచ్చెయ్యరాదు?

భై: ఇచ్చేద్దాంగాని, [illegible] చూసేవా? ఏగూటి చిలక ఆ పలుకు పలక్క మానదు. 'వసంతకాలే సంప్రాప్తే - కాకః కాకః పికః పికః'! సింహానికి సింహంపిల్లే పుడుతుందిగాని కొంకినక్క పుడుతుందా? అదిగో ఆ పిల్లవాడిని రెక్కపట్టుకుని ఒకావిడ తీసుకొస్తోంది. బహుశా పిల్లవాడి తల్లై వుంటుంది. సంగతేంటో చూద్దాం నిలబడు.

మా: (భాస్కరుడితో ప్రవేశించి) అయ్యా! మీరేనా? భట్రాజులు?

భ: ఔను తల్లీ!

మా: మీరీసరికెంతో దూరం పోతారని తొందరగా వచ్చేను. మావాడు తప్పుచేసేడు క్షమించండి బాబు

సి: అదేంమాట తల్లీ! ఈ మురుగు గా అబ్బాయి యిచ్చేడు. మేం తీసుకోలేదు కావలస్తే తీసుకోండి (అని యివ్వబోతాడు).

మా : అయ్యయ్యో! మళ్లా తిరిగి తీసుకుంటామా? బాబు. ఎంతతప్పు. అసలు పిల్లాడికి తెలియక ఒక్క మురుగే యిచ్చేడు.

భా : (అప్రతిగా- సంతోషంతో) అమ్మా! అయితే రెండో మురుగుకూడా ఇచ్చివేయమంటావా?

మా : ఇచ్చినాయనా! ఇచ్చి ఎవరైనా మురుగులు జత యిస్తారుగాని ఒకమురుగు ఇవ్వరు. నువ్విలాచేసి మీ తాతగారి కీర్తికి కళంకం కలగజేసేవు. ఎంతతప్పు

(భాస్కరుడు సంతోషంగా రెండో మురుగుతీసి భట్టుకిస్తాడు.)

మా : ఇప్పుడు నీ జన్మం చరితార్థం అయిందినాయనా! 'పోయెగదా కీర్తికాంత రాయన భాస్కరుని తోనె' అంటే, నవ్వన్న 'పోలేదు సుమీ' అన్నమాట ఇప్పుడు నిలబెట్టుకున్నావు. (అని ఆనంద బాష్పాలు విడుస్తూ కొడుకుని ముద్దాడుతుంది.)

భై : తల్లీ! మాకు పరమానందంగా ఉంది. మిమ్మల్ని పరీక్షించడానికి మురుగు పుచ్చుకుని ఇక్కడే నిలబడ్డాంగాని మాకేది వద్దు కొడుక్కి తగిన తల్లి తల్లికి తగిన కొడుకు. నత్తగుల్లలన్నీ ఒక రేవుకి-ముత్యపు చిప్పలన్నీ ఒక రేవుకి చేరడం సహజమే. అమ్మ ఈ మురుగులజోడా మా చేత్తో ఆ అబ్బాయికి తొడుగుతాం. (భాస్కరుని చేతుల్లో వుంచి)

పస ముత్య మొకటి చాలును
కస పూడ్చిన చింపిరాలు గంపెండేలా?
రసికుం డొక్కడె చాలును
రసహీనులు పదుగురేల? రాయనిబాబా!

(అని పిల్లవాడి చేతులకు మురుగులు తొడిగి, ఆనంద బాష్పాలు విడుస్తూ) నాయనా! నీకు భగవంతుడు [illegible] ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించాలి. (అని నిష్క్రమిస్తారు భట్టు-తల్లీ పిల్లడు మిగతా పిల్లలు లోనికి పోతారు.) ★


## అతిమూత్ర వ్యాధి
## నెమ్మదించును

మూత్రంలో చక్కెరపోవటం అతిమూత్ర వ్యాధి (DIAB_TES) అంటారు. ఇది ఎంత ఉపద్రవకరమైన వ్యాధి అంటే, దీని పాలబడినవారు అరోజుకారోజు మృత్యువుకు ఆసన్నమౌతుంటారు ఈజబ్బు లక్షణాలలో ముఖ్యమైనవి ఎక్కువగా దాహం, ఆకలి. తరచుగా చక్కెరతోగాని, లేక చక్కెరలేకుండగాని మూత్రం బయలు వెడలటము, దురద మొదలైనవి. వీనస్ ఛారమ్ అనేక సంవత్సరముల పరిశోధనల ఫలితంగా తయారు కాబడినది. దీన్ని వాడటంవల్ల వేనకు వేల మందిమృత్యుముఖమునుండి బయటపడ్డారు దీన్ని వాడితే రెండవలేక మూడవ రోజు నుండేమూత్రంలో చక్కెర తగ్గించి. అత్యధిక మూత్రంకూడా నివారిస్తుంది. మూడురోజుల తర్వాత మీకు బాగా తేలిక ఇస్తుంది దీనికి పథ్యంలేదు. ఇన్‌జెక్షన్లు అవసరంలేదు. వివరములు గల ఇంగ్లీషు కరపత్రానికి వ్రాయండి. ఉచితంగా పంపెదము.

50 బిళ్లల బుడ్డి ఖరీదు రు. 6-12-0 లు.

ప్యాకింగు పోస్టేజీ ఉచితము.

Venus Research Laboratory (A.P.)
P. O. Box No. 587, Calcutta.

# * చాళుక్య సందేశం *

వేంగి చాళుక్యులదగ్గరనించి వచ్చిన సందేశాన్ని వింటూంటే కాకతీయ ప్రోలరాజు ముఖభంగిమలు అనేకంగా మారాయి రాయబారి వినయంగా ఉచితాసనంలో కూర్చొని సమాధానానికె గురుచూస్తున్నాడు. ‘విరాధివీరుడూ ఇంగితజ్ఞుడూ ప్రోలరాజు ఏమి సమాధానం చెబుతాడోననీ-ముఖ్యంగా చాళుక్యులు పంపిన సందేశం ఏమై ఉంటుందా’ అనీ సామంతులూ ప్రధానులూ ఉద్యోగులూ ఉత్కంఠతో ఉన్నారు ముసలిఉద్యోగులుకొందరు ‘ఈ తూర్పుచాళుక్యులు కాకతీయులపై తాము కోల్పోయిన ఆధిపత్యాన్ని మళ్ళీ కోరుతున్నారా?’ అనికూడా అనుమానించారు

ప్రోలరాజు విశాలనేత్రాలు దర్బారును కలయజూస్తూ కొంచెంమారంగా ఒక ప్రక్క ఆసీనుడైన వ్యక్తిమీద ఆగిపోయాయి ప్రభువు ముఖకవళికల్ని పరీక్షిస్తున్నవారు కూడా ఆ వ్యక్తినిమాసి ‘ఇదేదో కదనరంగానికి సంబంధించిన వ్యవహారమే’ అని నిశ్చయించుకున్నారు ప్రోలరాజు ఏవ్యవహారం వచ్చినప్పుడు ఏ వ్యక్తిని అనుగ్రహిస్తారో అనుభవజ్ఞులైన కొందరు సభ్యులకు తెలుసు అనిశ్చయంతోనే ఈసారికూడా ఊహించారు

“బ్రహ్మన్న సేనానీ!” సాలోచనగా పిల్చారు ప్రోలరాజు. ఆసీనుడైనవ్యక్తి సవినయంగా నిల్చొని అభివాదనం చేసి సమీపించాడు

“ఈ సందేశాన్ని సామంతులకూ ఉద్యోగులకూ వినిపించు” అని ప్రోలరాజు ఆ లేఖ అందించారు

“మహాప్రసాదం!” అంటూ సవినయంగా బ్రహ్మన్న ఆలేఖ అందుకున్నాడు. యోధుడూ కాకతీయ సర్వసైన్యాధ్యక్షుడూ రేచర్ల బ్రహ్మన్న సందేశాన్ని గంభీరస్వరంతో చదవడం ఆరంభించాడు.

“శ్రీ శ్రీ శ్రీ దుర్జయాన్వయచంద్రులు. మహామండలేశ్వర బిరుదాంచితులు అగు కాకతీయ ప్రోలరాజు సన్నిధికి - శ్రీశ్రీశ్రీ చాళుక్యవంశ సుధాకరుడూ నవసామ్రాజ్య నిర్మాణ దీక్షాకంకణుడూ అయిన రాజేంద్ర చాళుక్యుడు పంపిన మైత్రీసందేశము.

మాతండ్రిగారూ మహాభారత కృతిభర్తా అయిన శ్రీ రాజరాజనరేంద్రుల మరణానంతరము వేంగీరాజ్యాన్ని మా పినతండ్రి విజయాదిత్యులకి అప్పగించి నేను నా సామ్రాజ్య నిర్మాణ ప్రయత్నాలను సాగిస్తున్నాను మా తాతగారు రాజరాజచోళుడూ-ఆయన కుమారుడూ మా మేనమామ అయిన రాజేంద్రచోళుడూ వైభవంగా యేలిన చోళ సామ్రాజ్యలక్ష్మి ఈ నాడు అరాజకమై బాధపడుతూంది మా మామ అపుత్రకుడుకదా! కాంచీ రాజ్యలక్ష్మిని నేను చేపటడమే ఆయన అభిమతంకూడా. చోళరాజ కుటుంబానికే చెందనవీరచోడుడు దురాశతో చాలరోజులు నిరీక్షించాడు

## “కన్నసావి”

రాజేంద్రచోళుడు బ్రతికివుండగా ఏ విధంగానూ సాధ్యం కానితన ప్రయత్నం ఇల్లాంటి సమయంలో కొనసాగిస్తున్నాడు నాపై యుద్ధం ప్రకటించాడు అంతమాత్రంలో మునిగినదేమీ లేదు కాని అతడు పంపిన …తాను పశ్చిమచాళుక్యుల సామంతుడనని తెలియపర్చాడు అంటే ఈ యుద్ధంలో వారుకూడా పాల్గొంటారని నా విశ్వాసం. ఇది కేవలం నాకుమాత్రమే వచ్చే ముప్పుకాదు సస్యశ్యామలంగా ఉండి ప్రజలు సుఖసంపదలతో వున్న ఇరుగుపొరుగు రాజ్యాలకంతటికీ ఏదో ఉపద్రవం తెచ్చిపెట్టాలనే ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్నారు పశ్చిమచాళుక్యులు. వారి దురుద్దేశానికి వీరచోడుడి ఆహ్వానం దోహదమిచ్చింది మా గూఢచారులవల్ల తెలుసుకున్న విషయాల్ని బట్టి-పశ్చిమచాళుక్యుల సహాయంతో వీరచోడుడు కాల్బలాన్ని అశ్వికదళాల్ని గజబలాన్నికూడా విరివిగా లక్షలకొలదీ సమకూరుస్తున్నాడని తెలిసింది ఇదంతా నా ఒక్కడి రాజ్యంపైకైఅయితే అవసరం కాదా! ఇది తప్పక మహోపద్రవమే! దీని వెనుకనే ఆకలిగొన్న సింహాలలాగ సమయాన్ని కనిపెట్టి మనరాజ్యాలను కబళింపజూస్తున్నారు పశ్చిమ చాళుక్యులు. వీర రాజన్యులందరూ ఈమహోపద్రవాన్ని అరికట్టాలనే ఉద్దేశంతో అందరికీ సందేశాలు పంపాను

కాకతీయప్రభువూ, సర్వసైన్యమూ, సామంతులూ మా ఈ గౌరవరక్షణోద్యమంలో పాల్గొంటారని కోరిక

శ్రీ శ్రీ శ్రీ రాజరాజేంద్రచోళభూపతి’

చదువుతున్న బ్రహ్మన్న సేనాని ముఖం రాగరంజితమైంది కాకతీయ ప్రోలరాజు అది చూశాడు.

“బ్రహ్మన్నా! మాపటివేళ ఏకాంత మందిరానికి ఒకసారి రావాలి ప్రధానీ మీరు కూడా ”

* * *

వేంగిరాజ్యాన్ని పినతండ్రి విజయాదిత్యునికి అప్పగించి స్వంతపనులలో వున్న

### వేగి క్షేత్రము

ఏదివ్యపూరుషు లీలాద్వ
లాంకూర
శేఖరమ్ముల లిఖించి రోయివెల్ల
ఈవాయు వీచిలో నేయపన్న
రస్నమా
జమునింపిరో గీతిసముదయంబు
ఏదివ్య శిల్పులీ రోదసీకుహారాన
వ్రాసిరో! దివ్యశిల్పంబులిన్ని!
ఈ పథాంతరమునం దేపురాణ
మునీంద్ర
సంతతులో ప్రశంసలు పొనర్తు
ఎటుగనిన బూగ్వపల్లవన్నవ
చరితలె
వ్రాయబడి, పాడబడి, గీయబడి,
యుపన్యసింపబడి శ్రోత్రపేయమై
చేన్నదాల్చె,
నీయతీంద్రియశక్తి నాకెట్టులబ్బె!
—విశ్వనాథ సత్యనారాయణ




సన్‌లైట్
సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

భారతదేశంలో
తయారుచేయబడినది

# * చాళుక్య సందేశం *

వేంగి చాళుక్యులదగ్గరనించి వచ్చిన సందేశాన్ని వింటూంటే కాకతీయ ప్రోలరాజు ముఖభంగిమలు అనేకంగా మారాయి రాయబారి వినయంగా ఉచితాసనంలో కూర్చొని సమాధానాని కెగురు చూస్తున్నాడు. 'వీరాధివీరుడూ ఇంగితజ్ఞుడూ ప్రోలరాజు ఏమి సమాధానం చెబుతాడోననీ-ముఖ్యంగా చాళుక్యులు పంపిన సందేశం ఏమై ఉంటుందా' అనీ సామంతులూ ప్రధానులూ ఉద్యోగులూ ఉత్కంఠతో ఉన్నారు ముసలి ఉద్యోగులుకొందరు 'ఈ తూర్పుచాళుక్యులు కాకతీయులపై తాము కోల్పోయిన ఆధిపత్యాన్ని మళ్ళీ కోరుతున్నారా?' అని కూడా అనుమానించారు

ప్రోలరాజు విశాల నేత్రాలు దర్బారును కలయజూస్తూ కొంచెందూరంగా ఒకప్రక్క ఆసీనుడైన వ్యక్తిమీద ఆగిపోయాయి ప్రభువు ముఖకవళికల్ని పరీక్షిస్తున్నవారు కూడా ఆ వ్యక్తిని చూసి 'ఇదేదో కదనరంగానికి సంబంధించిన వ్యవహారమే' నని నిశ్చయించుకున్నారు ప్రోలరాజు ఏ వ్యవహారం వచ్చినప్పుడు ఏ వ్యక్తిని అనుగ్రహిస్తారో అనుభవజ్ఞులైన కొందరు సభ్యులకు తెలుసు అనిశ్చయంతోనే ఈసారికూడా ఊహించారు

"బ్రహ్మన్న సేనానీ!" సాలోచనగా పిల్చారు ప్రోలరాజు. ఆసీనుడైనవ్యక్తి సవినయంగా నిల్చొని అభివాదనం చేసి సమీపించాడు

"ఈ సందేశాన్ని సామంతులకూ ఉద్యోగులకూ వినిపించు" అని ప్రోలరాజు ఆ లేఖ అందించారు.

"మహాప్రసాదం!" అంటూ సవినయంగా బ్రహ్మన్న ఆలేఖ అందుకున్నాడు. యోధుడూ కాకతీయ సర్వసైన్యాధ్యక్షుడూ రేచర్ల బ్రహ్మన్న సందేశాన్ని గంభీర స్వరంతో చదవసాగాడు.

"శ్రీ శ్రీ శ్రీ దుర్జయాన్వయచంద్రులు-మహామండలేశ్వర బిరుదాంచితులు అగు కాకతీయ ప్రోలరాజు సన్నిధికి - శ్రీశ్రీశ్రీ చాళుక్యవంశ సుధాకరుడూ నవసామ్రాజ్య నిర్మాణ దీక్షాకంకణుడూ అయిన రాజేంద్ర చాళుక్యుడు పంపిన మైత్రీసందేశము,

మాతండ్రిగారూ మహాభారత కృతిభర్తా అయిన శ్రీ రాజరాజనరేంద్రుల మరణానంతరము వేంగీరాజ్యాన్ని మా పినతండ్రి విజయాదిత్యులకి అప్పగించి నేను నా సామ్రాజ్య నిర్మాణ ప్రయత్నాలను సాగిస్తున్నాను మా తాతగారు రాజరాజ చోళుడూ-ఆయన కుమారుడూ మా మేనమామా అయిన రాజేంద్రచోళుడూ వైభవంగా యేలిన చోళ సామ్రాజ్యలక్ష్మి ఈనాడు అరాజకమై బాధపడుతూంది మా మామ అపుత్రకుడు కదా! కాంచీ రాజ్యలక్ష్మిని నేను చేపటడమే ఆయన అభిమతంకూడా. చోళరాజ కుటుంబానికే చెందినవీరచోడుడు దురాశతో చాలరోజులు నిరీక్షించాడు

## "కన్న సామి"

రాజేంద్రచోళుడు బ్రతికివుండగా ఏ విధంగానూ సాధ్యం కానితన ప్రయత్నం ఇల్లాంటి సమయంలో కొనసాగిస్తున్నాడు నాపై యుద్ధం ప్రకటించాడు. అంతమాత్రంలో మునిగినదేమీ లేదు కాని అతడు పంపిన లేఖలో తాను పశ్చిమచాళుక్యుల సామంతుడనని తెలియపర్చాడు అంటే ఈ యుద్ధంలో వారుకూడా పాల్గొంటారని నా విశ్వాసం. ఇది కేవలం నాకుమాత్రమే వచ్చే ముప్పు కాదు సస్యశ్యామలంగా ఉండి ప్రజలు సుఖసంపదలతో వున్న ఇరుగుపొరుగు రాజ్యాలకంతటికీ ఏదో ఉపద్రవం తెచ్చిపెట్టాలనే ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తున్నారు పశ్చిమచాళుక్యులు. వారి దురుద్దేశానికి వీరచోడుడి ఆహ్వానం దోహదమిచ్చింది మా గూఢచారులవల్ల తెలుసుకున్న విషయాల్ని బట్టి-పశ్చిమచాళుక్యుల సహాయంతో వీరచోడుడు కాల్బలాన్నీ అశ్వికదళాల్నీ గజబలాన్నీకూడా విరివిగా లక్షలకొలదీ సమకూరుస్తున్నాడని తెలిసింది ఇదంతా నా ఒక్కడి రాజ్యంపైకి అయితే అనవసరం కాదా! ఇది తప్పక మహోపద్రవమే! దీని వెనుకనే ఆకలిగొన్న సింహాలలాగ సమయాన్ని కనిపెట్టి మనరాజ్యాలను కబళింపజూస్తున్నారు పశ్చిమ చాళుక్యులు. వీర రాజన్యులందరూ ఈ మహోపద్రవాన్ని అరికట్టాలనే ఉద్దేశంతో అందరికీ సందేశాలు పంపాను

కాకతీయప్రభువూ, సర్వసైన్యమూ, సామంతులూ మా ఈ దేశరక్షణోద్యమంలో పాల్గొంటారని కోరిక

శ్రీ శ్రీ శ్రీ రాజరాజేంద్రచోళభూపతి"

చదువుతున్న బ్రహ్మన్న సేనాని ముఖం రాగరంజితమైంది కాకతీయ ప్రోలరాజు అది చూశాడు.

"బ్రహ్మన్నా! మాపటివేళ ఏకాంత మందిరానికి ఒకసారి రావాలి ప్రధానీ మీరు కూడా"

* * *

వేంగిరాజ్యాన్ని పినతండ్రి విజయాదిత్యునికి అప్పగించి స్వంతపనులలో వున్న

### వేగి క్షేత్రము

ఏదివ్యపూరుషు లీశాద్వ
లాంకూర
శేఖరమ్ముల లిఖించి రోయివెల్ల
ఈవాయు వీచిలో నేయప్ర
రస్నమా
జమునింపిరో గీతిసముదయంబు
ఏదివ్య శిల్పులీ రోదసీకుహరాన
వ్రాసిరో! దివ్యశిల్పంబులిన్ని!
ఈ పథాంతరమునం దేపురాణ
మునీంద్ర
సంతతులో ప్రశంసలు పొనర్చి
ఎటుగనిన బూర్వపల్లవస్ఫుప
చరితలె
వ్రాయబడి, పాడబడి, గీయబడి,
యుపన్యసింపబడి శ్రోత్రపేయమై
చెన్నుదాల్చె,
నీయతింద్రియశక్తి నాకెట్టులబ్బె!

—విశ్వనాథ సత్యనారాయణ

చూడండి!

సన్‌లైట్

సగంబిళ్ల మాత్రమే

ఈ బట్టలన్నిటిని ఉతికింది!

అట్లు చేసినట్టిది దాని అధికమైన నురగ!




సన్‌లైట్

సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

భారతదేశంలో
తయారుచేయబడినది

# ★ చాళుక్య సందేశం ★

రాజరాజేంద్రునికి చాలా రోజు లీవిషయం తెలియలేదు విజయాదిత్యుని స్వరాష్ట్రం 'నలంబవాడి' అతడు తరచు అక్కడే ఉంటాడు ఈ సందర్భంలో అతను పొరబాటు చేశాడు రాజరాజేంద్రుడు అప్పగించిన కొత్త ప్రభుత్వాన్ని అశ్రద్ధ చేసి నలంబవాడి వెళ్ళి కూర్చున్నాడు తన కుమారుడు శక్తివర్మను వేంగిలో నియమించాడు శక్తివర్మ అనుభవహీనుడు అప్పటికే వేంగి అందోళితమై ఉండగా మరొక చిక్కు కూడా తటస్థించింది అది శక్తివర్మ అకాలమరణం విజయాదిత్యుడికి సంగతులు తెలిసేసరికి చాలాకాలం పట్టింది నలంబవాడి పశ్చిమ చాళుక్యుల సామ్రాజ్యానికి సమీపం కావడంచేత — వీరచోడునికి సహాయంగా పశ్చిమ చాళుక్యుల సైన్యసన్నాహం, తన పుత్రుని మరణవార్త తెలిశాయి విజయాదిత్యుడు రాజరాజేంద్రుని దగ్గరకు పరుగెత్తుకు వచ్చి విషయం తెలిపాడు వినువెంటనే రాజరాజేంద్రుడు ఆంధ్ర వీరరాజన్యులందరకూ సందేశాలుపంపి పినతండ్రితో వేంగి చేరుకున్నాడు

*   *   *

పినతండ్రీ, కుమారుడూ వేంగి రాజధాని చేరుకున్న వెంటనే శత్రువులు కోటను ముట్టడివేశారు శత్రుసైన్యం అసంఖ్యాకంగా ఉంది వేంగిచాళుక్య వీరులు ధైర్యంతో ఎదుర్కొన్నారు కొంతసేపు తీవ్రసమరం సల్పిన తరువాతనే శత్రువుల సంఖ్య హెచ్చిందని వేంగి సైనికులు తెలుసుకున్నారు తన పినతండ్రి విజయాదిత్యుడు వెనుకంజ వేశాడేమో అనే అనుమానం రాజరాజేంద్రునికి కలిగింది అప్పటికే వీరచోడుని సైనికులు కోటగోడ లెగబ్రాకుతున్నారు సింహద్వారాన్ని సమీపించబోతున్నారు రాజరాజేంద్రుడు విజయాదిత్యుని కోటలోపల జాగ్రత్తగా చూడమనీ బురుజులపై సైనికులకు నాయకత్వం వహించి ఆజ్ఞలిమ్మనీ చెప్పి కోటలోకి పంపివేశాడు పైన రాజరాజేంద్రుడు శత్రువులవల్ల ఉక్కిరిబిక్కిరైపోతున్నాడు ఇక కోట శత్రువుల కైవసం అవుతుందని నిశ్చయించుకున్నారు కొందరు సైనికులు

ఇంతలో మెఱుపులాగ ఒక రౌతు దూసుకొని వచ్చి తిన్నగా రాజరాజేంద్రుని ముందు ఆగి అభివాదనం చేశాడు అతడు వినయంగా నిలబడకుండా దగ్గరకు వచ్చి రాజరాజేంద్రుని చెవిలో ఏదో చెప్పాడు.

వేంగిరాజు ముఖంలో ఆనందం ఉప్పొంగిపోయింది వార్తాహరుని మెడలో ఒక హారం వేశాడు ఒక్కొక్క సేనానికీ తనే పనిగట్టుకొని ఆ కబురు అందజేశాడు సైన్యంలో తిరిగి ఉత్సాహం వచ్చేసింది కదనరంగంలో అసంఖ్యాకంగా ఉండే శత్రుమధ్యంలో వేంగి చాళుక్య వీరులు మెఱుపులై తిరిగారు

భేరీనాదాలూ శంఖారవాలూ దిక్కులు పిక్కటిల్లేటట్టు వినిపించాయి వీరచోడుని సైన్యాలకి కోలాహలమేమిటో అర్థం కాలేదు కొందరు తెలుసుకోకుండానే అధైర్యం చెందారు రాజరాజేంద్రుడి పరివారం ఉత్సాహోద్రేకాలతో కేకలు వేశారు వేలపదాతులూ అశ్వదళమూ గజబలమూ భూమి ఈనినట్టు వేంగిసైనికులతో కలసిపోయారు కాకతీయ వీరులూ, సామంతులూ, ఆంధ్రపాలకులనేకమందీ, వేంగి సైన్యాలలో కలిశాక వీరచోడుని సైన్యాలు ద్విగుణీకృత మయాయి వేంగి సైనికులు ఆంధ్రరాజ సమూహానికీ, మహేంద్రానికీ జేజేలు పలికారు ఆనాటి సాయంకాలానికి చాలమంది వీరచోడుని సైనికులు మరణించారు వీరచోడుడు హఠాత్తుగా తాత్కాలిక యుద్ధవిరమణ పత్రాన్ని పంపాడు

రాజరాజేంద్రుడు కాకతీయ ప్రోలరాజును కౌగలించుకొన్నాడు ఆనాటికి వీరచోడుని అభిప్రాయప్రకారం యుద్ధవిరమణ చేద్దామని ప్రోలరాజు సలహా ఇచ్చాడు రాజరాజేంద్రుడీ విషయంలో జవాబీయకముందే బ్రహ్మన్న సేనాని వినయంగా ఇలా విన్నవించాడు

"ప్రభూ, వీరచోడుడు నీచుడని అందరికీ తెలుసు అతని మాటలకూ చేతలకూ చాల దూరం ఈ తాత్కాలిక విరమణ ప్రకటించడంలో ఏదో ద్రోహచింత పెట్టుకొని వుండవచ్చు గనుక, మన సైన్యమూ ఈ రాత్రంతా మెలకువతో గడపవలసి ఉంటుంది అంతేకాదు ఈ విరమణను అంగీకరించకుండా యుద్ధాన్ని కొనసాగించడమే మంచిదని నా మనవి"

కాకతీయ ప్రోలరాజు ఒక చిరునవ్వు నవ్వాడు



బెజవాడ కనకదుర్గ దేవాలయము

# చాళుక్య సందేశం

"బ్రహ్మన్నా! అతడు ద్రోహి కావచ్చు. ఇప్పుడుమాత్రం అతను అభ్యర్థి. మనం అంగీకరించకపోవడందుర్బలునిమీదదౌర్జన్యం చేసినటుంటుంది. అతడు ద్రోహం తల పెడితే తగినటు శిక్షించడానికి త్రాచుపాము లాటి మా సేనాని ఉండనే ఉన్నాడు." ఇందుకు బ్రహ్మన్న ఏమీ జవాబీయకుండా తలవంచి నిల్చున్నాడు. రాజరాజేంద్రుడు యుద్ధ విరమణకు అంగీకరిస్తూ వీరచోడునికి జవాబు పంపించాడు. తనని అపాయం నుంచి కాపాడి ధైర్యాన్నిచ్చిన ప్రోలరాజుకు వేంగిపాలకుడు తన కృతజ్ఞత తెలిపాడు.

బ్రహ్మన్నకు మాత్రం ఇదంతా అనుమానంగానే ఉంది. వీరచోడుడి అహంకృతికీ-ఈ తాత్కాలిక విరమణకీ పొసగలేదు. కాబట్టి ఇందులో ఏదో కుట్ర ఉంటుంది. తన ప్రభువుమాటను బ్రహ్మన్న యేనాడూ కాదనలేదు. బ్రహ్మన్న తండ్రి తాతలుకూడా కాకతీయరాజులదగ్గర సైన్యాధ్యక్షులుగానే పనిచేసి విజయాల్ని చేకూర్చారు. ప్రభువుకు ఎదురై జవాబు చెప్పకుండానే పరిస్థితుల్ని కనిపెట్టిఉండగం బ్రహ్మన్న కలవాటు.

* * *

ఆ రాత్రి గుడారంలో పది మంది జెట్టీలు బ్రహ్మన్న ఎదుట వినయంగానిలబడ్డారు. వాళ్ళకు రహస్యంగా కొన్ని ఆజ్ఞలిచ్చాడు సేనాని. వాళ్లు గుడారం విడిచి వేర్వేరుగా పోయారు. బ్రహ్మన్న ప్రతి దళాధిపతినీ వేంగిసైన్యానికి సహాయంగా కోటను ఆ రాత్రింతా కనిపెట్టి ఉండాలని-తీవ్రంగా



హైదరాబాదులో చార్‌మినార్ వద్దగల శివాలయం.

హెచ్చరించాడు. బురుజుల మీద తగుమాత్రం సైన్యం పహరా యిస్తూంది.

రాత్రి రెండు ఝాములకు ఒక జెట్టీవచ్చి బ్రహ్మన్న గుడారంలో ప్రవేశించాడు. తక్కిన తొమ్మండుగురూ - వీరచోడుడు ఎటు పరారీ అయిపోతాడో అని కనిపెడుతున్నారనీ, సుమారు పాతిక మంది నమ్మకమైన వాళ్లుకూడా వెంట వెళుతున్నట్టు కనిపిస్తోందనీ విన్నవించాడు. బ్రహన్న అతనితో-ప్రభువుకు తెలుపవలసిందిగా కొన్ని విషయాలు చెప్పాడు. రెప్పపాటులో సుశిక్షితులైనవందమంది అశ్వికులను ఆయత్తం చేశాడు. మిగిలిన తొమ్మండుగురు జెట్టీలూ ఇంతలోనే వచ్చి వీరచోడుడు తగుమాత్రం సైనికులతో దక్షిణంవైపు పరారీ అవుతున్నాడని చెప్పారు. ముందు బ్రహ్మన్న ఒక ఉత్తమాశ్వంపైనా తగువాత వందమంది అశ్వికులూ రెప్పపాటులో దూసుకుపోయి చీకట్లో కలిసిపోయారు.

తెల్లవారేసరికి వీరచోడుని గుడారాలు ఖాళీ అయిపోయాయి. రాత్రికి రాత్రే వీరచోడుడూ కొంతమందీ పరారీ అయినట్టు తెలుసుకున్న మిగిలిన సైనికులు చెల్లాచెదరుగా పారిపోయారు. అదే విధంగా వేంగి సైనికులుకూడా తెలిసికొనిఉండడంచేత చోళ సైన్యాన్ని తరిమి తరిమి పరాభవించారు. ప్రభాత భేరీనాదంతో సమంగానే వీరచోడుని పరారీ వార్త ప్రోలరాజుకూ రాజరాజేంద్రునికీ చెవిని పడింది. జెట్టీ వచ్చి రాత్రి జరిగినదంతా విన్నవించాడు. బ్రహ్మన్న చాకచక్యానికి ప్రోలరాజు గర్వించాడు. రాజరాజేంద్రుడు కృతజ్ఞత ప్రకటించాడు. ప్రోలరాజు మాత్రం తన ధర్మం నిర్వర్తించానను కున్నాడు.

బ్రహ్మన్న నాలుగు రోజులైనా ఇంకా రాలేదు. ప్రోలరాజు కొందరాశ్వికుల్ని వెదికి రమ్మని పంపాడు. వేంగిరాజ్యమంతా ఆనందోత్సాహాలతో వేడుకలు జరుపుకుంటూంది. రాజరాజేంద్రుడు బ్రహ్మాండమైనసభ ఏర్పాటుచేశాడు. ఆంధ్రప్రదేశానికి చెందిన అనేకమంది రాజులూ సామంతులూ పాల్గొన్న ఆ సభలో ప్రోలరాజు కూడా ఉన్నాడు. రాజరాజేంద్రుడు ఆంధ్ర రాజన్యు లందరకూ కృతజ్ఞత తెలియజేశాడు. సామంతు లందరకూ బిరుద ప్రదానాలు చేశాడు.

తమ దేశాన్ని పరాయి వారి నుంచి రక్షించుకున్నందుకు రారాజు లెందరో హర్షం ప్రకటించారు. అదే తరుణంలో మరొక శుభవార్త! బ్రహ్మన్న సేనాని కాంచీరాజును వెంట తరిమి, బుద్ధి గఱపి, నష్ట పరిహారంగా వెలలేని సంపదను తీసుకు వస్తున్నాడు. సభకంతటికీ ఇది సంతోషదాయకమైంది.

బ్రహ్మన్న రాగానే ప్రోలరాజు ప్రేమతో కౌగలించుకున్నాడు. ప్రోలరాజు సభాసదులకు 'బ్రహ్మన్న వంటి శూరుడు తనకు సేనానిగా ఉండడం గర్వకారణ'మని తెలిపారు.

"ఈ స్వదేశ రక్షణోద్యమంలో పాల్గొనే అవకాశం కలిగినందుకు మేము కృతజ్ఞులం. మిమ్మలని సమావేశపరచగలిగినందుకు ముఖ్యంగా శ్రీ శ్రీ శ్రీ రాజరాజేంద్ర భూపతిని అభినందించవలసి ఉంది. వారు అభీష్టానుసారంగా చోళ రాజ్యలక్ష్మిని చేబట్టి మాతామహుల కీర్తిని ఇనుమడింపజేసి, ఆంధ్రుల ప్రతాపాన్ని జోడా ర్యాన్ని దక్షిణాపథమంతా ప్రకటించగలరని నా విశ్వాసం."




ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సందర్భమున
మా ఖాతాదారులకు, అభిమానులకు శుభాకాంక్షలు.

లల్లూరాం అండ్ కంపెనీ

(స్థాపితము 1928.)
ఎన్నో సంవత్సరాలుగా మన్నికకు, నాణ్యతకు,
సరసమైన ధరలకు ప్రసిద్ధి చెందిన
* ఇనుప పెట్టెలు * ఉక్కుబీరువాలు
* క్యాషు బాక్సులు

లల్లూరాం అండ్ కో,
వెలగలేటివారి వీధి, : : విజయవాడ - 1.
క్రొత్త పోస్టాఫీసు - మారుతి సినిమా కెదురుగా

# "నివాళి"



చిత్రకారుడు: ఎమ్. పున్నయ్య

వెలిగించు దివ్వెలను చెల్లీ !
తొలగించు చీకటిని తల్లీ !

వెలుగులో మూలుగులు - తొలగి పోవాలంటు
నలిగి అలిగిన యెడద - కలిసి నిలవాలంటు
కలిమిలో బలిమిలో కలసి నిలవాలంటు
తెలుగు వెలుగులు మరల దిశల నిలవాలంటు,
వెలిగించు దివ్వెలను చెల్లీ !

మానవుల మనసులో అమవసలు లేవంటు
మానవత్వము నిలుప మనిషి లేవాలంటు
తాను కాలిన వేళ తనవారి సుఖమంటు
నూనె దివ్వెల నీతి మానవలె మనిషంటు
వెలిగించు దివ్వెలను చెల్లీ !

దీపావళికి నేటి దీపాలు వెలిగించి
పాపాల భైరవుల దీపాల చూపించి
ఏపాటి దయ నయిన ఇంత చిలకండంచు
రూపాయలకు మనిషి రూపాలు కొనకంచు
వెలిగించు దివ్వెలను చెల్లీ !

చిచ్చుబుడ్డుల వెలుగు చిమ్మించి చూపించు
పిచ్చి సొమ్మును నమ్మి పీల్చకుడు యెదలంచు
ఆ మతాబులవోలె అదరి పడకో యంచు
ఆ మతాబుల వెలుగు ఆ క్షణమె లెమ్మంచు
వెలిగించు దివ్వెలను చెల్లీ !
తొలగించు చీకటిని తల్లీ !

"వత్సల"





# కొంగ్రొత్త

# * ఆంధ్రవని

వచ్చింది దీపావళి!

శతాబ్దాల తరబడి విడివడి, దశాబ్దాల తరబడి అలజడిచేసి విజయం సాధించిన తెనుగు జాతి ఈ నాడు ఏకరాష్ట్రంగా ముడిపడబోతున్నది. పర పరిపాలనలో సర్కారులుగా, రాయలసీమగా, తెలంగాణాగా చెదిరిపోయిన మూడుకోట్ల ఆంధ్రులు మళ్ళీ ఒకే గొడుగు నీడలో కలుసుకున్నారు.

ఈ పునస్సమాగమ సంరంభం చూసిపోదామని సగర్వంగా దీపావళీ పర్వం కూడా వచ్చింది.

రేపటి దీపావళికున్న ప్రత్యేకత ఏ దీపావళికీ లేదు.

## రేపు

తెలుగుల కల వెలిగించ బడుతుంది.

వెలుగుల కల తెలిగించ బడుతుంది.

వర్షఋతు గోదావరిలా ప్రతి తెలుగువాడి హృదయం హర్షప్లావితమవుతుంది తిక్కన్న గారిపద్యాల మల్లే తెలుగు తనం బోర విరుచుకు సాగిపోతుంది కృష్ణరాయని కాలంలో వలె తెలుగుతల్లి ఆముక్తముక్తా మాల్యశోభితమవుతుంది.

అందుకే రేపటి దీపావళికీ ప్రత్యేకత.

* * *

అంతే కాదు. నూతనరాష్ట్రాన్ని ఆశీర్వదించడానికి భారత ప్రధాని స్వయంగా విచ్చేసి ఆంధ్రుల కపూర్వ గౌరవం ఆపాదిస్తున్నారు. భాషా ప్రయుక్తరాష్ట్రాలు భారతీ యైకమత్యానికి భంగం కలిగిస్తాయని ఏ నెహ్రూ అన్నారో ఆ నెహ్రూయే సంపూర్ణభాషా ప్రయుక్తరాష్ట్రమైన ఆంధ్రప్రదేశకు ప్రారంభోత్సవం చేయబోతున్నారు. ఇది చిరస్మరణీయమైన విశేషం.

* * *

## గుమ్మాలకి గుమ్మటాలు

రేపటి తెల్లవారు ఝామునే అంతా అభ్యంగనస్నానం చేసి, నూత్న వస్త్రాలు ధరించి ఉల్లాసంగా గడుపుతారు. తల్లులు మామూలు విందుకోసం పిండివంటలు వండుతుండగా, పిల్లలు కన్నుల విందుకోసం మందుగుండు సామగ్రి అంతా సిద్ధం చేసుకుంటూ ఉంటారు. ఎప్పుడెప్పుడు చీకటి పడుతుందా అని తహతహలాడిపోతారు.

చీకటి పడుతోందనగా వేఇంటింటా, అరుగులమీద, గోడల మీద, గూళ్ళలో, గుమ్మాల కటూ ఇటూ, ఎక్కడ చూ[illegible] దలు ప్రమిదలు వెలిగిస్తా[illegible] కెదురుగా గుమ్మటాలు పెడతారు. కళ్ళకి[illegible] కాళ్ళకి పారాణిరాసు[illegible] పట్టుచీరలకి రాసుకున్న[illegible] ఘుమలలో ఇల్లంతా[illegible] చూస్తూ పంపక్క[illegible] వ[illegible] సావిట్లో కుర్చీలో [illegible]

"సహస్రవిప్ర[illegible]

క్రేవల విస్[illegible]తాంధ్ర నృపకీర్తు[illegible]
ద్రావళి మోహముం బొరయునట్టు[illegible]
ధ్యావళి నిర్జితంబయి సహస్రవి[illegible]
పావళి సర్వమానవ శుభాభ్యుద[illegible]





వెలుగులతో

# ...తో దీపావళి *

...స్త్రీ అక్కడ ప్రమ
...రు. వాకిటి గుమ్మాల
జేలాడదీసి ప్రమిదలు
కొటుక పెటుకుని,
కుని, రెపరెపలాడే
అత్తరువుల ఘుమ
సంచరించే భార్యను
చ్చిన కొత్తల్లుడు
గా నిరాగం తీస్తూ కూర్చుంటాడు.

నాన్నగారి అనుమతి తీసుకుని పిల్లలు బాణసంచా అంతా అరుగుల మీదికి చేరేస్తారు వీధి మొగల్లో యువకజనం అప్పటికప్పుడే దివ్వటీలు పట్టుకుని పల్లటీలు కొడుతూ తిరుగ నారంభిస్తారు ఇక ప్రారంభమౌతాయి రకరకాల టపాకాయల ఢమఢమ ధ్వానాలు బాలబాలికల హృదయాలు కప్పగంతుల మల్లే చిందులు తొక్కుతాయి ఒకడి మొహం మతాబాలాగ వెలిగిపోతుంది ఒకడు అదే పనిగా అగ్గిపుల్లలు అంటిస్తూఉంటాడు ఒకడు ఖాళీ డబ్బాలో సీమ టపాకాయలు ముట్టిస్తాడు ఒకడు భయంగా దూరంగా కూర్చుని చూస్తూంటాడు. ఒకడు ఒళ్ళు కాల్చుకుంటాడు ఒకడు చిచ్చుబుడ్డిలాగ చిలిపి చేష్టలు చేసి పిరికి బావను భయపెడతాడు తాతయ్య కోపం తారాజువ్వలాగ ఆకాశం అంటుతుంది. ప్రమిదలో చమురైపోయిందనే కోపంతో భర్త దగ్గర కొచ్చిన కొత్త పెళ్ళికూతురు కాకరపువ్వొత్తి మల్లే సిగ్గుల పువ్వులు విరియిస్తుంది.

ఈ మహోద్యమంలో రహస్యోద్యమంగా సాగిన చీకటి పటాపంచలై పోతుంది.

ఇది దీపావళినాడు తెలుగునాడులో కనిపించే మనోహర దృశ్యం

* * *

## ఎవడీ నరకుడు?

పూర్వం నరకాసురుడనే వాడు లోకాలన్నీ ఆక్రమించి పీడిస్తుండగా, శ్రీకృష్ణుడు సత్యభామా సహితుడై, దండెత్తిపోయి నరకాసురుణ్ణి నరికేశాడు. ఈ నరకాసురుడెవడు? వీడికి మారుపేరు చీకటి నరకుడు దానవుడు కనుక నిశాటుడు. చీకటి కూడా రాత్రిపూటే గదా విజృంభిస్తుంది నరకుడు లోకాలన్నీ ఆక్రమించాడంటే చీకటి సర్వత్రా వ్యాపించిందని ఈ చీకటిని శ్రీకృష్ణుడు చీల్చి చెండాడివేశాడు.

ఈ సంఘటనను స్మరిస్తూ ఆశ్వయుజ అమావాస్యనాడు మనం కూడా యథాశక్తిగా చీకటను చెండాడడానికి ప్రయత్నిస్తాము. ప్రతి యువకుడూ కృష్ణుడుగా, ప్రతి యువతి సత్యభామగా ఉభయులూ కలిసి చీకటిపై యుద్ధం ప్రకటిస్తారు. ఈ రమణీయ దృశ్యాన్నే మనస్సులో పెట్టుకుని పోతన్నగారు సత్యభామ సంగ్రామక్రీడ నెలా వర్ణించారో చూడండి:

...లుల్లసిల్ల...."

...లు రూపము గొన్నరీతి, 'అం
...' అనుంగు తెనుంగునేల నాం
...పళ ఉల్లసిల్ల, దీ
...పావళి నా వెలింగెడున్.





వెలుగుల రవ్వలజడి — ఫొటో: శ్రీపాద వెంకన్న.

# ★ ఆంధ్రావనిలో దీపావళి ★

"నరుజూచున్ వరుజూచు నొంప
 నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో
 వీరంబు శృంగారమున్
జరగన్ గన్నుల గెంపుసొంపు బరగం
 జండాస్త్ర సంధోహమున్
నరసాలోకనమోహమున్ నెరపుచున్
 జంద్రాస్య హేలా గతిన్."

*   *   *

ఈ అన్నిరకాల బాణసంచాలోను అత్యంత కాంతిమంతంగా వెలిగేది చిచ్చుబుడ్డి. క్షణంలో అంటుకుంటుంది క్షణం సేపు విద్యుత్కాంతిని కూడా మరిపించే కాంతితో వెలుగుతూ "అంతంత దివికేగి అంతంత దిగిపో" తుంది. ఎందుకంటే అది చిచ్చుబుడ్డి.

చిచ్చుబుడ్డి ఆంధ్రులకు పర్యాయ పదమని కొందరు హేళన చేస్తారు.

ఉత్సాహం వస్తే ఆంధ్రులదే పైచెయ్యి. ఇది ఉత్సాహమా, ఉన్మాదమా అనిపించేటంత ఉద్వేగంతో ఆంధ్రులు పైకి లేస్తారు; ముందుకు దూకుతారు. అంతలో ఆవేశం చల్లారిపోయి ఎంతగీచినా వెలగని అగ్గిపుల్లలా మందకొడితనం వహిస్తారు. ఇది హేళన చెయ్యదలిచిన వారనే మాట.

కాని చిచ్చుబుడ్డి వెలిగినంత అందంగా ఏదీ వెలగదు. క్షణికమైతేనేం, ఎంత కమనీయకాంతి వెదజల్లుతుంది. ఎంత సౌమ్యంగా, ఎంత నిరపాయకరంగా మండుతుంది.

ఇంతెందుకు మనకీ చిచ్చుబుడ్డికీ పోలిక ఆంధ్రుల ఉత్సాహం క్షణికమైంది కాదు నాలుగు దశాబ్దాలపాటు స్వరాష్ట్రవాంఛ నిత్యాగ్నిహోత్రంలా జ్వలించింది. వాంఛాపూర్తి అయిన ఈ తరుణంలో అది ఇంకా అనేక అద్భుతకార్యాలకు పురికొల్పుతుంది

*   *   *

పోతే, ఆటంబాంబుల సమస్య ఒకటి ఉంది

ఆటంబాంబుల ఉత్పత్తిని, ప్రయోగాన్ని నిషేధించాలని భారత ప్రభుత్వం అంతర్జాతీయ వేదికలద్వారా, నివేదికల ద్వారా, చెవినిల్లు కట్టుకొని పోరుతోంది.

అగ్రదేశాలేవీ ఈ ఆందోళనను పట్టించుకోకపోగా హేళన చేస్తున్నాయి. మతాబాలు కట్టేంతరవాత అవి కాల్చేదాకా నిద్రపట్టని పిల్లల్లాగా, ఆటంబాంబుల్ని విప్పేడం కాలం వస్తుందా, ఎప్పుడు పేల్చేద్దామా అని అగ్రదేశాలు కొనుక్కూర్చున్నాయి. ఈ బాంబులు తయారు చెయ్యనే కూడదు గాని, తయారు చేసిన తర్వాత ప్రయోగించకుండా ఆపుచెయ్యడం బ్రహ్మతరం కాదు. అందుకే నెవాడాలోనో సైబీరియాలోనో పరిశోధన పేరుపెట్టి పేల్చేసి విధ్వంసన కండూతి తీర్చుకుంటున్నారు.

ఇది ఇలా ఉండగా, అంతభారీ ఎత్తున సర్వనాశనం చెయ్యలేకపోయినా, యథాశక్తిని బాధకలిగించగల ఆటంబాంబులు మన దేశంలో తయారవుతున్నాయి ఇవి దీపావళి రోజుల్లో మాత్రమే తయారవుతాయనుకోండి అయితేనేం అల్లరి పెటకంలో ఇవి చేటికీ తీసిపోవు గదితలుపులన్నీ వేసి, కిటికీలు మూసి ఎవరన్నా చిటిబాబులు రెండు బాంబులు ముట్టించారంటే, గది గదిగా మిగులుతుందా అనేది అనుమానమే పరిశోధనకోసమే పేల్చామని ఎంత బుకాయించినా ఆటంబాంబు తనపని తాను చేసుకుపోతుంది.

ఆటంబాంబులమీద అంతర్జాతీయ నిషేధం పెట్టాలని వాదిస్తూ, దేశంలోపల వాటిని అనుమతించడంలోగల వైరుధ్యాన్ని భారత ప్రభుత్వం గమనించింది. వాటిని అమ్మకూడదని నిషేధించింది. కాని తయారీ మీద నిషేధం లేకుండా అమ్మకం మీద నిషేధం పెడితే నిలుస్తుందా? తయారు చేసిన తర్వాత అమ్మకుండా ఊరుకుంటారా? దీపావళి వస్తోందంటే వీధుల్లో ఆటంబాంబులు పేలుతూనే ఉన్నాయి పరధ్యానంగా నడిచేవాళ్లు యథావిధిగా బజార్లలో బేజారెత్తిపోతూనే ఉన్నారు.

ఏమైనా, శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారి హితవాక్యాన్ని అమెరికా, రష్యాలు పెడచెవిపెట్టినా, భారత ప్రభుత్వంమాత్రం పాటించి ఆటంబాంబుల్ని నిషేధించినందుకు అభినందించాల్సిందే.

*   *   *

ఆంధ్రప్రదేశ్ ప్రారంభోత్సవమైన మర్నాడు దీపావళి దీపావళి మర్నాడు కార్తీక శుక్లపక్ష పాడ్యమి. ఆనాటినుంచీ ఆంధ్రుల నిర్మాణశక్తి శుక్లపక్ష చంద్రుడిలా దినదినాభివృద్ధి పొందుతుందని ఆశించుదాం.

"మూడుకోట్ల తెలుగు వార
 మొక్కరమై,
విశాలాంధ్ర మనకందరికీ
 ఉమ్మడి పొలమై,
హాలంపట్టి పొలం దున్ని
 ఆంధ్రత్వం పండిద్దాం!
ఇంటింటా ఆంధ్రత్వపు
 దీపావళి వెలిగిద్దాం."

—సవ్యసాచి.



# భక్త్యాగ్రణి రామదాసు

ఆంధ్ర దేశంలో జాతీయ భక్తి సంప్రదాయానికి దిండువంటి వారు కొందరున్నారు. పోతన, త్యాగరాజు, రామదాసు, మొదలయినవారు ఈకోవకు చెందినవారే.

రామదాసు భక్తి చాలా విశిష్టమైనది. అమాయకమైనది. ఈయన అక్కన్న మాదన్నల మేనల్లుడు. రామభక్తి గేసరుడు. ఆరు లక్షల ద్రవ్యం వెచ్చించి భద్రాద్రి శ్రీరామాలయం నిర్మింపజేసిన మహాభక్తుడు. ఈ ద్రవ్యం గోలకొండ నవాబు తానీషాకు చెందవలసి ఉండేది.

అందుచేత తానీషా రామదాసుపై కోపించి ఆయన్ని జైలులో పెట్టించాడు. అయినా రామదాసు భక్తి చలించలేదు. శ్రీరామ కీర్తనలు పాడుకుంటూ అతడు కారాగార దుఃఖం అంతా మరిచిపోయాడు.

ఇతని అసలు పేరు కంచెర్ల గోపన్న. కాని క్రమక్రమంగా 'రామదాసు' గా అది మారిపోయింది.

ఇతడు శ్రీరామునికి దేవాలయ నిర్మాణంతోనే సంతృప్తిపడలేదు. ప్రాకారాలు, గోపురాలు మొదలైన వెన్నెన్నో నిర్మింపజేశాడు. ఇంతేకాదు. సీతా అమ్మవారికి చింతాకుపతకము మొదలైన విలువైన నగలెన్నో చేయించాడు. అతని దృష్టిలో సీతారామచంద్రులంటే వట్టి శిలావిగ్రహాలు కాదు. కరుణాసముద్రులయిన సజీవ మూర్తులు!

'సీతమ్మకు చేయిస్తి
చింతాకు పతకము
రామచంద్రా!'

అనే రామదాసు కీర్తనలో అతను సీతారామచంద్రులకు తాను చేయించిన నగలు, పరిచర్యలు మొదలైనవన్నీ పేర్కొన్నారు.

## అమాయక భక్తి

రామదాసు భక్తిలో పామరజనసహజమైన అమాయక భక్తిభావం స్ఫురిస్తుంది. ఇతడు తన కీర్తనలలో రాముణ్ణి సంబోధించినప్పుడు వేదాంతిగా, వేత్తగా కనిపించడు. తన కష్టసుఖాలన్నీ ఎంతో ఆప్యాయంగా ఇంకొక స్నేహితునితో చెప్పుకుంటున్న సామాన్య మానవుడులా స్ఫురిస్తాడు.

"ఏ తీరుగ నను దయజూచెదవో ఇనవంశోత్తమ రామా! నా తరమా! భవసాగర మీదను నళినదళేక్షణ రామా!"

ఆంధ్రులు ఆదినుంచీ శ్రీరాముణ్ణే కులదైవతమని అంటారు. తెలుగువారిలో సీతారాముల పేరులున్నవారే ఎక్కువగా కనిపిస్తారు. శ్రీరామనవమి ఆంధ్రులకు చాలా ముఖ్యమైన పండగ.

కనకనే భద్రాద్రి రామదాస కీర్తనలు నేటికీ ఆబాలగోపాలము పాడుకుంటూ ఆనందిస్తున్నారు.

రామదాస కీర్తనలు తెలుగువారికి మేలుకొలుపులు. కర్ణాటక సంగీత పరిణతిలో ఈ కీర్తనలకొక ప్రత్యేకస్థానం ఏర్పడింది. రామదాస కీర్తనలలో సంగీతసాహిత్యాలు సమపాళ్లుగా సాగిపోతాయి. త్యాగరాజ కీర్తనలలో సాహిత్యానికి ప్రాధాన్యం ఉన్నా అది ఎక్కువగా సంగీతసాహిత్యంతోనే తన జీవం నిలుపుకుంటుంది.

రామదాసు కీర్తనలలో సాహిత్యానికే పైచేయి. సంగీతం ఈ కీర్తనలకుపాంగంగానే వినిపిస్తుంది.

తానీషా రామదాసును జైలులో పెట్టించినా చివరికతని భక్తికి మెచ్చి జైలులోనించి విడుదలచేశాడనీ, ఆనాటినించీ స్వయంగా శ్రీరామనవమి ఉత్సవాలకు కానుకలు పంపేవాడనీ చెబుతారు.

ఈ ఆచారం ఈనాటికీ అమలులో ఉంది. భద్రాద్రి దేవాలయం హైదరాబాదు ప్రాంతంలో లేకపోయినా హైదరాబాదు నిజాం ఆ దేవాలయానికి ఏటేటా 20 వేల రూపాయలిస్తున్నారు.

కంచర్ల గోపరాజు రచించిన దాశరథి శతకం నిన్న మొన్నటివరకు తెలుగు విద్యార్థులందరూ కంఠస్థం చేసేవారు. ఈనాటికీ మన ఇళ్లలో పెద్దలీపద్యాలెంతో భక్తితాత్పర్యాలతో చదువుతూంటారు.

"మసగొని రేపవలును మా కైకముల్ వెలవోసినట్లు దుర్వ్యసనము జెంది కావరము దురాత్ములకిచ్చితి మోసమయ్యె!"

అని ఈవిధంగా సాగిపోతుంది భక్త్యగ్రణి కవితా తరంగిణి.

భద్రాద్రి దేవాలయం ఇంతకుపూర్వం తెలంగాణాకు, ఆంధ్రకు ఎడిపోని స్నేహబంధంగా ఉండేది.

ఇకనించీ అది మహాంధ్రజాతి కంతటికీ హృదయభక్తి దీపకళికగా విలసిల్లగలదు ★



ఆంధ్రుల కులదైవం వెలసిన భద్రాచల దేవాలయం

ఆంధ్ర ప్రదేశ్‌లో

విజయవంతముగా నడుచున్నది






చిత్రప్రియా రిలీజ్

# వినోదిని

## ఏకాంకిక

### వేమూరి శర్మ

[ఈ కథఅంతా చరిత్రాత్మకం కాదు. అంతా కల్పనా కాదు]

## మొదటి రంగము

[స్థలం : పెద్దనగారియిల్లు.

కాలం : విజయ నగర సామ్రాజ్య వైభవ దశ... ప్రాతఃకాలం గోపన్న, రామలింగడు, కుమారసరస్వతి, వీరు ముగ్గురూ కూర్చుని మాట్లాడుతూ ఉంటారు మల్లన ప్రవేశం]

మల్లన : ఏమి నాభాగ్యం. రావల్సినవారు ముగురూ వచ్చారే

గో : అదేమిటయ్యా, అట్లా అంటున్నావు? మమ్మల్ని చూటంలో గల భాగ్యం ఏమిటి?

మ : అహా ఏంలేదు మీరుముగురూ ఒక చోటవున్నారు కాలక్షేపం బాగా జరుగుతుంది, అనుకుంటున్నాను.

కు స : మీరు అట్లా అనటంలో అర్థం ఏమిటి?

రామలింగడు : మరేంలేదు మిమ్మల్ని చూడంగానే ఆయనకు మిమ్మల్ని వాదంలో దింపబుద్ధయింది

మ : సర్లేవయ్యా నీ వ్యాఖ్యానం బాగానే వుంది, ఇంతకీ ఏవిషయంగురించి మాట్లాడుతున్నారూ?

గో : ఏమీలేదు పెద్దన గారికోసం చూస్తున్నాం ఇంతలో రామలింగడు ఒక సమస్య తీసుకొచ్చాడు. నిన్న జరిగిన సభలో తిమ్మనగారి కవిత్వం బాగుందా, చిన్నమ్మ నృత్యం బావుందా అని

కు స : ఈవిషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

మ : గొప్ప చిక్కే తెచ్చిపెట్టారే. నా ఉద్దేశ్యం వున్నదున్నట్లు చెప్పాలంటే దేనిగొప్ప దానికేఉంది. తిమ్మనగారికవిత్వం తిమ్మనగారి కవిత్వమే. చిన్నమ్మ నృత్యం చిన్నమ్మ నృత్యమే

కు. స : ఇదేనా మీరుచెప్పేది. కర్ర విరక్కుండా పాము చావకుండా చెప్పారే అదిసరేకాక నిన్న విందుసభలో పెద్దన గారు తిమ్మన్నగారి కవిత్వాన్ని పొగిడారే చిన్నమ్మ నృత్యం కంటె తిమ్మనగారి కవిత్వం ఎక్కువ శోభ తెచ్చిపెట్టలేదా నిన్న సభకు?

గో : కుమార సరస్వతిగారు తమ తెలుగు పాండిత్యాన్ని వెల్లడించుకోటానికి సామెత ఏదో ఉదహరించారే, ఇక్కడివిషయానికి ఆ సామెతకుగల సామ్యాన్ని వివరిస్తారా?

కు స : అసలిమిటి గోపన్నగారూ నేను చెప్పేదాంట్లో తప్పుపట్టుకోవటానికి అహర్నిశలూ ప్రయత్నం చేస్తారల్లే వుందే

రా. లేదు లేదు కుమార సరస్వతిగారూ ఎంత చెవులుమూసుకున్నా మీ యమూల్యమయిన ఉపమానాలు ఆయనచెవిలో దూరి ఆ గందరగోళం చేస్తున్నాయి

మ : పోనిద్దురు కుమారసరస్వతిగారూ వారి మాటలకేమిటి అయితే మీ ఉద్దేశ్యం చిన్నమ్మ నాట్యంకంటె తిమ్మనగారి కవిత్వమే ఎక్కువ శోభతెచ్చిపెటిందని అంటున్నారు అంతేనా

కు స : అవును

మ : అయితే "నాట్య సంగీతాదులకంటె కవిత్వం ఉత్కృష్టమయిందనా" మీరు చెప్పేది

కు. స. అట్లాఅని నేను చెప్పలేదు.

రా : అయితే "నాట్యసంగీతాదులకంటె కవిత్వం ఉత్కృష్టంకాదని వాదిస్తారా మీరు?

కు. స : ఎక్కడకి ఎప్పుడు?

గో : ఎక్కడో, ఎప్పుడో, ఎందుకు? ఇప్పుడు మాట్లాడండి. మీ వాదాన్ని నేను ఖండిస్తాను.

కు స : ఇంతకూ నన్ను, గోపన్నగారిని వాదనకి దింపుతున్నారన్నమాట. సరే. ఇంతకూ మరి మధ్యవర్తి యెవరు?

(పెద్దనగారు ప్రవేశం)

పె: ఏమిటోయి మధ్యవర్తిత్వమంటున్నారు.

గో : ఏమీ లేదండి. మన కుమార సరస్వతి నాట్య సంగీతాదులకంటె కవిత్వమే మాత్రం గొప్పదికాదని వాదిస్తారట. నేనేమో దాన్ని ఖండిస్తాను మధ్యవర్తి ఎవరూ అని ప్రశ్న వచ్చింది. ఇంతలో మీరు వచ్చి ఆ చిక్కు తీర్చారు

పె. ఏమోయ్ రామలింగా, ఇవాళ పొద్దునే దర్శనమిచ్చావు ఏమిటి విశేషం!

రా. విశేషాని కేముందండి. తిమ్మన గారు మీ యింట్లో బసచేశారని విని వారి పరిచయభాగ్యం కోసమండి

పె ఓహో సరే కుమారసరస్వతి గారూ! ఏమీ యీ పూట మీతో తిర్యప్రకాశుడు గాలేదేం?

కు స : ఏవో గృహ కృత్యాలున్నయ్యని ఆగిపోయారండి

పె తిమ్మనగారి అనుష్ఠానం పూర్తి కాలేదు కాబోలు వారింకా రాలేదు పూజామందిరం లోంచి

మ : ఇక వాదన మొదలు పెట్టటానికి అభ్యంతర మేమిటి?

# ★ చిన్నాదేవి ★

రా: విషయాన్ని ఒకసారి ఆలోచించుకోవద్దూ

గో: అయితే యివాళ ప్రాచీన కావ్య కళానానికి స్వస్తి చెప్పినట్లేనా.

పె: దానికేమిలే ప్రతి దినం ఉండేదేగా. మంచి విషయాన్ని ప్రస్తావనకు తెచ్చారు. కానీయండి

కు స: మానవునికి రసానుభూతిని యిచ్చేది కళ. అటువంటివి అరవై నాలుగని పెద్దలు చెపుతున్నారు. మళ్ళా వీటిల్లో లలితకళలని కొన్నిటిని ప్రత్యేకించారు. నాట్య సంగీతాదులు, కవిత్వం ఆ కోవకు చెందినవి.

మ: ఒక చిన్న సందేహం మీరు చెప్పిన అరవై నాలుగు మానవుడికి రసానుభూతిని కలిగిస్తాయా.

కు. స: కలిగించే శక్తి ఉండ బట్టే గా వాటిని కళలన్నారు.

రా: అయితే అవి ఆ జాబితాలో వున్నయ్యి కాబట్టి అవి రసానుభూతిని యిస్తాయనుకోవాలా?

కు. స: మీరు వాదనను పెడదారి పట్టించాలని చూస్తున్నారు

గో: సరే అయితే కానీయండి.

కు. స: లలితకళలు అని వీటిని ప్రత్యేకించడంలో అవి మానవునికి మిగతా వాటికంటె ఎక్కువ రసానుభూతి యివ్వగలగడమే కారణం ఇవి మానవునికి రసానుభూతి కలిగించటమే కాక అతనికి విజ్ఞానం కూడా యిస్తున్నాయి

గో: అంటే మిగిలిన కళలు ఎటువంటి విజ్ఞానం యివ్వవని మీ భావమా?

కు స: అట్లా అని నేననలేదు,-ఇప్పుడు నేను చెప్పే విషయం నాట్య సంగీతాదులకంటె కవిత్వం ఉత్కృష్టమైనదని చెప్ప దగదని ఇంకా ఒక దృక్పథంలో చూస్తే కవిత్వంకంటె నాట్య సంగీతాదులు మానవునికి ఎక్కువ రసానుభూతిని కలుగ చేస్తాయి

మానవునికి ఎటువంటి ప్రాథమిక జ్ఞానము లేకపోయినా అతడు నాట్యసంగీతాదుల యొక్క రసానందమును పొందగలడు కళ్లూ చెవులు వున్న ప్రతివాడు నాట్యసంగీతాదులను అనుభవించగలడు. ఆఖరికి శిశువుల్లు సర్పములు, జంతువులు కూడ గానము విని ఆనందించగలవు పూర్వం శ్రీకృష్ణుల వారి యొక్క మురళీగాన మహిమ మనకందరికీ తెలిసిందే. అదిన్నీ కాక శిశుర్వేత్తి పశుర్వేత్తి అని చెప్పబడినది కదా, గానము విషయంలో.

రా అవునవును గానము నిజముగా శిశుర్వేత్తి పశుర్వేత్తి మాత్రమే

కు. స: అదిగో మీరు అప్పుడే గూఢార్థముగా మాట్లాడుతున్నారు

మ: మీకు గూఢార్థాలు తొందరగా తెలుస్తాయే

గో: అవును, అదిన్నీ కాక ఆయన మాట్లాడిన దాంట్లో గూఢార్థ మేముందండి. శిశుర్వేత్తి పశుర్వేత్తి అని మీరు చెప్పినదే కదా.

రా: ఇదిఅంతా మన కుమారసరస్వతి గారు తమిళంలో ఊహించుకొని తెలుగులో మాట్లాడినందువల్ల వచ్చిన చిక్కు.

పె: మీరంతా కలసి ఆయన్నికంగారు పెడుతున్నారు మీకెందుకు మీరు కానీయండి కుమార సరస్వతిగారూ

కు. స: సంగీతం మానవుని కష్టాల్ని మరిపిస్తుంది. అప్పుడు అతడు మామూలు జీవితాను భూతుల్ని మర్చిపోయి సంగీతంలో లీనమవుతాడు. అది అతనికి అనిర్వచనీయమైన అనుభూతిని కలుగచేస్తుంది

అలాగే నాట్యకర్తె లేక నాట్యకాడు తన అభినయం చేత, భంగిమలతో వివిధభావాల్ని వ్యక్తీకరించి తద్వారా ప్రేక్షకునికి రసానుభూతిని కలుగచేస్తారు.





కృష్ణదేవరాయలు, చిన్నాదేవి, తిరుమలదేవి (తిరుపతిలో ప్రతిమలు)

కవిత్వం అర్థంచేసుకోటానికి కొంత ప్రాథమికజ్ఞానం కావాలి నాట్య సంగీతాలను అనుభవించటానికి అటువంటిది లేకపోయినా ఫరవాలేదు ఒక దేశంయొక్క ప్రజలయొక్క సంస్కృతిని పరిశీలించటంలో ఆ కాలంలో నాట్యసంగీతాగులు ఎట్లావున్నవి అని చూస్తారు కాబట్టి మన ప్రభువు వారు నాట్య సంగీతాదులను కూడ ఆదరిస్తున్నారు పై విషయాన్ని బట్టి నాట్య సంగీతాదులకంటె కవిత్వం ఏమాత్రం గొప్పదని చెప్పటంకూడదని చెప్తున్నారు

పె కుమారసరస్వతిగారూ మీ వాదం పూర్తయింది కదా (తిమ్మనగారి ప్రవేశం) దండీ కూర్చోండి తిమ్మన్నగారు మీ పరిచయ భాగ్యంకోసం నా తోటి ఆస్థానకవి తెనాలిరామలింగకవిగారు వచ్చారు

తి (రామలింగని వంక తిరిగి) నా పరిచయమా నా పరిచయంకోసం వచ్చారా రామలింగకవిగారూ సంతోషం ఏదో చర్చలో మునిగిపోయారంలేవున్నది

పె ఏమీలేదు మామూలుగా రోజూ ఉండేదే ఇవాళ సంగీతసాహిత్యాల మీదకు పోయింది కానీ యండిగోపన్నగారూ కావ్యకృథం ఎట్లావున్నదో

గో కుమారసరస్వతిగారే కవిత్వం రసానందాన్ని యివ్వగలదని ఒప్పుకున్నారు కాబట్టి ఆ ప్రసక్తే లేదు, పోతే రసానుభూతి నికలుగచేయటంలో ఏది ఎక్కువశక్తికలది అన్నది ప్రస్తుత విషయం కవిత్వముయొక్క రసానుభూతి ఆమోదించబడింది కాబట్టి రసాస్వాదన జరిగినా జరుగకపోయినా దాని రసానందం ఎక్కడికీ పోదు

రెండవవిషయం నాట్య సంగీతాగులు యిచ్చే రసానందం కవిత్వంయిచ్చే రసానందం వీటిల్లో దేనిని సామాన్య మానవులు ఎక్కువమంది అనుభవింప గలుగుతున్నారో అని

దానికి కుమారసరస్వతిగారు సూచించిన అభ్యంతరం మీకు తెలుసు దానికి నా జవాబు

సర్వసామాన్యంగా శబ్దస్వరూపం దాని విశేషార్థము తెలియకపోయినా శబ్దము యొక్క సామాన్యార్థము తెలియనివాడు వుండడుగదా అట్టి వాళ్ళందరూ కవిత్వం యిచ్చే రసానందాన్ని అనుభవించగలరు చదువురానివారి సంగతి వారు చదువుకో లేకపోయినా యితరులు చెపుతుంటే విని అర్థం చేసుకోగలరు కదా కాబట్టి ప్రతివాడూ కవిత్వంయొక్క రసానందాన్ని అనుభవించగలడు

ఒకకవి బ్రతికివుండగా అతని కావ్యం అంతగా ప్రచారంలోనికి రాకపోవచ్చు కాని కవితోపాటు కావ్యంకూడా పోవటం లేదుకదా! కవియొక్క స్మృతి అతని కావ్యంవలన ఆచంద్రార్కంగా ఉంటున్నాయి అటువంటి అనంతమైన కాలంలో ఆ కావ్యాన్ని చదువబోయే వారి సంఖ్య చూచుకుంటే కుమారసరస్వతిగారు చెప్పే రసానందం పొందేవారిసంఖ్యకంటె గొప్పది

కు స ఎప్పుడో చదివేవారి సంఖ్య ఎందుకు అతని కాలంలో ఎంతమంది చదివి రసానందాన్ని పొందుతున్నారు అనేది

మ ఆ [illegible] మీరు అరంలేకుండా ఖండిస్తారు ఇదేమన్నా సంగీతం నాట్యం లాంటిదా అవంటే ఆ నాట్యంతో లేక ఆ గాయకుడో పాడినంతసేపే, ఆడినంతసేపే, తరవాత ఏమున్నది?

కు స అలాగయితే కావ్యాలు అన్నీ ఆచంద్రార్కం ఉంటున్నాయా యేమిటి

గో అది కవియొక్క ప్రతిభమీద ఆధారపడివుంటుంది ఆ లెక్కన ఒక అసమర్థుడయిన గాయకుడు గానంచేస్తుంటే ఆ సభలోమాత్రం ఎంతమంది ఉండగలరు పూర్తయేవరకు

తిమ్మన్న నిన్ను చూస్తుంటే నా చిన్నతనపు రోజులు గుర్తొస్తున్నాయి నేను యిలాగే వాదించేవాణ్ణి

గో మీరలాగ అంటున్నారు కాని మీకు నాతో పోలికఏమిటి లెండి

తి నాయనా! వాదాన్ని చక్కగా నడుపుకొచ్చావు నీ ప్రతిమాటలో నూనా భావం తొంగిచూస్తున్నట్లనిపిస్తోంది




## నాకు మంచి భవిష్యత్తు వుంది

"నాకున్న కొద్ది మొత్తపు ప్రావిడెంట్ ఫండుతో నేను కొద్ది కాలములో సుఖంగా రిటైరు కాబోతున్నాను ఎందుచేతననగా నా జీవిత భీమా వచ్చే సంవత్సరము పరిపక్వము కాబోవుచున్నది నా పాలసీ మూలముగా వచ్చే ధనము నా ముసలితనములో భద్రత నిచ్చును యిది ఏ కొద్ది మందో రిటైరయే కాలంలో ఆనించుతారు

"యిప్పటికి యింకా నాకు జ్ఞాపకముంది, కొన్ని సంవత్సరాల క్రింతము ఒక శ్రీ...న, ఒక అపరిచిత యిన్స్యూరెన్సు ఏజంటు నా దగ్గిరకు రావటం, ఆ యిన్స్యూరెన్సు ఏజంటు, నా రిటైరయి సమయానికి పరిపక్వముయే ఒక ఎండోమెంట్ పాలసీని తీసికోమని సల యివ్వడమూను మొదట సందేహించాను ఎందుచేతననగా, ప్రీమియము దనుము సకాలంలో సరిగా కట్ట లేనేమోనని కాని సంవత్సరాలు గడచినకొద్ది, నే అనుకొన్నదాని కంటే, భీమా ప్రీమియములు కట్టుటకు వీలుగా అందుబాటులో వుంటున్నాయని తెలుసుకొన్నాను

"నేను భీమాను నమ్ముచున్నాను"

లైఫ్ ఇన్స్యూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

సెంట్రల్ ఆఫీసు ఓరియంటల్ బిల్డింగ్స్, ఫోర్ట్ బొంబాయి 1



Life Insurance Corporation of India

ప్రాంతీయ ఆఫీసులు

బొంబాయి న్యూ యిండియా అస్యూరెన్సు బిల్డింగు, మహాత్మా గాంధీ రోడ్డు, బొంబాయి 1
కలకత్తా హిందుస్థాన్ బిల్డింగ్సు, 4 చిత్తరంజను అవెన్యూ, కలకత్తా-13
ఢిల్లీ లక్ష్మి బిల్డింగ్ అసఫాలీ రోడ్డు న్యూ ఢిల్లీ
మద్రాసు యునయిటెడ్ యిండియా లైఫ్ బిల్డింగ్ పోస్టు బాక్సు నం 281, మద్రాసు.
కాన్పూరు: నవరోజ్ బిల్డింగ్, మహాత్మా గాంధీ రోడ్డు కాన్పూరు

# ★ చిన్నాదేవి ★

మ: గోపన్నా నీ సమాధానం సమంజసంగా వుంది

కు. స: "ప్రతో నామ ఉత్తమం ప్రతం" అని యింతకు మీరు చెప్పేది నాట్య సంగీతాదులు కవిత్వమునకంటె తక్కువని చెపుతున్నారు అంతేకదా.

రా: అదేమిటి కుమార సరస్వతిగారు మీరు వాటిని కుత్తకు పుచ్చుకొన్నారా ఏమిటి? "నా" అంటున్నారు

మ. అసలు యిక్కడ ఆయన ప్రయోగించిన ఉపమానం యొక్క అర్థం బోధపడటం లేదు. మరి వారేమన్నా తమిళంలో ఊహించి సంస్కృతంలో చెపుతున్నారేమో

కు. స: మీరు తమిళము మీదకు జోరుగా వస్తున్నారే.

పె. కుమారసరస్వతిగారు, ఎందుకట్లా అనవసరంగా ఆవేశపడతారు - గోపన్న చెప్పినట్లు కవిత్వానికి సంగీత నాట్యాదులకంటె శాశ్వతత్వం ఉన్నది అయినప్పటికి ఒకటి తక్కువ ఒకటి ఎక్కువ అని చెప్పటానికి వీల్లేదు దేని ఉత్కృష్టత దానికే వుంది అన్నడిగితే అట్లా వాటిని పోల్చడమే తప్పంటాను.

మల్లన: అయితే యీ ప్రశ్నకు సమాధానం చెప్పండి నిన్న జరిగిన సభకు తిమ్మనగారి ఆశుకవిత్వ మెక్కువ అలంకారమును తెచ్చి పెట్టిందా లేక చిన్నమ్మ నృత్యమా?

పె. అసలు ఈ ప్రశ్న దేనికి వచ్చినది?

మ: దీని మీద నేకదా యిప్పుడు నడిచిన కథంతా.

పె: తిమ్మనగారూ చూచారా మీ కవిత్వం ఎంత మీమాంస రేపిందో? కవిత్వమూ, నాట్యమూ రెండున్నూ మానవునికి రసానుభూతిని యిచ్చేవే రెండున్నూ లలిత కళల జాతికి చెందినవే అయినప్పటికీ దేని ప్రత్యేకత దానికివుంది కాబట్టి యిది ఎక్కువ ఇది తక్కువ అని చెప్పకూడదని నా అభిప్రాయం

మ: (ఆశ్చర్యంతో) అదిగో చిన్నమ్మ పల్లకీ లోంచి దిగుతోంది.

(చిన్నమ్మ ప్రవేశం. అందరికి నమస్కరిస్తుంది)

పె: ఏమమ్మా యిట్లా వచ్చావు రా. ఆ కంబళంమీద కూర్చో. ఏమిటి విశేషాలు ఎప్పుడు వచ్చావు వూరికి.

చి: నే నిక్కడకు విజయదశమి ఉత్సవాలను చూట్టానికి వచ్చానండి

రా: ఇక్కడకా! ఇక్కడ విజయదశమి ఉత్సవాలంటే వే.

పె: (వాని మాటలకేమిటే అన్నట్లు రామలింగని చూచి చిన్నమ్మను చెప్పమన్నట్లుగా చూస్తాడు)

చి, నేను మిమ్మల్ని చూడకమునుపే మిమ్మల్ని గురించి విన్నానండి. అదీ కాక మొన్న సభలో మీ దర్శనభాగ్యం కలిగింది. నేను తిరిగి మా స్వగృహానికి వెడుతున్నాను. వెళ్ళే ముందు ఒక్కసారి మీ దర్శనం చేసుకొందామని.

పె: అయితే యింతకూ మీ దేవూరు

చి: మాది కొండవీడండి అక్కడ నా తల్లితో ఉంటున్నాను. నేను చిన్నప్పుడే భరత నాట్యం నేర్చుకొన్నాను. దాంతో పాటు సంస్కృతంలో పంచకావ్యాలు చదువుకొన్నాను. తెలుగులో కూడ కొంచం కృషి చేశానండి దానిమూలాన్నే సాహిత్యం మీద అభిలాష కలిగింది. అందుచేత మీబోటి పెద్దలను దర్శించుకొందామని యిటు వచ్చానండి

పె: అయితే తల్లీ సంతోషం నీవు కొండవీటి మహారాజావారి ఆస్థానంలో ఉంటున్నావా?

చి: లేదండి మేము దేవదాసీలం. నేను కొండవీటిలో వేణుగోపాలస్వామి ఆలయ ఉత్సవాల్లో నృత్యం చేస్తానండి అదికాక మేము మా కులకట్టుబాట్లను వదిలేసుకొన్నాము. మా జీవితానికి సరిపోయే ఆదాయం కూడ వస్తున్నది. అందుచేత నేను యింతవరకు యీ లలితకళల్లో అభ్యాసం చేయటం ఆలయంలో నృత్యం చేయటం తప్ప-

పె: ఒహో, అదా సంగతి.

చిన్నమ్మ చెలికత్తె. అదిన్నీ గాక మా పెద్దమ్మగారికి కలలో తిరువేంగళ నాథుడు కనపడి "నీ పుత్రిక ఒక పెద్దసామ్రాట్టునకు దేవేరి కాగలదు" అని చెప్పాడట. అందుచేత, మా చిన్నమ్మ నాట్యకౌశలాన్ని చూచి పెద్దపెద్ద దళవాయిలు వారూ వివాహాది శుభకార్యాలలో ఆహ్వానించినా మా పెద్దమ్మగారు వెళ్ళనీయదు.

రా: పెద్ద ఆశేవున్న దన్నమాట.

పె: రామలింగా దీనిలో ఆశేమున్న దయ్యా ఉన్నమాటను చెప్పింది అంతేకద.

చి: దయ యుంచండి మాకు సెలవిప్పించండి. కాలాంతరాన ఎప్పుడైనా మళ్ళీ దర్శన భాగ్యం ఉంటే కలుసుకొంటాను.

పె: మంచిది అలాగే తల్లీ. (నిష్క్రమణ)

తి: ఈ పిల్ల మొహాన లక్ష్మీకళ వుంది, ఏమంటారు పెద్దనగారూ.

పె. ఏమో ఎవరి అదృష్టం యెవరు చెపుతారు అదుగో వైష్ణవ స్వాములు కూడా వస్తున్నారు. మీరు వలుగురూ యీ పూట భోజనానికి యిక్కడే వుండండి.

రా: అలాగేనండి

## రెండవ రంగము

[కాలం. మొదటి రంగం జరిగిన ఒక నెల రోజుల తిరువాత స్థలం:—కొండ



దాక్షారామ భీమేశ్వరాలయం.
త్రిలింగక్షేత్రాలలో ఇది ఒకటి.

# చెమట దుర్గంధమునకు, సామాన్య చర్మ వ్యాధులకు
## వైజ్ఞానికంగా సరి క్రొత్తగా కనిపెట్టబడినది

# ఎక్టమర్

### ఇప్పుడు భారతదేశమందు, సౌందర్యమునిచ్చు సబ్బుల్లో నున్నది

చర్మ క్రిములను చంపునట్టి ఔషధములు, మంచివి చెడ్డవి చాలా కాలమునుండియు తెలిసియున్నవే క్రొత్తదేమిటనగా, చాలా కాలము నిలవుండునట్టి గుణము గలది అట్టి కనిపెట్టబడినది, మాన్‌సెన్‌టొవారి 'ఎక్టమర్' (బైత్యొనాల్) ఈనాడు, మీరు భారతదేశమందు 'ఎక్టమర్'తోగూడిన టాయ్‌లెట్ సబ్బును కొనగలరు అది బ్రీజ్; ఆలోచించండి — మీరు ప్రతి రోజూ ఉపయోగించుచూ బ్రీజ్‌ను 3 బిళ్లలవరకూ మాత్రమే వాడిన తరువాత మీ చర్మము దాదాపుగా క్రిమిరహితమైన దగును మీరు క్రిమిరహితమైన చర్మమువల్ల ఏమి లాభమును పొందెదరో దిగువ వివరింపబడినది.

* చెమట దుర్గంధము తొలగింపబడును — చర్మ క్రిములు దానిని కలిగించును
* చర్మ వ్యాధులనుండి రక్షణ — ఈ క్రిములు సామాన్యమైనట్టి అనేక చర్మ వ్యాధులను గలిగించును

మీరు బ్రీజ్‌ను ఇష్టపడెదరు — దీని విషయంలో కొంత ఎక్కువ ప్రత్యేకత గలదు ఇది పరిమళమైనట్టి, శమనకరమైన సౌందర్యమునిచ్చు సబ్బు ఇది చర్మమును కాపాడునట్టి 'ఎక్టమర్'ను గలిగియున్నది బ్రీజ్ ఇతర సబ్బులకంటె కొంచెమే ఎక్కువ ఖరీదుండును మీరు దీనిని చాలా కాలము వరకూ ఉపయోగించుకొనవచ్చును

నేడే బ్రీజ్‌ను కొనుడు




## బ్రీజ్
టాయ్‌లెట్ సబ్బు

'ఎక్టమర్'ను గలిగియున్నది

ఇరాస్మిక్ కంపెనీ లిమిటెడ్, లండన్, వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది

BZ. 4 X52 TL

# చిన్నాదేవి



శ్రీ శైల దేవాలయం

(త్రిలింగ క్షేత్రాలలో ఇది మరొక క్షేత్రం)

పేటిలో చిన్నమ్మయిల్లు. చినమ్మా ఆమె, తల్లి, చిన్నమ్మ స్నేహితురాండ్రు కూర్చుని యిష్టాగోష్టి మాట్లాడుకొంటూ వుంటారు.]

చిన్నమ్మ తల్లి : అమ్మడూ ఇన్నాళ్ళ నుటీ ఆ విజయనగరంకబుర్లు చెపుతానని కాలం గడుపుతున్నావు ఇవాళన్నా చెపుతావా మరి.

చిన్నమ్మ : దానికేమి లేవే మన చతురిక లేదూ. అది పెద్ద మహారాణివారి ముఖ్య సఖుల్లో ఒకతె దాని పని యెంత ఘనంగావుందని రాజ భవనంలో దాని మాటకి, నోటికి అడ్డేలేదు

చిన్నమ్మ స్నేహితురాలు (చెలికత్తె) : దానికేమిలేే. అది మహారాణీవారి యిష్ట సఖి అవుతే నువ్వు మహారాజా వారి యిష్టసఖివైనావు

చిన్నమ్మ తల్లి : అదేమిటే అమ్మా చెప్పావు కాదూ. సిగ్గెందుకే చిట్టి తల్లీ. చెప్పమ్మా ఒసేయ్ మీ రందరూ కాసేపు అవతలకు వెళ్ళండి అమ్మడికి సిగ్గుగా వుంది

(చిన్నమ్మ చెలికత్తెలు యిద్దరు మాత్రం వుండి మిగతా వాళ్ళందరూ వెళతారు.)

సరే యిహ యిప్పుడు చెప్పమ్మా

చి చె : అది సిగ్గుపడుతున్నట్లున్నది. మన్ను చెప్పమంటారా పెద్దమ్మ గారూ

చి త సరే నువ్వన్నా చెప్పు

చి చె ఒక రోజున ఏమయిందంటే మేము వెళ్ళిన నాలుగోరోజు అనుకుంటాను చతురికతో పాటు ఆ నాడు సాయంకాలం మేము కూడా రాజభవనానికివెళ్లాము రాజభవనం అంతా చూసి ఉద్యానవనం లోకి పోయాము. మాతోపాటు చతురి కావాళ్లు కూడా కాసేపు తిరిగారు ఇంతలో చతురిక నాకు పనుంది మీ రిద్దరూ మీ యిష్టమొచ్చినంత సేపు వుండి రండి అని వెళ్ళి పోయింది అప్పుడు ఏమయిందీ.

(చిన్నమ్మ చెప్పవద్దన్నట్లుగా సైగ చేస్తుంది)

చి. త . ఆసి నీయిల్లుబంగారంగాను నువ్వు చెప్పకపోయి పైగా చెప్పేవాళ్ళను కూడా చెప్పవద్దంటావేం

చి. చె : మేము యిట్లా ఉద్యానవనం అంతా తిరిగి తిరిగి యధాలాపంగా రాజదంపతుల ప్రత్యేక ఉద్యానవనంలోకి కూడా ప్రవేశించాం ఇసంతా తెలియక పోవటం వల్లనే పెద్దమ్మ గారూ మేం తోంట్లోకి వెళ్ళి అవీయివీ చూస్తున్నాం. ఇంతలో ఆజాను బాహువు, మొగంలో రాజసీవి నిండినవాడు అందగాడు అయిన ఒక పురుషుడు వస్తున్నాడు అసలా ఉద్యానవనం లోకి రాజభవనం వారి తాలూకు వారు కాని రాకూడదు అందులో అటు వంటిపురుషుడు రావటం చూచేసరికి నా పై ప్రాణాలు పైనే ఎగిరి పోయాయి

చి త . అప్పుడు ఏం చేశారు మరి.

చి చె : అసలు ఆయన్ని మన చిన్నమ్మ చూడలేదు ఒక గులాబి చెట్టు దగ్గరకు వెళ్ళి పువ్వు కోసుకుంటోంది ఇంతలో ఆయన దగ్గరకు వచ్చేశారు. నా కేటూ కాళ్ళాడక ఒక పొదమాటున దాక్కున్నాను.

చి త : ఆసి నీ ధైర్యం యిదయిపోను. ఎవరన్నా చూస్తే ఏం చేసే దానివే.

చి చె : చూడవల్సిన వాళ్ళే చూశారు యింకేమిటి

చి త : సరే నువ్వెళ్ళి పొదమాటున దాక్కున్నావు అమ్మడిని అట్లా వదిలేసి అప్పుడు ఏమయింది?

చి చె : ఏమయిందీ. ఆయన వొచ్చి యీవిణ్ణి చూశారు. ఓహో యిహ ఏమిటి దానికి నే నే మన్నా గుర్తున్నానా వస్నేమో ఆ పొదలో గండు చీమలు పీకి చంపుతున్నాయి ఆ సంభాషణ ఆ కబుర్లు యిహ వాటికి అంతే లేదూ

చి త : ఏమిటీ నా బంగారు తల్లి ఎంత ధైర్యమే మొత్తానికి ఆయన్ని నువ్వు కబుర్లలోకి దింపావా లేక, ఆయనే నిన్ను కబుర్లలోకి దింపాడా.

చి. చె : ఏమిటమ్మా నువ్వు మరీనూ.

చి త : పోనీ నువ్వన్నా చెప్పవే.

చి చె నాకు వాళ్ళ సంభాషణ వినపడలేదు పెదమ్మగారూ ఇహ అదంతా మీరు ఆమె దగ్గర్నుంచి తెలుసుకో వాల్సిందే

చి త - అమ్మలూ తరవాత ఏంజరిగిందీ. ఆయన నిన్ను మాట్లాడించాడా

చి - అబ్బ ఏమిటే.

చి త :- పోనీలేవే ఆ మాత్రం నే వినదగ్గదాన్ని కాగులే

చి చె.- పోనీ మీసంభాషణ సారాంశం చెప్పు వింటాము.

చి - ఏం నువ్వు చెప్పరాదూ. ఆమాత్రం వినలేదులే.

చి త.- అబ్బ అదిచెప్పింది నువ్వు చెప్పిందీ ఒకటవుతుందిలే

చి ఏంలేదే మొట్టమొదటేమో నా పేరు, నాఊరు అన్నీ కనుక్కున్నారూ...

చి త: మరి నువ్వక్కడికెందుకొచ్చావని అడగలా.

చి: అహ అదికాదు. అట్లా అడగలా. ఇక్కడ రాజభవనంలో మీవాళ్లెవరన్నా వున్నారా అని అడిగారు అవును, మా స్నేహితురాలు ఫలానా ఆవిణ్ణి చూదామని, యిక్కడ విజయదశిమి ఉత్సవాలను చూద్దామని వచ్చాను రాజభవనం చూదామనివచ్చి యిట్లా వచ్చాను, అని చెప్పాను.




సంతోషమైన శలవల సంఘటనలు జ్ఞాపకం ఉండడానికి మీతోకూడా కొన్ని అగ్ఫా ఐసోపాన్-ఎఫ్ ఫిలిం రోల్సు తీసుకపొండి ప్రపంచ ఖ్యాతిగాంచిన ఈ ఫొటోఫిలిం, మీ బొమ్మలకు ఒక విశిష్టత గూర్చును.... ఏ సైజుది అయినా మంచి ఎన్లార్జిమెంట్లు తీసుకోవచ్చును.




ఉత్తమమైన ఫొటోగ్రఫీకి ఫాస్ట్, ఫైన్ గ్రెయిన్ పాంక్రోమటిక్ ఫిలిం.

ఉచితము: "అగ్ఫా ఫొటోగ్యాలరి" చదివి మీ ఫొటోగ్రఫి పెంపొందించుకోండి. అది సచిత్రమైన సంచిక. ఏ అగ్ఫా డీలరు నుంచి అయినా ఉచితంగా పొందవచ్చును.

**అగ్ఫా ఇండియా ప్రైవేట్ లిమిటెడ్.**

బొంబాయి - న్యూఢిల్లీ - కలకత్తా - మద్రాసు

AGFA 56:25 TL


# చిన్నాదేవి

చి త: అందుకాయన ఏమన్నారూ?

చి: ఏమన్నారంటే "యిది రాజోద్యానవనం దీన్లోకి రాజుగారు రాణీగారుమాత్రమే రావాలి మరి నువ్వేమో అసంగతి తెలియక వచ్చావంటున్నావు అయినప్పటికినీ నీకు శిక్ష తప్పదు," అన్నారు కోపంతో.

చి త: కోపంతోనా? (ఆతురతతో) నీకు ఏమిశిక్ష విధించారు?

చి చె. అప్పుడు నీకు భయం వేయలేదటే

చి: భయం వెయ్యక పోవటమేమిటి. అయితే నేను భయచిహ్నాలు ఏమీ కనపడనీయ లేదు లోలోపల జంకుగావున్నా. అయితే అట్లాగే ప్రమాదపడిపోయి నుంచున్నాను.

చి చె. సరే యింతకూ ఏమిశిక్ష

చి: మర్నాడు దర్బారులో నాట్యం చెయ్యమన్నారు ఆ మొదట మాట్లాడిన కంఠస్వరంతోనే

చి త అమ్మ నా చిట్టితల్లి అయితే యింతకూ నువ్వు నాట్యం చెయ్యగలవని ఆయనకెట్లా తెలుసునే

చి: నన్ను గురించి అమూ కీ అంతా మొట్ట మొదటే తెలుసుకున్నారు కాదటే

(బయటనుంచి వచ్చిన పరిచారిక "అమ్మా మీకోసం ఎవరో వచ్చారు" అని చెప్పుతుంది)

చి అమ్మా ఆయన రోవరో కనుక్కొని యిక్కడకే తీసుకొని రారాదూ?

చి త అట్లాగేతల్లీ (మరికొంతసేపటకి నాదెండ్ల యల్లన్నను వెంటపెట్టుకువస్తుంది)

చి: నమస్కారం ఈ ఆసనం స్వీకరించండి

మల్లన: చిరాయుష్మాన్భవ నీవేకదూ చిన్నమ్మవు, నన్నెక్కడయినా చూచిన గుర్తున్నదా

చి: (కొంసేపుఆలోచించి) విజయనగరము పెద్దనగారింట్లో చూచినట్లుగుర్తు

మల్లన: అవునవును నీతో నేనుఅతిపహాస్యమయిన రాజకార్యముమీద వచ్చాను (చెలికత్తెలను పంపించమన్నట్లుగా సౌంజ్ఞ చేస్తాడు. చిన్నమ్మ వాళ్లను పంపివేస్తుంది)

చి: మీరు యిప్పుడు విజయనగరము నుంచేకదా రావటం? పెద్దనగారు క్షేమంగా ఉన్నారా?

మల్లన: ఆ క్షేమంగానే వున్నారు వారు నీకు యీ పత్రికను కూడా పంపారు. (ఇస్తాడు)

(71 వ పేజీ చూడండి)

# బాల సాహితి

## స్వర్ణయుగము



ఉత్పల
సత్యనారాయణాచార్య

ఆంధ్రజాతి కేడుగడయు
ఆంధ్రభోజు డనగ బరగు
కృష్ణరాయ లొక్కనాడు
శ్రీకాకుళ మరుగుదెంచె

ఆంధ్రవిష్ణు పాదములకు
అభిషేకం బొనరించుచు
అచట పాఱు కృష్ణానది
అది నిజముగ విష్ణుపది!

శ్రీకాకుళ స్వామి గుడిని
ఏకాదశినాడు రాజు
పుణ్యకథా గోష్ఠినుండి
ప్రొద్దుపుచ్చుచుండు నపుడు;

"ఘను లెవ్వరు పాండవులా?
కౌసల్యానందనుడా?
చెప్పు" డంచు రాయ లడిగె
చెంతనున్న కవుల జూచి.

కవులందరు నొక్కసారి
కౌసల్యానందనుడే
శ్రీరాముడె గొప్పయంచు
చెప్పినారు తడవుకొనక.

సభయంతయు రామనామ
జపరవమున మాఱుమ్రోసె
అంత రాయ లిట్లు తనదు
అభిప్రాయ మెఱిగించెను.

"నారాయణు నంశమ్మున
శ్రీరాముం డవతరించె
ఆకతమున నత డట్టులు
లోకోత్తరచరితుడయ్యె.

భగవదంశసంభూతులు
పాండుసుతులు కారుగదా!
ధర్మరాజు కన్న నతని
తమ్ములెల్ల రధికబలులు

ఐనప్పటికా ఏవురు
ఐకమత్యమున మెలంగి
రామునితో సాటివచ్చు
సామర్థ్యము గడియించిరి.

ఎంచిచూడ పాండవులే
ఎక్కువైన వారలుగద"
అని రాయలు సభవారికి
తన యాశయ మెఱిగించెను

ఆ మాటలు విని ప్రక్కన
చామరమును వీచుచున్న
చాకివాడు దండం బిడి
వాకొనె నాగీ రీతిగ

"ప్రభువులకీ జన్మమందు
సొంపవేయుగదె ప్రేమ
కావున దొర పాండవులను
ఘనులంచును సెలవిచ్చెను."

చాకివాని మాటలు విని
సంతసించి రాయలపుడు
ఏదయినను కోరుకొనుము
ఇత్తునంచు వాని కనెను.

రజకుని కాక్షణమునందు
రాజ్యము పయిమనసు పుట్టె
నను దేవర కోటకొల్ల
నాయకునిగ చేయుమనెను.

రాయల పరిపాలనమున
రజకు డేని రసికు డేని
పడయగలడు రాజపదవి
బంగారపురోజు లవే!



# రాజ్యకాంక్ష

వేన సహస్రసహస్రాలతోనూ సూర్యుడు విజయనగర సుందరిని దీవించాడు. యుద్ధాలు చేసి అలసిపోయిన సామ్రాజ్యం వసంతోత్సవంతో వేల్పొంది

రాజధాని కస్తూరి గంధంతోనూ, అగరు ధూపమాలతోను ఘుమఘుమలాడుతూంది జనంలో నూతనత్వం వెలి విరుస్తూంది.

అకస్మాత్తుగా అంతఃపురంలో గంట మ్రోగింది! గజ్జెలధ్వని విరహంతో స్తంభించి పోయింది! రాచకొలువులో నిశ్శబ్దం ఒళ్లు విరుచుకొని నీలితెరలు పరుచుకుంది ఆ గంట ధ్వనిలో అపాయ సూచన ఉంది!

యుద్ధ సమయాల్లో తటస్థ రాజ్యాల్లా స్తంభించి పోయారు జనమంతా—మహామంత్రి తిమ్మరుసు సభ ముగించినట్లు సంజ్ఞ చేశాడు.

తిమ్మరుసు అంతఃపురంలోని మహారాజు గదిలో ప్రవేశించాడు మహారాజు వీర వర సింహాసనాయలు హంసతూలికా తల్పంనుండి లేవ ప్రయత్నించాడు. ప్రయత్నం విఫలమయింది. చేసేదిలేక చేతులు చాచాడు. తిమ్మరుసు ఆయన కతి సమీపంగా వచ్చాడు. మహారాజు మహామంత్రి హస్తాల్ని తన హృదయానికి హత్తుకుంటూ "మహామంత్రీ! ఇవి చేతులుకావు అంటున్నాడు తిమ్మరుసు అర్థోక్తిలోనే అందుకుని "ఎంతమాట! మహారాజా!" అన్నాడు

మృత్యువునుగురించి భయంలేదు మంత్రీ"

"మహారాజా మీకు తప్పక స్వస్థత కల్గుతుంది. విజయనగర సామ్రాజ్యలక్ష్మిమిమ్మ దీవిస్తుంది. తమ కేవిపత్తూ రాదు మీ చిరునవ్వుతో మా హృదయాన్ని వెలించండి"

మహారాజు మౌనముద్రలో పోరాటం సల్పుతున్నాడు మహామంత్రి మనోముద్రకు ఆరాటం తెల్పుతున్నాడు

మిక్కిలి సుందరరావు

"మహామంత్రీ, పండుటాకు చిగురు కాలేను కాని నాదొక్క చిన్న కోరిక"

"ఆజ్ఞాపించండి ప్రభూ, తమ కోరిక తీర్చేందుకు ఈమంత్రి ప్రాణాల్ని సయితం వదలగలడు"

"తప్పక నెరవేరుసావుకదూ?"

"అందుకు సందేహమా మహారాజా!" అంటూ రాజుగారి చేతుల్లో చేతులు పెట్టాడు

"అయితే విను నా సవతితల్లి కొడుకు శ్రీకృష్ణదేవరాయల రెండు కన్నులూ పెరికి తెచ్చి నాకు చూపించాలి"

తిమ్మరుసుకు తన రెండుకన్నులూ ఎవరో బలత్కారంగా పెరికొరనిపించింది.

"విజయనగరసామ్రాజ్యంసాగరగర్భంలో దూకింది" మహామంత్రి మనసులో అనుకున్నాడు

"మహామంత్రి మనసు నా కోరిక విని కూలిపోయిందని నాకు తెలుసు నేను చల్లగా కళ్లు మూయాలంటే నా కోరిక తీర్చాలి! మహామంత్రి, నా కోర్కె నెరవేర్చేదీ లేనిదీ తేల్చిచెప్పాలి!"

"మహారాజా, మళ్ళీ ఒక్కసారి ఆలోచించండి"

"అన్నీ ఆలోచించి చేసేదిలేక ఈ నిర్ణయానికి వచ్చాను ఇక నీమాట చెప్పు"

మహామంత్రికి అంతులేని ఆలోచన!

"సరే ప్రభూ, తమ కోరిక తప్పక నెరవేరుస్తాను"

"'ఆలస్యం అమృతం విషం' అంటారు ఆ పని ఈరోజే జరగాలి"

"అలాగే మహారాజా"

"నీ ఋణం నా జన్మలో తీర్చుకోలేను మహామంత్రీ – నీవు లేని ఈ విజయనగర సామ్రాజ్యం పైకప్పులేని ఇంటివంటిది నిన్ను గన్నతల్లి జన్మ తరించింది"

తిమ్మరుసు మహారాజువద్ద సెలవు తీసుకొని కొలువులోకి వచ్చాడు మహారాజు మరణావస్థలో ఉన్నాడని ప్రకటించాడు ఎక్కడవారక్కడ నిశ్శబ్దంగా వెళ్ళిపోయారు తిమ్మరుసు తన యింటికి వెళ్లాడు. ఒక గదిలో ప్రవేశించి తలుపులు బిగించుకున్నాడు.

కోర్కెలు రాక్షసులై సామ్రాజ్యాల్ని స్మశానవాటికలుగా మారుస్తాయి అవి ప్రపంచాన్ని ప్రేతభూమిగా మార్చనూగలవు; సస్యశ్యామలంగాను తీర్చగలవు

మహామంత్రికి ఇప్పుడర్థమయ్యింది శ్రీకృష్ణదేవరాయలు తన కుమారుల్ని సింహాసన మెక్కనివ్వడని రాజుగారి భయం అందుకే అతనికన్నులు పెరకమంటున్నారు

మహామంత్రి ఆలోచన యమునికఠోర పాశాలకు కట్టుబడ్డ కోమలి కంఠంలా మారిపోయింది అటు రాజుగారి ఆఖరికోరిక నెరవేర్చాలి—ఇటు శ్రీకృష్ణదేవరాయల్ని కాపాడాలి!


జీవితంలో మహోల్లాసం




కాల్గేట్

బొరేటెడ్
బేబీపౌడర్ వాడకంతో

అందుచేతనే, విజ్ఞులైన తల్లులు తమ పిల్లల అతి సుకుమార శరీరాన్ని బాధాకరమైన చర్మవ్యాధులు సోకకుండా రక్షించడానికిగాను కాల్గేట్ బొరేటెడ్ బేబీ పౌడర్ వాడతారు అతి సున్నితమైన శరీరాలను మృదువుగా, లాలిత్యంగా వుంచడానికి శాస్త్రీయ పద్ధతులపై తయారుచేయబడింది తాపమెక్కి ఎండ వేడిమికి చర్మం పెట్లకుండా కాపాడుతుంది ..

రోజంతా చల్లదనమిచ్చి, పిల్లలు సుఖంగా వుండడాని కుపకరిస్తుంది దాని కమ్మని వాసన మిమ్మి, మీ పిల్లలను సమ్మోహితులను చేస్తుంది

ఆదాకు జెయింట్ సైజు కొనండి

శ్రీకృష్ణదేవరాయలు ఆ జన్మపర్యంతం అంధుడు కావడమా? ఆ మహావీరుడు మరణిస్తే సామ్రాజ్యం నిలుస్తుందా?

అసలు తను మంత్రి ఎందుకయ్యాడు? ఎలా అయ్యాడు? తను ఆనాడు తన తెలివి ఉపయోగించకపోతే ఈ భారం తనకి తప్పిపోయేదా?

అవి తుళువవంశపు తొలిరాజు నరసరాజు రెండవ భార్య పుత్రుడు వీర నరసింహరాయలు సింహాసనమెక్కిన రోజులు.

రాజ్య చక్రాన్ని నడుపుటకు ఒకమంత్రి కావలసి వచ్చాడు. ఎటువంటి మంత్రి కావాలని అడిగితే అతడు చెప్పడు. అతనికి ఈ లక్షణాలు, అందచందాలు, వృద్ధ సంఖ్యలు అని ఏమీ నిర్ణయించలేదు. చివరికి రాయలకు ఒక ఆలోచన తట్టింది.

వెంటనే పలకమీద ఒకగీత గీశాడు.

రాజభటుల్ని పిలిపించాడు.

"ఈ గీతను చెరపకుండా కొట్టివేయకుండా ఎవరైతే చిన్నగీతగా చేస్తారో, అతన్ని నావద్దకు తీసుకొనిరండి"

రాజుగారి ఈ ఆలోచనకు రాజభటులు నవ్వుకున్నారు. కాని దీనిలో ఏదో కిటుకు ఉందనుకొన్నారు.

రాజభటులు పల్లెలూ పట్నాలూ గాలిస్తున్నారు.

చిన్నగీతగా ఎవ్వరూ మార్చలేకపోతున్నారు. చివరిసారిగా ఒక పల్లెటూరు వెళ్లారు. అక్కడ ఒక పాఠశాల ఉంది. గురువుగారు తమ శిష్యుల్ని కూర్చుండబెట్టుకుని పాఠాలు చెబుతున్నారు. ఆ శిష్యుల్లో తిమ్మరుసు ఒకడు!

రాజభటులు గురువుగారి వద్దకు వెళ్ళారు "స్వామీ, ఈ గీతను చెరపకుండా కొట్టివేయకుండా చిన్నగీతగా మార్చగలరా?" అన్నారు.

గురువుగారు ఆశ్చర్యపోయారు.

విద్యార్థులు విస్మయం పొందారు.

"ఇది మంత్రశక్తివల్ల తప్ప వేరే విధంగా చిన్నగీత కానేరదు," అని గురువుగారు ఖండితంగా చెప్పారు.

తిమ్మరుసు చివాలునలేచి "గురువుగారూ ఆ పలక ఇలా ఇవ్వండి" అని పలక పుచ్చుకున్నాడు.

గురువుగారు నవ్వుకున్నారు.

విద్యార్థులు పరిహాసం చేశారు.

తిమ్మరుసు ఆ పలకమీదవున్న గీతకు పైగా పెద్దగీత గీశాడు.

రాజుగారి గీత తిమ్మరుసు గీతముందు చిన్నదైపోయింది.

గురువుగారు ఆశ్చర్యపోయారు.

విద్యార్థులు సిగ్గుపడ్డారు.

రాజభటులు సంబరపడ్డారు.

రాజభటులు వెంటనే తిమ్మరుసును భుజాలమీద ఎక్కించుకొని తీసుకుపోయారు.



శ్రీ కాళహస్తీశ్వరాలయం - త్రిలింగక్షేత్రాలలో మూడవది

వీరనరసింహరాయలు తిమ్మరుసును మహామంత్రిగా నియమించాడు.

తిమ్మరుసు ఆనాటినుండి రాజ్యాన్ని మంచి చాకచక్యంతో నడుపుతున్నాడు. వీర నరసింహరాయలకు అపజయమన్నది లేదు. తిమ్మరుసు ఖ్యాతి కస్తూరి వాసనలా నేల నాలుగు చెరగులా ప్రాకిపోయింది. తిమ్మరుసు సామ్రాజ్యానికి వెన్నముక అయ్యాడు.

శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసును కన్నతండ్రిగా భావిస్తాడు. గురువుగా పూజిస్తాడు. "అప్పాజీ" అని ఆప్యాయంగా పిలుస్తాడు.

కన్నకుమారుని వంటికృష్ణుని కన్నులు ఎలా పెరికేట్లు! కన్నులుపోయిన కష్టోది జీవించగలడా! కన్నులు తీసి జీవితాన్ని శాశ్వతమైన శిక్షకంటే చంపడమే ఉత్తమ ధర్మం! విజయనగర సామ్రాజ్య మహావీరుడు అంతరించడమేనా!

అతనిమదిలో ఏదో ఆలోచన మెదలింది.

"విజయనగర సామ్రాజ్యం బ్రతికింది" మహామంత్రి గదిలోనే అరిచాడు.

గదితలుపులు తెరుచుకొని బయటికి నడిచాడు. రాజభవనానికి వెళ్ళి శ్రీకృష్ణదేవరాయలను పిలిచాడు. పరిస్థితులు వివరించి రాజభటుల వెంట అడవికిపొమ్మని ఆజ్ఞాపించాడు.

సూర్యుడు అలసిపోయి సెలవుతీసుకుంటున్నాడు.

మహామంత్రి మహారాజువద్దకు వెళ్ళాడు. మహారాజు మృత్యుదేవతతో పోరాడుతున్నాడు.

"మహామంత్రీ, వచ్చావా?" ఆయన హీనస్వరంలో దీనత వినిపించింది.

"చిత్తం ప్రభూ" అన్నాడు తిమ్మరుసు.

"మరి, రక్తంలేని రిక్తహస్తాలతో వచ్చావేం?"

"ఈ తిమ్మరుసు తమకోరిక తీర్చకుండా రాడు మహారాజా, అదిగో! చూడండి-రాజభటులు కృష్ణదేవరాయలవారి కన్నుల్ని పళ్లెంలో పెట్టుకుని తెస్తున్నారు."

రాజభటులు పళ్ళాన్ని మహారాజు కళ్లముందుంచారు! మహారాజు పళ్లెంలో కన్నుల్ని కళ్లారా చూశాడు!

ఒక్కొక్కప్పుడు స్వార్థంకోసం మానవుడు ఎంత అఘాయిత్యమైనా చేస్తాడు. చేసినతరువాత విచారిస్తాడు. చేతులు కాలిన పిదప ఆకులుపట్టుకోవడం మానవ నైజమేమో—

మహారాజు హృదయంలో రోదనవినిపించింది "మంత్రీ, కొంచెం మంచినీళ్లు త్రాగించు" మహామంత్రి మంచినీళ్లు తెచ్చి త్రాగించాడు. రెండుగుక్కలు త్రాగి మహారాజు కనులు మూశాడు.

సూర్యుడు చిఱునవ్వుతో వచ్చాడు.

పడతిమలం ఇంట విడిది చేశాడు! రాజకొలువు ప్రారంభమైంది. సింహాసనంనుండి శ్రీకృష్ణదేవరాయలు లేచాడు. మహామంత్రి తిమ్మరుసు పాదాలకు నమస్కరించాడు. తిమ్మరుసు ఆయన్ని దీవించాడు.

"మేకకన్నులు చూపించి మాఅన్నగారిని తృప్తిపరచావు నాకు ప్రాణభిక్ష పెట్టి సింహాసనమెక్కించావు అప్పాజీ! నీకన్న కన్నతండ్రి నాకు నిజంగా లేడు" అని శ్రీకృష్ణదేవరాయలు ఆప్యాయంగా పలికాడు.

వెంటనే వసంతోత్సవం వెల్లివిరిసింది ★

ఆరోగ్యవంతులైన జనులు
ప్రతిరోజూ
లైఫ్‌బాయ్ సబ్బుతో
స్నానము చేయుదురు

LIFEBUOY SOAP
LIFEBUOY SOAP
LIFEBUOY SOAP

— అది ప్రతిదిన * మలినములోని క్రిములను కడిగివేయును !

* మనకు ప్రతిదినం తార్పపడే మామూలు మురికిలో క్రిములున్నాయి మనలో ప్రతి వారికీ యీ క్రిములవల్ల రోగాల ప్రమాదం వుంది. అందుచేతనే చాలామంది ఆరోగ్య వంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగి వేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్య వంతమైన హాయిని కలిగించును.

L-263-X52 TL

భారతదేశంలో తయారుచేయబడినది

# ★ ఆంధ్రమహాభారతం-అవతరణ ★

సుమారు తొమ్మిదివందలయేళ్ళక్రితం రాజరాజనరేంద్రుడనే రాజు గోదావరీ మండలంలో రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకుని పరిపాలించాడు. గోదావరీ మండలాన్నే ఆకాలంలో వేంగి దేశమనేవారు.

రాజరాజు ధర్మపరాయణుడు. ఆకాలంలో జైనమతం, బౌద్ధమతంలాంటి ఇతరమతాలెన్నో బయల్దేరి సనాతన ధర్మం వెనకబడజొచ్చింది. పాపం అంటే భయం, దేవుడంటేభక్తిపోయి అధర్మం ప్రబలుతోందనీ దాన్ని అరికట్టే మార్గాన్ని చూడాలనీ తోచి ఆ రాజేంద్రుడు తన కులగురువూ, ఆస్థాన పండితుడూ, కవీ ఐన నన్నయభట్టారకుణ్ణి రావించి, 'ఏంచేస్తే బాగుంటుంది?' అని సలహా అడిగేడు.

'ధర్మబోధగావించే సద్గ్రంథాలను రచించి ప్రజలకు అందజేయడం ఒక మార్గం' అన్నాడు నన్నయభట్టు.

'వేదాలలో ఉండే సమస్తధర్మాలనూ కూర్చి వ్యాసమహర్షి సంస్కృతంలో మహాభారతం రచించాడు. దాన్ని మీరు తెనిగించి, సంస్కృతం తెలియని ఆంధ్రులకు ఉపకారం చెయ్యండి' అని కోరాడు రాజు.

నన్నయభట్టు కొంచెం తటపటాయించాడు.

రాజది గ్రహించి, 'భారతం మా పూర్వులైన చంద్రవంశపురాజుల గాథ. అది ఆంధ్రభాషలో ప్రసిద్ధికెక్కాలని నా కోర్కె' అన్నాడు

నన్నయ్య అప్పుడుకూడా 'సరే' అనకపోవడం చూసి రాజు, 'గురువర్యా మీరు మహాపండితులు' మీవంటి కవితావిశారదులు ఆస్థానకవులుగా లభించడం అనేభాగ్యం మరే రాజుకూ పట్టలేదు. మీరు నా కోర్కెను మన్నించి ఆంధ్రభారతాన్ని రచించి నాకు కృతిఇస్తే, నాకీర్తి ఆచంద్రార్కంగా నిలిచిపోతుంది!' అన్నాడు.

నన్నయార్యుడు 'రాజేంద్రా, ఆంధ్రంలో రచనకు పూనుకోడానికి సందేహిస్తున్నానంటే కారణం లేకపోలేదు' అన్నాడు

'ఏమిటో సెలవివ్వండి' అన్నాడు రాజు.

'ప్రస్తుతం తెనుగుభాష ఒకదారీ తెన్నూ లేకుండా ఉంది. వ్యాసభారతంలోని గొప్ప భావాలను తెనిగించి చెప్పాలంటే ఈ భాషలో సామగ్రిచాలదు. ఏదో విధంగా రాద్దాం పోనీ అనుకున్నా మరొక్క సందేహం కూడా వెనక్కిలాగుతోంది' అన్నాడు నన్నయ

'అదికూడా సెలవివ్వండి' అన్నాడు రాజు

'దేశభాషలో రచనఅంటే నేటి పండితులెవరూ హర్షించరు. భారతాన్ని తెనిగించడం విశేషమైనశ్రమతో కూడుకున్నపని. పండితుల ఆదరణ పొందనినాడు నా శ్రమ అంతా వృథా ఐపోతుంది' అన్నాడు నన్నయ.

రాజు 'నేటి పండితులు హర్షించకపోతే పోవచ్చు మీ రచన రాబోయే కవులకు మార్గదర్శకమై మీరు 'ఆదికవి' అనిపించుకుంటారు. ప్రజలమేలే మనస్సులో పెట్టుకుని రచనకు పూనుకోవాలనికోరుతున్నాను. నామాట తోసెయ్యకండి. తెనుగుభాషలో దారీ తెన్నూ లేదనికదూ అన్నారు? ఈ భాషకు కట్టుబాట్లు చెయ్యగల సమర్థులు కూడా మీరే. ముందు ఆ పనిచేసి, భారతాంధ్రీకరణానికి దీక్ష వహించండి' అన్నాడు

## పాలంకి వెంకటరామచంద్రమూర్తి

నన్నయ 'సరే' అన్నాడు. 'ఆంధ్రశబ్దచింతామణి' అనే వ్యాకరణాన్ని రచించి, భాషకు నియమాలు ఏర్పరచాడు. ఈ విధంగా ఆ మహాపండితుడు వాక్కులను అనుశాసించి, 'వాగనుశాసనుడు' అనే పేరు సంపాదించాడు.

ఆ పిమ్మట సంస్కృతభారతాన్ని తెనిగించడం ప్రారంభించాడు. భారతంలో పద్దెనిమిది భాగాలున్నాయి. ఒక్కొక్క భాగాన్నీ ఒక 'పర్వం' అంటారు. నన్నయ ఆదిపర్వం, సభాపర్వం పూర్తిచేసి, అరణ్యపర్వంలో సగందాకా వచ్చాడు. అప్పుడు తలవని తలంపుగా ఒక్క విపత్తు వచ్చింది

నన్నయరచనను, కృతిపద్యం మొదలుగాగల పద్యాలన్నింటనీ ఎప్పటికప్పుడువింటూ ఆనందించిన రాజరాజునకు చక్రకోట్యపు రాజుతో యుద్ధం సంభవించింది. ఆ యుద్ధములో ఆయన ప్రాణాలను గోల్పోయి వీరస్వర్గ మలంకరించవలసవచ్చింది

వేంగి రాజ్యం దాయాదులపరమైంది. యువరాజైన రాజేంద్రచోళుడు సమర్థుడై కూడా దాయాదులతో కలహించడం యిష్టపడక రాజమహేంద్రవరాన్ని వదలి కాంచీపురానికి పోయి దాన్ని రాజధానిగా చేసుకుని పాలించాడు.

చెట్టు పడిపోతే దాన్ని ఆశ్రయించుకొని ప్రాకుతోన్న లత కూడా ఎండిపోతుంది. రాజరాజుతోపాటు నన్నయార్యుని ఉత్సాహమంతా నశించిపోయి, ఆయన రచన అరణ్యపర్వం మధ్యంలోనే ఆగిపోయింది.

నన్నయభట్టు మరణానంతరం నూటయాభైయేళ్లు గడిచిపోయాయి. తర్వాత ఆయనవంశంలో పుట్టినపండితుడొకడు అటకమీది తాటాకు పుస్తకాలను తిరగేస్తోంటే నన్నయ రచించిన అసంపూర్ణ భారతం కనిపించింది. 'ఇలాంటి మహోత్కృష్టమైన గ్రంథం అసంపూర్తిగా ఉండిపోయిందే!' అని ఆ బ్రాహ్మణుడు విచారించాడు. 'ఈ గ్రంథాన్ని పూర్తిచేయగల మహాకవి లేకపోతాడా?' అన్న ధైర్యంతో ఆయన ఆ గ్రంథాన్నీ పుచ్చుకుని, ఆంధ్రరాజుల ఆస్థానాలన్నీ దర్శించాడు.

దర్శించి, ఆ గ్రంథంలోని పద్యాలు కొన్ని చదివి, మెప్పించి, 'ఇంత గొప్పగా రచించిన ఆదికవి నన్నయభట్టారకుని శ్రమ వృథాకాకూడదు. ఈ గ్రంథం పూర్తిఅయ్యే భారంమీది!' అనేవాడు

కాని ఆ భారాన్ని వహించడానికి ఏ ఆస్థాన కవీ సాహసించలేదు. "భారతం మహాసముద్రంలాంటది. అందులో పడ్డవాడు దరికిజేరడమంటూ ఉండదు. పూర్తిచెయ్యాలంటే ఒకటీ, రెండూనా? ఇంకా పదిహేనున్నర పర్వాలున్నాయి! ఉభయభాషాకోవిదుడైన నన్నయభట్టారకుడేపూర్తి చెయ్యవలసింది. ఆయన సామర్థ్యం మరెవరికీ లభించదు. మేం సాహసించి రచనకు పూనుకున్నా ఆయన శైలికీ మా శైలికీ ఏనుగకూ దోమకూ ఉన్నంతవార ఉంటుంది... మరొక్క భయంకూడా ఉంది. కవి రచన ఈ అరణ్యపర్వంలో ప్రవేశించేసరికి కృతిపతి ఐన రాజరాజుకి ఆయుష్షు చెల్లిపోయింది! దానితో కవికి మతిచలించి, గంటం ఆగిపోయింది! రచించాలంటే వేరే గ్రంథాలు ఉన్నాయి. అరణ్యంలో చొరబడడం దేనికి?" అని అందరూ వెనుకతీసేశారు.

ఆ వేంగి బ్రాహ్మణుడు ఆశాభంగంతో స్వగ్రామానికి తిరిగిపోతోంటే ఆంధ్రుల అదృష్టం కొద్దీ నెల్లూరి సీమనుండి వచ్చిన పండితుడొకడాయనకు తారసిల్లాడు. ఆతడు 'ఆర్యా, ఈ గ్రంథాన్ని పూర్తి చేయగల

# ★ ఆంధ్ర మహాభారతం ★

మహాకవి ఈ రాజుగారి ఆస్థానంలో ఉన్నాడు. ఆ రాజుకూడా రాజరాజేంద్రునివలెనే కవులను ప్రోత్సహించే ప్రభువే' అన్నాడు.

'ఎవరు నాయనా మీ ప్రభువు?' అని అడిగేడు వేంగిబ్రాహ్మణుడు.

'నెల్లూరు మండలానికి అధీశ్వరుడు, మనుమసిద్ధి భూపాలుడు ఆయన మంత్రి పుంగవుడే ఈ కవిరాజు' అన్నాడు నెల్లూరు పండితుడు.

'ఆయన పేరు?'

'తిక్కనార్యుడు'

వేంగిబ్రాహ్మణుడు ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా నెల్లూరుకు ప్రయాణమై పోయాడు. ఆకాలంలో నెల్లూరును 'విక్రమసింహపురం' అనే వారు.

వేంగిపండితుడు మనుమసిద్ధి నృపాలుణ్ణి దర్శించి తన రాకకు కారణం చెప్పినప్పుడు తిక్కన కవీశ్వరుడు అక్కడే ఉన్నాడు.

మనుమసిద్ధి కథంతా విని, తిక్కన్నగారి వైపు చూస్తూ, 'దీనికి మీరే సమర్థులు!' అన్నట్టుగా ఒక్క చిరునవ్వు నవ్వాడు.

తిక్కన్నగారు బ్రాహ్మణుని వైపు తిరిగి, 'అయ్యా, గ్రంథం విప్పి ఒక పద్యాన్ని విని పించండి,' అన్నాడు.

బ్రాహ్మణుడు తన దేశాటనం ఫలించ బోతోందన్న ఉత్సాహంతో పుస్తకం తెరిచి గొంతెత్తి—

> మదమాతంగ తురంగ కాంచనలస
> న్మాణిక్య గాణిక్య సం
> పద లోలిం గొనితెచ్చి యిచ్చి ముద
> మొప్పంగాంచి సేవించిరా
> యుదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీ
> పతుల్ సంతతా
> భ్యుదయున్ ధర్మజు దత్సభాస్థితు జగ
> త్పూర్ణ ప్రతాపోదయున్

అన్న పద్యాన్ని చదివేడు.

'ఓహో! ఈ కవితాధార అమృత ప్రవాహం!' అని మెచ్చుకున్నాడు తిక్కన.

'నన్నయ్యగారు సంస్కృత పదాలనే ఎక్కువగా వాడినారు.' అన్నాడు మనుమసిద్ధి

'ఔను. ఆయనకాలంలో ఇప్పుడున్నన్ని తెలుగు మాటలు లేవు మరి మనం రాయాలంటే ఇప్పుడు వాడుక మాటలూ, సామెతలూ, జాను తెనుగు నుడికారాలూ ఎన్నో చేర్చవచ్చు' అన్నాడు తిక్కనార్యుడు.

'గ్రంథమంతా ఒకే పద్ధతిలో ఉండాలంటే, నన్నయగారు ఆపివేసిన అరణ్యపర్వ మధ్యంలోగాక మళ్ళీ ఆదిపర్వం నుండీ ప్రారంభించడం మేలు' అన్నాడు రాజు.

తిక్కనార్యుడు ఆ సూచన ఆమోదించ లేదు 'నన్నయభట్టారకుడు ఆంధ్రకవితా విశారదుడు ఈ మూడుపర్వాల రూపంలోనూ ఈ ఆదికవి కవిత్వం లోకానికి ఆదర్శంగా నిలిచిపోవలసిందే.' అన్నాడాయన.

ఐతే, ఆయన వదలివేసిన చోటనే ఆరంభించండి పోనీ' అన్నాడు రాజు.

'ప్రస్తుతం అరణ్య పర్వంలోని శేష భాగాన్ని అలాగ వదిలెయ్యడమే మంచి దనిపిస్తోంది నామటుక్కు. విరాటపర్వం మొదలు స్వర్గారోహణ పర్వంవరకూ ఉన్న మిగతా పదిహేను పర్వాలూ రచించడానికి పూనుకుంటాను' అన్నాడు తిక్కన.

రాజు చిరునవ్వుతో, 'అరణ్య పర్వంలో శేషభాగాన్ని పూర్తి చెయ్యబోతే వెడిసి కొడుతుందేమో అన్న భయం మీకుకూడా కలుగుతోందా?' అన్నాడు.

తిక్కన రాజుతో, 'భయంకాదు ఏ కారణంచేతనైనా విఘ్నం కలిగితే నా ప్రయత్నమంతా అక్కడితోనే ఆగిపోయి, మిగతా పదిహేను పర్వాలూ అలాగే ఉండి పోతాయి అవి తెనుగులోకి అవతరించాక ఈ శేషభాగంమాట చూడవచ్చును.' అన్నాడు

మనుమసిద్ధి, 'సరే' అన్నాడు. వేంగి బ్రహ్మణునితో, 'ఇంక మీరు నిశ్చింతగా ఉండవచ్చు. మా తిక్కన కవీంద్రులవారు ఆంధ్రలోకమంతా ఆనందించేటట్లు మిగత భారతాన్ని తెనిగిస్తారు లెండి.' అని చెప్పి, సత్కరించి పంపేశాడు

పదిహేను పర్వాలు రచించటమంటే సామాన్యమైన పనికాదు. ఎంతో దీక్ష కావాలి తిక్కనే, రాజుతో, 'దీక్ష కుదరాలంటే యజ్ఞం చెయ్యాలి' అన్నాడు.

మనుమసిద్ధి యజ్ఞానికి కావలసిన ప్రయత్నాలన్నీ వెంటనే చేయించాడు. తిక్కన యజ్ఞంచేసి సోమయాజి అయాడు.

కాని ఆయన రచన ప్రారంభించలేదు. మనుమసిద్ధి, 'మామా, ముహూర్తం కుదుర


నల్లని, సొగసైన, పొడవగు శిరోజములకొరకు

కేస్టరోమా కాస్మెటిక్

తల వెంట్రుకలకు నూతన జీవితము నిచ్చును దీనిని రోజూ వుపయోగించినచో తల వెంట్రుకలు వొత్తుగా పెరుగును. నేత్రములకు చల్లదనము కలుగును.

BOCIL THE SEAL OF QUALITY

సామాన్య సైజు సీసా రు 1/10
పెద్ద సైజు సీసా రు 3/12
(స్థానిక పన్నులు అదనము)

ఉచిత బహుమతి గుర్తు APK/7/10

5 తులములుగల కేస్టరోమా సీసాను ఉచితముగా పొందుటకు ఎనిమిది అణాల పోస్టేజి స్టాంపులను, మీ పేరు చిరునామాలను ఈ టోకెన్‌తోసహా దిగువ చిరునామాకు పంపుడు బోసిల్ పోస్టు బాక్సు నం. 1611, బొంబాయి-1

BOC 563

డిస్ట్రిబ్యూటర్లు: మెసర్సు జి కె నాగనాథన్, కర్నూలు.
,, శ్రీ వెంకటేశ్వర ట్రేడింగ్ కంపెనీ, రాజమండ్రి
శ్రీ శంకర్ జనరల్ స్టోర్సు, శ్రీకాకుళం.

లేదా ?' అన్నాడు. ఆ రాజు తిక్కనాచార్యుని ఎప్పుడూ 'మామా' అని పిలిచేవాడు.

తిక్కన, "మహాభారతం కుదురకకాదు. నేను పద్యాలను ఆశువుగా చెప్పుకు పోతోంటే, నాతో సమంగా రాసుకుపోయే వాడు కావాలి. 'అలాంటి వాడెవరు ?' అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

'ఆలోచించి చెప్పండి. అతనికోసం ఎంత సొమ్మైనా వెచ్చిస్తాను. ఎక్కడున్నా రప్పిస్తాను!' అన్నాడు రాజు

'మా స్వగ్రామంలోనే గురునాథుడనే కుమ్మరి ఒకడున్నాడు వాని దస్తూరీ చక్కనిది సాహిత్యంలో కొంత కృషి చేసినవాడు కూడాను అతణ్ని రప్పించండి' అన్నాడు తిక్కన సోమయాజి

కొద్దిరోజులలోనే గురునాథుడు తిక్కన సమక్షంలో నిలిచి నమస్కరించాడు.

"సోమయాజి ఆ యువకుణ్ణి ఆశీర్వదించి వ్యాసమహర్షి భారత శ్లోకాలను ఆశువుగా చెప్పుకు పోతోంటే విఘ్నేశ్వరుడు ఆయనతో సమంగా గంటంతో రాసుకుపోయాడు. అలాగే నువ్వు నా పద్యాలను ఎక్కడా ఆగకుండా రాయాలి ఆగిపోయి, 'ఏమిటండీ?' అని అడిగేవా, నా ధార అడ్డిపోతుంది!" అన్నాడు

గురునాథుడు, 'ఆ ప్రమాదం రానివ్వను, నా గంటం ఆగిపోవడమే తటస్థించిన నాడు నా చేతిని నరికేసుకుంటాను!' అన్నాడు.

తిక్కన, 'ఔరా, ఎంతశపథం చేశావు! ఐతే నేను కూడా ఇలాంటి ప్రతిజ్ఞయే చేస్తాను. నా ధార ఎప్పుడు ఆగిపోతే అప్పుడు నా నాలుక కోసుకుంటాను!' అన్నాడు.

మనుమసిద్ధి ఆ ఘోరశపథాలను విని, ఏం ముప్పు రానున్నదో అని కొంచెం భయపడ్డాడు. కాని వారిద్దరూ సమర్థులే అనీ, శపథాలు నిలబెట్టుకోగలవారే అనీ తోచి ధైర్యం తెచ్చుకున్నాడు.

వచ్చి పోయేవాడు కనపడుతోంటే దృష్టి చెదిరి ఏకాగ్రత కుదరదని చెప్పి, తిక్కన తెర ఒకటి కట్టించి దానిలోపల కూర్చున్నాడు తెర అవతల గురునాథుడు తాటాకులూ, గంటం పుచ్చుకొని సిద్ధంగా ఉన్నాడు

'ఈ మహోత్కృష్ట గ్రంథాన్ని ఏ దేవుడికి కృతి నివ్వడం?' అనిపించింది తిక్కనార్యునికి

'మహాదేవుడైన శివునికి ఇవ్వండి.' అన్నాడు రాజు.

'మహావిష్ణువుకు ఇచ్చినా ఇవ్వవచ్చును.' అన్నాడు గురునాథుడు

"శివుడన్నా విష్ణువన్నా ఒకటే ఈ సంగతి గుర్తించలేక మతావేశంతో శైవులూ, వైష్ణవులూ ఒకాళ్ళనొకాళ్లు దూషించు



కాంతిచ్ఛట

కోడం, కొన్నిచోట్ల చంపుకోడం కూడా జరుగుతోంది. హరిహరాత్మకమైన ఆ దివ్య మూర్తిని, 'విష్ణురూపాయ నమశ్శివాయ' అని స్తుతించి, ఉభయ మతాలవాళ్ళకూ జ్ఞానబోధ చేస్తాను" అని నిశ్చయించుకుని, తిక్కన ఆ స్తుతి పద్యంతో ఆంధ్ర మహాభారత రచన విరాటపర్వంవద్ద ప్రారంభించి సాగించాడు.

మొదలు పెట్టడమే తడవుగా రచన అడ్డులేకుండా సాగిపోయి, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ పర్వాలు ఐదూ ఒక్కొక్కటే పూర్తి అయాయి. శల్య పర్వం ప్రారంభమై మొదటి ఆశ్వాసం చివరికి వచ్చాడు తిక్కనకవి. యుద్ధంలో శల్యుడు కూడా పడిపోయాడు సంజయుడు గుడ్డిరాజు ధృతరాష్ట్రునితో తర్వాతి కథ చెప్పబోతున్నాడు. తిక్కనగారు—

"వలపలని మూకలో గాల్
నిలుకక గుబ్బంబుసెగ్గి నీ కొడుకు గదా
కలితభుజాండై యొక్కడు
దొలగి చనియె—"

అన్నంతవరకూ చెప్పి, పద్యం ఎలా పూర్తి చెయ్యాలో తోచక, 'ఏమి చెప్పుదును గురునాథా!' అంటూ తెర అవల రాస్తోన్న గురునాథుణ్ణి పిలిచి, 'ధార ఆగిపోయింది కత్తి తే నాలుక కోసుకుంటాను' అన్నాడు.

గురునాథుడు, 'ఏమి చెప్పుదును గురునాథా!' అన్నది పద్యభాగమే అనుకుని గంటంతో రాసేసి, 'కత్తి తెమ్మం'టూన్న సోమయాజిగారితో 'కత్తి దేనికండీ?' అన్నాడు.

తిక్కనగారు, 'ధార అడ్డిపోయింది కాదా మరి? పద్యం పూర్తిచెయ్యలేకపోయాను!' అన్నాడు.

"పద్యం పూర్తి కాకపోడమేమిటండీ? 'తొలగి చనియె నేమి చెప్పుదును గురునాథా!' అని రాసుకున్నాను సరిగానే ఉందే. 'గురునాథా' అంటే 'ధృతరాష్ట్రుడా' అని సంజయుడు సంబోధిస్తున్నట్లు చెప్పేరనుకున్నాను. కాదా?" అన్నాడు గురునాథుడు.

సోమయాజి సంతోషించి,

"గురునాథా, నీవు 'గురు'నాథుడవు కాని, కుమ్మరి గురునాథుడవు కావు! నేను నీతో అన్నదానితోనే పద్యం పూర్తిచేసి, నాకు స్ఫురించని అర్థాన్ని చెప్పి నా ప్రతిజ్ఞ నిలబెట్టేవు!" అని మెచ్చుకున్నాడు.

ఆ తర్వాత అలాంటి ఉపద్రవం ఏదీ రాకుండా తిక్కన సోమయాజి భారతం పదిహేను పర్వాలనూ పూర్తిచేశాడు.

మనుమసిద్ధి పదేపదే పద్యాలన్నీ చదివించుకుని వింటూ ఆనందించి, అటువంటి కవిబ్రహ్మ తనకు మంత్రీ ఆస్థానకవీ ఐనందుకు పొంగిపోయాడు

ఒకనాడా రాజు, 'అరణ్యపర్వంలో మిగిలిపోయిన ఆ భాగాన్ని కూడా తెనిగించెయ్యరాదా?' అని అడిగేడు. సోమయాజి

# ★ ఆంధ్ర మహాభారతం ★

వారు సమాధానం ఏమీ చెప్పక పూర్వమే వారికి రణదుందుభుల మ్రోత వినిపించింది

రాజు ఉలిక్కిపడి లేచి, 'ఏమిటిది?' అనే సరికి, 'శత్రువులు వచ్చి పట్టణాన్ని ముట్టడించారు' అన్న వార్తను చెప్పేరు.

'శత్రువులా? ఎవరు? నాకు విరోధులు లేరే?' అన్నాడా అమాయకుడు!

'పై వాళ్ళెవరూ కారు మీ దాయాదులైన అక్కన్న, బయ్యన్నలే కుట్రచేసి ఆక్రమించుకున్నారు' అన్నారు చారులు

ఆ మాట వినడంతోనే మనుమసిద్ధికి ఏమీ తోచింది కాదు కంగారుగా దిక్కులు చూస్తుంటే శత్రు సైనికులు చొరబడి రాజును బంధించి తీసుకుపోయారు.

దాంతో సోమయాజిగారికి ఆశ్రయం పోయింది కాని అందుకాయన విచారించ లేదు. 'మంత్రినై యుండీ, ఆపదలోంచి ప్రభువును రక్షించుకోలేకపోయాను!' అని దిగులు చెందాడు.

ఆలోచించగా ఆయనకొక్క ఉపాయం తట్టింది. వెంటనే బయల్దేరి ఓరుగల్లు పట్టణం చేరుకున్నాడు

ఇప్పుడు తెలంగాణంలోని 'వరంగల్' అన్న పట్టణమే ఓరుగల్లు. ఆ కాలంలో ఈ నగరం కాకతీయ సామ్రాజ్యాధిపతియైన గణపతిదేవచక్రవర్తికి రాజధానిగా ఉండేది

గణపతిదేవుడు పరాక్రమవంతుడనీ, కళాపోషకుడనీ, కవిజన కల్పవృక్షమనీ, ప్రసిద్ధికెక్కిన ఆంధ్ర సార్వభౌముడు నెల్లూరు మండలము దూరదేశమే ఐనా ఆ చక్రవర్తి తిక్కన సోమయాజి భారతాన్ని గూర్చి ఇదివరలో విన్నాడు. ఆ 'కవిబ్రహ్మ' తన రాజధానికి వస్తున్నాడని తెలియడంతోనే చక్రవర్తి ఎదురుగాపోయి స్వాగతమిచ్చి తీసుకొచ్చాడు

తిక్కన సోమయాజి చక్రవర్తి ఆదరణకు పాత్రుడై తన భారతాన్ని వినిపించాడు. ఆ గ్రంథరాజంలోని విశేషాలన్నీ ఆయన ముఖతః విని చక్రవర్తి పరమానంద భరితుడై, ధనకనకవస్తువాహనాలనూ అగ్రహారాలనూ ఇచ్చి గౌరవించాడు.

తిక్కన సోమయాజి, 'ప్రభూ, నన్నింత వరకూ పోషించిన మనుమసిద్ధి భూపాలుడు, ఇప్పుడు దాయాదుల చేజిక్కి చెఱలో ఉన్నాడు శత్రువులను పారదోలి, ఆయనను చెఱనుండి విడిపించాలని కోరడానికి వచ్చాను' అని అసలు విషయం చెప్పాడు.

గణపతిదేవుడు తిక్కన రాజభక్తికి మెచ్చుకుని, మర్నాడే చతురంగ సేనతో నెల్లూరుకు పోయి అక్కన్న బయ్యన్నలను పారద్రోలి మనుమసిద్ధిని తిరిగి సింహాసనం మీద కూర్చో బెట్టేడు.

అరణ్యపర్వంలో మిగిలిపోయిన భాగాన్ని మాత్రం తిక్కన ముట్టుకోలేదు మరో నూటయాభై యేళ్ళవరకూ ఆ శేషభాగం అలాగే ఉండిపోయింది

తర్వాత వేమభూపతిఅనే కొండవీటిరెడ్డి ప్రభువు, తన ఆస్థానకవియైన ఎఱ్ఱాప్రెగ్గడను అరణ్యపర్వంలో మిగిలిపోయిన దాన్ని పూర్తిచెయ్యవలసిందని కోరేడు.

ఎఱ్ఱాప్రెగ్గడ 'హరివంశం' లాంటి గొప్ప ప్రబంధాలు ఎన్నో రచించి 'ప్రబంధ పరమేశ్వరుడు' నే బిరుదును సంపాదించిన గొప్పకవి.

ఆయన సమర్థుడై కూడా అరణ్యపర్వశేషాన్ని పూర్తి చెయ్యడానికి తిక్కన కవులకు మల్లేనే మొదట సందేహించాడు

కాని వేమారెడ్డి 'మీరు తీర్చకపోతే ఈ లోపం ఇలాగే ఉండిపోతుంది.' అన్నాడు.

ప్రభువుమాట కాదనలేక ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వంలోని శేషభాగాన్ని పూర్తి చేశాడు.

ఈ విధంగా ఆంధ్ర భారతం అవతరించింది మూడు కాలాలకు సంబంధించిన ముగ్గురు మహాకవులు రచించారు దీన్ని. ఈ కవిత్రయం, వీరిని పోత్సహించిన రాజులూ, ఆంధ్రచరిత్రలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకున్నారు ★


మహత్తరమైన విశాలాంధ్రావతరణ, మంగళకరమైన దీపావళి శుభసమయమున మా అభినందనలు

ఓం తత్ సత్

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

## "మేల్‌మాయిల్ మందు"



ప్రపంచములో ప్రఖ్యాతిగాంచిన మేహ, కుష్టురోగ నివారిణి

భయంకరమైన మేహవ్యాధివల్ల కష్టపడు వారలకు పునర్జన్మమిచ్చు

అద్భుత సంజీవి మేహరోగ నివారణ నూనె, లేహ్యము

నల్లమేహ, ఎఱ్ఱమేహ, పొడలు, మేహరణములు, తిమర్లు, మతిమాంద్యము, కుష్ఠములు, పిత్తకారికము, మూతక వ్యాధులు, వాతము, గుల్మము, తెలుపు, ఉష్ణం, గ్రంధి, కాళ్లచేతులు మంటలు, రక్తబలహీనం, గజ్జి, దురద, వీర్యనష్టం, మూలవ్యాధి, మలబద్ధకము మొదలైన అన్ని విధముల దుర్‌పేరు వ్యాధులను అతి సులభముగా పోగొట్టును

40 రోజులు (1 మండలము) నూనె, లేహ్యము 6-0-0 తపాల్ ఖర్చు వేఱు వివరములకు కేట్లాగులో చూడవచ్చును

K. T. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు, 5/22, మేల్‌మాయిల్ పోస్టు (N. A. Dt.)

# వనితా లోకం

## ★ సత్యభామ ★

నరకాసురుడు రాజులనందరినీ ఓడించి, ప్రజలను హింసించి, స్త్రీలను చెరబట్టి ఇంద్రలోకాన్ని కూడా జయించాలన్న కోరికతో, దండెత్తి వెళ్ళాడు. దేవతలను నానాబాధలు పెట్టాడు. ఇంద్రలోకాన్ని కొల్లగొట్టి దేవతలు పరమ భాగ్యముగా భావించే అదితి కర్ణకుండలాలనూ, వరుణచ్ఛత్రాన్ని మణిపర్వతాన్నీ హరించాడు. ఇంద్రలోకమంతా పాడుబడి పోయింది. భయార్తుడైన ఇంద్రుడు, నరకాసురుని వధించి శిష్టసంరక్షణ చేయవలసిందని శ్రీకృష్ణుని ప్రార్థించాడు. అష్టమహిషులతో సరససల్లాపాలాడుతూ ఉద్యానవన విహారాలు సలుపుతున్న శ్రీకృష్ణుడు, అతడి మొరాలకించి బయలుదేర బోతున్నాడు.

అంతలో సత్యభామ హంసనడకలతో ఆయనను సమీపించింది; "నిశాచరులను చెండాడే మీ పరాక్రమాన్ని, ప్రావీణ్యాన్నీ కన్నులారజూడ వేడుకగా ఉన్నది నేనూ వస్తాను కరుణించి, నన్ను మీ వెంట గొనిపొం"డని వేడుకొన్నది యుద్ధభూమిలో ప్రాణేశ్వరుడి ప్రతాపోన్నతిని కన్నుల పండువుగా చూచివచ్చి, సపత్నులకందరికీ చెప్పి మనసార కీర్తించుకొన కోరికగా ఉన్నదని తన కౌతుకాన్ని వెల్లడించింది సత్యభామ

ఆమె మాటలకు శ్రీకృష్ణుడు పకపక నవ్వాడు. యుద్ధభూమి అంటే ఏమనుకున్నదో సత్య అనుకున్నాడు. పూదోటలో కమ్మని పూలతావి నాఘ్రాణిస్తూ, కలహంస సారసకాసారాల ఒడ్డున కహ్లార కుసుమ సంఘాలను వీక్షిస్తూ నూత్నలతవలె ఉన్న నీవు ఎక్కడ-రాక్షస సైన్య దళాలతోను, భీషణ కుంభీంద్రసమూహాలతోనూ, శూలఖడ్గాది సాధనాలతోనూ, సైనికులధివసించిన అశ్వికదళాలతోనూ నిండి ఉండే రణరంగమెక్కడ? నీవు ప్రత్యక్షంగా చూచి, తాళలేవు, అంతఃపురములో చెలులమధ్య-హంసతూలికా తల్పము మీద కూర్చుండి వినోద కాలక్షేపము చేయతగిన సుకుమారివి నేను మూడుచిటికెలలో దానవుణ్ణి సంహరించి తిరిగివస్తానని వాసుదేవుడు ఆమెను వారింపజూశాడు.



త్యాగరాజు

కాని సత్యభామ అంతమాత్రాన ఆగిపోయేది కాదు. "అది రణరంగమయితే నేమి? ఆ వైరి దానవుడు అయితే నేమి? నేను యుద్ధభూమికి వచ్చితీరవలసినదే! మీ బాహు దుర్గములమాటున ఉన్నంతవరకూ, నేను భయపడ నవసరము లేదు కదా!" అని వేడుకొన్నది. తుదకు ఆమె కోరికను శ్రీకృష్ణుడు సాదరముతో మన్నించవలసిన వాడయ్యాడు.

సత్యభామా సమేతుడయిన శ్రీకృష్ణుడు గరుడవాహనారూఢుడై, ఆకాశ మార్గాన పయనించి ప్రాగ్జ్యోతిషపురము చేరుకొని, శత్రువులను చెండాడుతుండగా, అసురబాణమొకటి ఏమరుపాటున ఉన్న మురారికి తాకింది. దానికి ఆయన వెంటనే మూర్ఛిల్లాడు సత్యభామ అతడిని సేదదేర్చి, విశ్రాంతి తీసుకోవలసినదని వేడుకొని-కదన కుతూహలముకొద్దీ లేచి నిలువబడ్డది. మాట వరుసకు శ్రీకృష్ణుడు తన చేతిలోఉన్న బాణాసనాన్ని ఆమె చేతికిచ్చాడు, విలాసంగా.

అనేకమంది దుష్టులను సంహరించి, శత్రుగర్వాన్ని అణచిన ఆ విల్లంబు చేతబట్టగానే సత్యాదేవికి ఎక్కడలేని బలమూ వచ్చినట్లయింది ధైర్యముతో పయటకొంగు నడుముకు చెక్కుకొని, ముందడుగు వేసింది నారి సంధించి బాణాన్ని వదలింది నారి సంధించేటప్పుడు ఆమె చేతి బంగారు గాజుల గలగలలు శింజినీరవముతో కలిసి వింతధ్వనిని కలిగించాయి. రోషావేశముతో ఎరుపెక్కిన చెంపలు కర్ణాభరణాలలోని మణులకాంతితో మెరసిపోసాగాయి వీరశృంగార భయరౌద్ర విస్మయాలు ఆపాదమస్తకమూ వెల్లువలై పారగా శ్రీకృష్ణుని సరసంపురాణి అయిన సత్యభామాదేవి నరకాసురునితో భయంకర యుద్ధము చేయనారంభించింది అసురులకు తమనెదిరిస్తున్న శత్రువు ఎవరయినదీ పరికించి చూసే వ్యవధానము లేకపోయింది. బాణవృష్టి నిలుపులేకుండా సాగిపోతున్నది. దానవులు కుప్పగా కూలిపోతున్నారు. నరకాసురుడికి శ్రీకృష్ణుని మూర్ఛిల్లచేసిన సంతోషము కొంచమయినా మిగులలేదు.

ఇల్లిందల సరస్వతీదేవి



ఇంటింట దీపావళి
చిత్రకారుడు: పొడిశెట్టి నరేంద్ర.

ఆ యుద్ధ సమయములో శరపరంపరలతో దానవులను హతము చేస్తున్న సత్యభామ చూపరులకు ముచ్చటగొలిపింది. ఆమె చేతిలోని విలు ఇంద్రధనుస్సుగాను, ఆమె ప్రక్కగా ఉన్న శ్రీ కృష్ణుడు మేఘము గాను-సత్యభామ విద్యుల్లతవలెను కన బడ్డారు; రథముమీద నిలువబడి బాణాలను సంధించే సత్యాదేవిముఖబింబము రవిబింబము వలె కనబడ్డది ఆమె పైటకొంగు ధూమకేతువులా చూపట్టింది.

మూర్ఛనుండి తేరుకొని, విశ్రాంతి తీసుకొంటున్న శ్రీకృష్ణుడు ఆమెను చూచినకొద్దీ విస్మయాంబుధిలో మునిగిపోతున్నాడు.

సత్యభామ! పురుషులను చూడగానే చాటుకు మరలే స్వభావముకలది. నిర్భయముగా పతితో రణరంగానికి రావటమూ, విలు సంధించటమూ ఎంత ఆశ్చర్యముగా ఉన్నది! ఆమెను, సరాలలో ముత్యాలు సరిగా గ్రుచ్చలేని లలితాంగిగా మాత్రమే ఇంతకాలమూ శ్రీకృష్ణుడు భావించాడు. ఆమె విల్లును ఏవిధంగా సంధించగలిగిందో ఆయనకు అర్థముకాలేదు. కాగా-'చిలుకకు పద్యము చెప్పటానికే అలసిపోయే సత్యభామ అస్త్రమంత్రాలను ఎప్పుడు పఠించింది? అసలు-వీణనయినా చక్కగా పట్టుకోలేని సత్య ఈ బాణాసనాన్ని ఎట్లా పట్టుకో గలిగిందబ్బా! ఇంతకాలమునుండీ ఈమెను పతిచాటు పడతిగా మాత్రమే ఊహించానే! నా ప్రణయాంతరాళములో. చొచ్చి-ప్రేమనురగిల్చి, చిలిపితనాన్ని లేపి, సరసంపు టలుకలలో సేదదీర్చి భోగరసైక లోలునిగా చేసి నన్ను మురిపించి తాను మురిసిపోయిన ప్రేయసిగానే ఈమెను భావించానే! అసమానమయిన ఈమె శక్తిసామర్థ్యాలను తెలిసికొనే అవకాశము ఇంతవరకూ కలుగలేదే! నా భాగ్యవశముచేత ఇప్పుడా అవకాశము వెదుకుకొంటూ వచ్చింది." అనుకొంటూ పట్టరాని ఆనందముతో పడకమీద నుండి లేచాడు. ఇనుమడించిన రోషావేశముతో శత్రుసంహారము చేశాడు. ఆ విజయోత్సాహములో రుక్మిణీదేవి కోరికపైన చేయించిన మణికౌస్తుభాన్ని యుద్ధానంతరము రుక్మిణీదేవికి ఇవ్వదలచిన అపూర్వకానుకను సత్యభామాదేవికి ప్రేమతో ఇచ్చి "సత్యా! ఈ విజయము నీదేసుమా!" అన్నాడు.

సత్యభామాదేవి హృదయము ఆ కానుకతో నిండు చంద్రునిగన్న సముద్రమువలె పరవశ్ము త్రొక్కింది. తన రణకౌశలాన్ని పతిఎదుట ప్రదర్శించకలిగినందుకు కాక—దాని నతడు గుర్తించినందుకు ఆమె వివశురాలయిపోయింది.

నరకాసుర వధానంతరమునుండీ కాలవారూ టపాకాయలు కాల్చి దీపమాలికలతో తమ గృహాల నలంకరించుకొని పండుగ చేసుకొన్నారు. ఆ విధముగా ఈ నాటికీ భారతీయులు ఏ దేశములో ఉన్నా పండుగ చేసుకొంటునే ఉన్నారు. కాని లోకకంటకుడయిన నరకాసరుడు సంహరింపబడినందుకే కాకుండా, పరాక్రమశాలిని అయిన సత్యభామాదేవి రణరంగాననిలచి యుద్ధము చేయ గలిగినందుకు కూడా స్త్రీలు దీపావళిపండుగ చెసుకోవాలి. మహిళాసంఘాలు ఉత్సవాలు జరపాలి. వాస్తవానికి ఆ విజయము సత్యభామాదేవి దయితే, మహిళలది కాదా!



## గమనిక.

స్థలాభావంచేత ఈ వారం సాగరగర్భంలో సాహసయాత్ర, మంత్రాలు—నమ్మకాలు, సినిమా శీర్షికలు, మ్యాథిల్లీ లేఖ నిలిపివేయవలసి వచ్చింది. వచ్చేవారంనుండి వాటిని యథాప్రకారం ప్రకటిస్తాము.

—సంపాదకుడు.

# రుద్రమదేవి

రాజ్యం అరాజకం అయే పరిస్థితిలో పడేట్టుంది. నాగుపాములు నలుదిక్కులా, తలలెత్తి చూస్తున్నాయి, వాటం చూచి కాటువెయ్యడానికి. సాక్షాత్తూ భర్తృదేవుడే పగబట్టినట్టు ముఖం చాటు చేసుకొని తిరుగుతూంటే, ఏమీ పాలుపోవటం లేదు. తాను రాజసభలో యువరాజు రుద్రదేవుడే కావచ్చు; కాని భర్త వీరభద్రదేవుడిని, పాదదాసిగానే పూజించిందే ఆయనకు కించిత్తు అపచారం జరుగనివ్వలేదే.

అపచారం అని ఆయన అభిప్రాయపడేది, తాను యువరాజు కావడమే. ఇది తాను కోరి వేడీ తెచ్చుకున్నది కాదు; నిండుసభలో రాజగురువుల సూచనపై, సభవారి ఆమోదం పురస్కరించుకొని, మహారాజు గణపతిదేవుడు తనకీ పదవిని ప్రసాదించారు. తన సవతికుమారుడు హరిహరుడికి ఇవ్వవద్దని తాను వాదించలేదు. తన మనుమడు ప్రతాపరుద్రుడికి ఇచ్చితీరాలని పట్టుబట్టనూ లేదు. వాదించేవారు వాదించారు. భర్త, హరిహరుణ్ణే యువరాజు చెయ్యాలన్నాడు. 'కాదు మీ మునిమనుమడు ప్రతాపరుద్రుణ్ణే యువరాజు కావాల'న్నాడు తన అల్లుడు మహాదేవుడు. జైనాచార్యుడు వీరభల్లటుడు హరిహరుడినే వెనక వేసుకొచ్చాడు.

చివరకి తేలిందేమిటి? తేల్చినదెవరు?

"తుది నిర్ణయం రాజగురువులదే. వారు మన శ్రేయోభిలాషులు" అన్నారు మహారాజ గణపతిదేవులు.

"నిర్ణయానికేముంది? రక్తస్పర్శగల రుద్రదేవులకన్న యౌవరాజ్య పట్టాభిషేకానికి అర్హులెవరు? అన్యులనర్హులే" అన్నారు రాజగురువు విశ్వేశ్వర శంభుదేశికులు.

సభాసదులు యావన్మంది ఈ సూచనకు హర్షధ్వానాలు చేస్తే, మహారాజు దీనిని ఆమోదిస్తే, రాజగురువులు 'శుభమస్తు' అంటే, అందుకు బాధ్యురాలు తానా?

ఈ భారం వహించడం తనవల్ల కాదని అని ఉంటే భర్తృదేవుడు ఆనందించి ఉండేవాడేమో. తను ఎలా అనగలదు? పెద్దలనిర్ణయాన్ని కాదనడమెలా? తనసామర్థ్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కప్పిపుచ్చుకొని అసమర్థురాలనని చెప్పుకోవడానికి మనసొప్పుతుందా? అసమర్థులే, నిజాన్ని అంగీకరించలేరే?



కాకతీయ సామ్రాజ్యాధిపతి
ప్రతాపరుద్రుని శిరశ్శిల్పం
[వరంగల్ కోటలోనిది]

అయితే, ఇపుడు ఈనాడు, భర్త తనతో మాటాపలుకూ మానివేయడం మహారాజు గణపతిదేవులు వ్యాధిగ్రస్తులై ఉండడం, రాజ్యంలో జైనకరణాలు, సాలుసరి లెక్కలు అప్పగించరాదని కట్టుకట్టారన్న వార్తలు, వాళ్ళ ధీమాకి, సాక్షాత్తు తన పతి పతిదేవుడి మద్దతే కారణమన్న సూచనలూ ఇవన్నీ తన సామర్థ్యానికి పరీక్షలా? ఆడది రాజ్యమేలేదేమిటి చూదాం అన్న సవాలులా? ఇదే అదననని అటు దక్షిణ పాండ్యరాజు దండయాత్రలకుపక్రమించడం, ఆవంక మొగలిచెర్ల పరిపాలకుడికి అంతలోనే, పొగరెత్తి తిరుగుబాటుచేయ సిద్ధపడడం కూడా పరీక్షలేనా...

పరీక్షలయితే కావచ్చు అగ్నిపరీక్షలు మటుకు కావు...

సవ్యంగా సకాలంలో వీటిని ఎదుర్కొని పరిష్కరించకపోతే, ఈ చిన్న అల్లర్లు పెచ్చురేగి, కార్చిచ్చులే కావచ్చు. ఈ స్థితిలో తనను ఆదుకునేవా రెవరు? తాను నమ్మతగవా రెవరు.

* * *

నమ్మతగినవా రెవరో, తగనివా రెవరో, తేల్చుకోలేని పరిస్థితిలో రుద్రమకు కొత్త వార్తలు వచ్చాయి. ఫిర్యాదులు వచ్చాయి.

మండలాధీశ్వరులు (కలెక్టర్లు) భూమిశిస్తుల విషయంలో దొంగలెక్కలు వేస్తున్నారట. కట్టుకట్టి రాజద్రోహానికి ఒడికడుతున్నారట. ముఖ్యంగా ఇందులూరి అన్నయ్యగారిమీద పరంపరగా పితూరీ చేస్తూన్న ఉత్తరాలు వచ్చిపడ్డాయి. అవన్నీ జైనకరణాలు గుట్టుగా కూర్చొని, కల్లబొల్లి అబద్ధాలతో నింపి, కుప్పతిప్పలుగా గుప్పించినవని రుద్రమకు తెలియదు. ఇప్పుడెవర్ని నమ్మాలి? మళ్ళా మామూలు ప్రశ్నే ఎదురైంది. ఈ ఉత్తరాలు వ్రాసిన 'ఎవరో' నమ్మాలా, తన కొలువులో ఇన్నాళ్ళూ నమ్మకంగా పనిచేసిన ఫలానా ఫలానాలను నమ్మాలా?...అన్నయ మంత్రి లెక్కలన్నీ సకాలంలోనే తయారుచేయించాడు దొంగలెక్కలు కాబట్టే, ఇంత ఖచితంగా వేళకి పూర్తిచేయించాడేమో...తనమీద గురికొద్దీ కష్టపడ్డాడనే అనుకోరాదా?

కాని, రుద్రమ ఆక్షణాన అలా అనుకోలేదు. అన్నయ మంత్రిని కారాగారానికి పంపించి, తాను దక్షిణపాండ్యుడు కొప్పెరుంజింగణ్ణి ఎదుర్కొనడానికి తరలి వెళ్ళింది.

* * *

సమరానికి తరలివెళ్ళిన రుద్రమదేవి, విజయలక్ష్మితో చెట్టాపట్టాలు వేసుకొని తిరిగి వచ్చింది కొప్పెరుంజంగడిని హతమార్చి, ఇటు మొగలిచెర్లలో తిరుగుబాటును అణ

# అమిత సౌందర్యము కొరకు

మీ చర్మమును యౌవనంగాను, ఉల్లాసితంగాను—శుభ్రంగాను, మనోహరంగాను ఉంచుకొనుడు. మనోహరమైన సహజ సౌందర్యమును రూఢిగా పొందుడు. "'హేజ్‌లైన్' స్నో" మీ చర్మమును చల్లగాను, కాంతివంతముగాను, సుందరముగా నొనర్చును.

**"'HAZELINE' SNOW"**
(TRADE MARK)

"'హేజ్‌లైన్' స్నో" (ట్రేడ్‌మార్క్)

బర్రోస్ వెల్‌కమ్ & కం. (ఇండియా) ప్రైవేట్ లి. పి. ఓ. బాక్స్ 290, బొంబాయి

ఈ నూతన ఆంధ్రప్రదేశ్
అవతరణ సమయమున అభినందనలతో
మా మొదటి నూతన ప్రచురణములు:

| | |
|---|---|
| స్వయంసిద్ధ | 3-0-0 |
| డిటో 2-వ భాగం | 4-0-0 |
| ప్రియబాంధవి | 3 0.0 |
| బాల్యమిత్రుడు | 1-0-0 |
| ప్రేమచందు కథలు | 1-8-0 |
| సాహసిగోష్ఠి | 1-0.0 |
| గళ్లచీర | 1.0-0 |
| అంతరాత్మ, విశ్వనాథ సత్యనారాయణ | 1-8 0 |

పై పుస్తకములన్నియు ఒకేసారి ఆర్డరిచ్చు
వారికి పోస్టేజి ఉచితము.
కె. యస్. ఆర్. అండ్ సన్సు
బుక్ సెల్లర్సు, విజయవాడ - 2

అకాలనెరసిన జుట్టును అపుడటకు
కాష్మీర్-కుసుం
మీ శ్రేష్ఠమైన సూనెలో నాన్పండి
యునైటెడ్ కెమిస్ట్స్ కాంకెర్న్, బందరు వీధి, మద్రాసు-1. విజయవాడ
చర్మ ఉపద్రవములకు, అపాయములకు
అత్యున్నతమైన సుగంధ ములాము
సాంతలక్సు
గజ్జి, పుండ్లు, కాయులు, మొటిమలు
బ్రాంచిలు. హైదరాబాదు & విజయవాడ.

అన్నిరకములైన కెమేరాలు, ఫిల్ములు
గైరా ఫోటోగ్రఫీ సామానులు సరసమైన
ధరలకు...........
ఫోటో ఆర్టు సెంటర్
(లజ్) మైలాపూర్.

# రుద్రమదేవి

గార్చి మరీవచ్చింది. యుద్ధంలో ఆమె రుద్రమ కాదు; రుద్రదేవుడు...మూర్తీభవించిన రుద్రుడిగా, తేరిచూడరాకుండా పోరు సాగించింది. ఆడది రాజకీయరంగంలో నే కాదు, రణరంగంలోకూడా రాణించగలదని నిరూపించింది.

* * *

ఇంతవరకూ ఆమెకు అన్నయమంత్రి యోగ్యుడా కాడా అన్నవిషయమై తర్కించుకో తీరిక లేకపోయింది. ఇంటికి వచ్చేసరికి తీరికకన్న అవసరమే ఎక్కువగా కనబడింది నమ్మతగ్గవారెవరో తగనివారెవరో కొంచెం స్పష్టంగా తెలిసింది...

అన్నయమంత్రిమీద రాజాపచార నేరారోపణచేసిన జైనులే, ఉత్సవాల పేరిట వయుక్తులువన్ని రాజద్రోహానికి ఒడిగట్టారు. రాజద్రోహిగా కారాగారంలో ఉన్న అన్నయమంత్రి ఆ ప్రమాదాన్ని నివారించాడు.

రుద్రమఅల్లుడు మహాదేవరాజు, నగరంలో వీరులు, సైనికులూ అంతా జైనుల వ్యూహంలోపడి బందీకృతులైపోయారు. వాళ్లని విడిపించే వీరులెవరు? రుద్రమకు కబురంపినా ప్రయోజనం ఉండదు. విడిపించేభారం రాజప్రతినిధిగా ఉన్న రుయ్యమ్మమీదనే ఉంది. రుయ్యమ్మ రుద్రమదేవి పెంపుడుకూతురు. ఆసమయాన ఆమె మహాకవి తిక్కన సోమయాజికి కబురంపి సమాలోచన జరిపింది. కారాగారంలో ఉన్న అన్నయమంత్రికి ఈభారం ఒప్పగించమన్నాడు తిక్కన.

రాజప్రతినిధి రుయ్యమ్మ ఇక సందేహించకుండా సాహసించి, అన్నయను విడిపించింది. తిక్కన్న, తానూకలసి శిక్షణ ఇచ్చినకరణాలే సైనికులుగా అన్నయ జైన వ్యూహాన్ని ఛేదించి రాజబంధువులను చెర విడిపించినాడు.

* * *

ఇంటికిరాగానే రుద్రమ, కొండల్లెవచ్చి మంచల్లె కరిగిన ఈకష్టాన్ని ఈకథ నివిని ఆనందించింది. అంతలోనే కొండవంటి మరోఉత్పాతం వచ్చిపడింది. దేవగిరి యాదవుల సేనావాహిని ఓరుగంటి కోటమీదికి విరుచుకపడుతున్నదట.

అధైర్యంలాగే అలసటనుకూడా ఆమడదూరాన ఉంచుతుంది రుద్రమ. ఈసారి, అన్నయమంత్రి నేర్పినపాఠంతో అవిశ్వసనీయులనుకూడా ఆమడదూరాన ఉంచింది. నిజానికి 'అవిశ్వసనీయుల'లో చాలామంది ప్రముఖులు, హరిహరదేవుడు మొదలైనవాళ్ళంతా చాలా ఆమడలదూరం వెళ్ళి యాదవులతోకలసి తమ 'ఇంటి' మీదికే దండెత్తి వస్తున్నారు.

* * *

ఆ సమరంలో అంబదేవుడు సేనాధిపత్యం వహించాడు. నగరరక్షణను అన్నయమంత్రికి ఒప్పగించి, రుద్రమ తిరిగి కత్తి దూసి యాదవ సేనావాహినిమీదకు విజృంభించింది.

ఆంధ్రుల ప్రతాపాగ్నికి యాదవులు తాళ లేకపోయారు. శలభాలవలె రాలిపోయారు. రాలనివారు కాలికి బుద్ధిచెప్పారు.

ఆడదని, తన శక్తిసామర్థ్యాలు శంకించిన, తనను వంచించ చూచిన పురుషపుంగవులతో విసుగెత్తిన వీరవనిత రుద్రమ, ఈసారితో తనచుట్టపక్కాలకే కాక, చుట్టుపక్కల రాజ్యాలకు కూడా తెలిసేలా తన సామర్థ్యాన్ని చూపి,తనద్వారా స్త్రీజాతి ప్రతిభాజ్యోతిని వెలిగించదలచింది. పారిపోతున్న యాదవులను వారి ఊరి పొలిమేరలవరకూ తరిమి తరిమి కొట్టింది. అక్కడ, వారి తిప్పిదాలకు శిక్షగా, తన శ్రమకు, అయిన ఖర్చులకు కోటి బంగరునాణాలు పరిహారం పుచ్చుకొంది. విజయశంఖం పూరించి కోట కొచ్చింది.

* * *

రుద్రమ, ఓరుగలు సీమనేలిన కాలం అంతా ఇలా పోరాటాలతో, పొరపొచ్చాలతో సాగలేదు. శాంతిభద్రతలు సుస్థిరం కాగానే, ప్రజాహిత కార్యక్రమాలపట్ల ఆమె శ్రద్ధవహించింది. ఎన్నో సత్కార్యాలు చేసింది. ముఖ్యంగా దేశంలో ప్రసూతి సౌకర్యాలకోసం ప్రత్యేకం భవనాలు నెలకొల్పింది. అలా, ఆమె ఒక ప్రసూతి కేంద్రానికి ప్రారంభోత్సవం చేసినటు ఆమె వేసిన శాసనాలలో ఒకటి చెబుతున్నది.



కేశసంపదకు..
రీటా కురుళ్ళకు బలమునిచ్చి, నిగనిగ లాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనవేల వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండే రీటా వాడుడు.
రీటా
హెయిర్ టానిక్





శంఖారావములు, దేశీయ శిల్పకళా చిత్తరువులు, దివ్య జ్యోతుల మెరపులు, యివి అన్నీ నిండునవ్వులతో నిత్యోత్సవాలు జరుపుకొనే ఈ శుభసమయమునకు వెలుగులు దిద్దుతవి మనముకూడా ఈ ఉత్సవాలలో కలిసిపోయి ఆనందిస్తాం!

నూత్న సంవత్సరం, శాంతి భద్రతలనిస్తూ, పారిశ్రామికంగా పురోగమించి, దేశ సౌభాగ్యాన్ని పెంపొందించగలదని ఆశిద్దాం!!



# మహేంద్ర అండ్ మహేంద్ర లిమిటెడ్

బొంబాయి * కలకత్తా * ఢిల్లీ * మద్రాసు

PSMM-696

# ★ ఆంధ్రజాతి జాతకకథ ★

(8-వ పేజీ తరువాయి)

యజ్ఞపశువు దొరుకుతాడేమోనని అన్వేషించసాగాడు.

ఒకచోట అతనికి అజీగర్తుడు అనే ఋషి కనిపించాడు. అతనికి ముగ్గురు కొడుకులున్నారు. పెద్దవాడు శునఃపుచ్ఛుడు. రెండోవాడు శునశ్శేపుడు. మూడోవాడు శునోలాంగూలుడు అజీగర్తుడు కడు పేదవాడు. కుటుంబాన్ని పోషించుకోలేని స్థితిలో ఉన్నాడు. అతనివద్దకు వెళ్ళి రోహితుడు అతని కుమారులలో ఒకణ్ణి తనకు మారుగా యజ్ఞపశువుగా ఇమ్మని అడిగాడు. అజీగర్తుడు, అతనిభార్య అందు కంగీకరించలేదు అప్పుడు శునశ్శేపుడు ముందుకువచ్చి "నేను రెండోవాణ్ణి. పెద్దవాడిమీద తండ్రికి, కడపటివాడిమీద తల్లికి మమకారం ఎక్కువగా ఉంటుంది. నేను మధ్యముణ్ణి కనుక నేను లేకపోయినా నా తల్లిదండ్రులు అంతగా బాధపడరు. కనుక నేను నీమారుగా యజ్ఞ పశువునౌతా" నని అన్నాడు. అజీగర్తుడు నూరుఆవులను తీసుకొని శునశ్శేపుని రోహితుడితో పంపించాడు.

రోహితుడు తండ్రి వద్దకువెళ్ళి "నాకు బదులుగా మరొక యజ్ఞపశువును తీసుకువచ్చాను. యజ్ఞం చెయ్యి" మన్నాడు. హరిశ్చంద్రుడు దానికి ఒప్పుకున్నాడు. బ్రాహ్మణ కుమారుడు యజ్ఞపశువౌతున్నందున వరుణుడుకూడా ఒప్పుకున్నాడు.

శునశ్శేపుని యూపస్తంభానికి కట్టివేశారు అప్పటిదాకా ధైర్యంగా ఉన్నా మరణసమయం ఆసన్నమవుతున్నకొద్దీ శునశ్శేపునికి భయం వేయసాగింది అప్పుడతడు తనను రక్షింపవలసిందిగా వరుణుని వరుణసూక్తాలలో స్తోత్రం చేస్తూ ప్రారంభాడు. వరుణునికి మనసు కరిగింది. శునశ్శేపుని కట్లు విడిపోయాయి. అప్పుడతడు విశ్వామిత్రుని దగ్గరకు వెళ్లాడు. విశ్వామిత్రుడు అతణ్ణి చేరదీశాడు. వేదసూక్తాలతో దేవతలను మెప్పించినందున శునశ్శేపునికి దేవరాతుడనే కొత్తపేరు వచ్చింది.

విశ్వామిత్రుడు శునశ్శేపుని తనతోకూడా తీసుకుపోయాడు. తన నూరుగురు పుత్రులకు పరిచయం చేశాడు. "ఇతడు మహాత్ముడు, పరోపకారార్థము స్వప్రాణములను త్యాగం చేయడానికి సిద్ధమయ్యాడు. మీరితన్ని అన్నగా భావించి పూజించండి," అని పుత్రులను కోరాడు.

విశ్వామిత్రుని కొడుకుల్లో కొందరు దేవరాతుని అన్నగా స్వీకరించడానికి ఒప్పుకోలేదు. తన ఆజ్ఞను వారు మన్నించనందుకు విశ్వామిత్రుడెంతో కోపగించాడు. వారిని నరభక్షకులగుదురుగాక అని శపించాడు.

అలా శప్తులైన వైశ్వామిత్రుల సంతతివారే ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూతిబులుగా ఏర్పడ్డారు.

ఐతరేయబ్రాహ్మణంలో చెప్పబడిన ఈ కథలో విశ్వామిత్ర శాపఘట్టంలో "తస్యహ విశ్వామిత్ర స్యైకశతంపుత్రా ఆసుఃపంచాశదేవజ్యాయాంసోమధుఛందసః పంచాశత్కనీయాంసస్తద్యే జ్యాయాంసో న తేకుశలం మేనిరే తాననువ్యాజహారాంతాన్వః ప్రజా భక్షీష్టేతి త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా..."

అని ఆంధ్రుల ప్రసక్తి ఉన్నది.

ఈ కథలో ఆంధ్రులు తండ్రిమాటను తిరస్కరించిన వాని సంతానమనడం, వారు నరభక్షక జాతి వారవడం గౌరవప్రదంగా లేదు.

ఆంధ్రులు నరభక్షణ చేసే వారని చరిత్రలో ఎక్కడా దృష్టాంతం లేదు. పైగా అత్యంత నాగరికులై మహాసామ్రాజ్యాలు స్థాపించిన వారని, అతిసాధుశీలమైన బౌద్ధధర్మాన్ని ఆదరించారనీ, గొప్ప శిల్ప, చిత్రలేఖన కళలను పోషించారనీ, ఖండఖండాంతరాలకు తమ నాగరికతను వ్యాపింపజేశారనీ చరిత్ర చెబుతోంది. కనుక విశ్వామిత్రుడు కోపంలో అన్నమాటలు నిజంకావడంమాత్రం కాదని మనం అర్థం చేసుకోవలసి ఉంటుంది. కాకపోతే విశ్వామిత్ర సంతతివారు గనుక ఆయనకు ఉన్న సహజావేశంలో ఒక్కపాలు ఆంధ్రులకు కూడా సంక్రమించి ఉండవచ్చు. ★


ప్రభూ! దివ్యతేజోమయా! నీ
పవిత్ర కాంతి కిరణ ప్రసారముచే
దురంత విషాదాంధ తమస్సులో
దురపిల్లెడి నికృష్ట మానవ హృదయాలను వెలిగించి
భయ సందేహాలను, ద్వేషదౌష్ట్యాలను పారద్రోలి
పావన శాంతి, సత్య, సౌఖ్యమార్గాన్ని చూపించుచు
పరిశుద్ధమైన జీవనాన్ని గడపాలంటే,
పరిశుద్ధమైన ఆహారం మానవులకు ముఖ్యావశ్యకం -
పరిశుద్ధమైన ఆహారం అంటే, శుచీ
శుభ్రత లేగాక, రుచి, హితకరమైన సువాసనలతో
కూడుకొని ఉండాలి -
అట్టి రుచికరమైన, హితకరమైన ఆహారపదార్థములకు
60 ఏళ్లగ ప్రసిద్ధి చెందిన

ఎల్. జీ. (L. G.) ఇంగువనే వాడండి

నాణ్యమునకు, సరసమైన ధరకు ప్రఖ్యాతి చెందినది
ప్రతిచోటా దొరకును

లాల్ జీ గోధు అండ్ కో,

సౌకార్ పేట మద్రాసు-1.

హెడ్డాఫీసు: బొంబాయి.



పాండురంగ మాహాత్మ్యము

శ్రీ కృష్ణదేవరాయ సభాలంకారులైన తెనాలి రామకృష్ణ మహాకవిచే రచియింపబడినది, విలసిల్లు "పాండురంగ మహాత్మ్యము" అనబడు పద్యకావ్యము లఘుటీకతో రాయలుసైజున ముద్రితమైనది
వెల రు 4 8 0

పరమానంద గురుశిష్యుల కథలు

సులభశైలిలో బాలురకు, వృద్ధులకు కడుపుబ్బించు కథాసంగ్రహము. వెల రు 0 12 0

స్వరచింతామణి (స్వరశాస్త్రము)

అను నామాంతరముగల యోగశాస్త్రము ఆంధ్ర తాత్పర్యసహితము సర్వశాస్త్రము. అనేకమైన అపూర్వ విషయములు కలవు
రు 1 12 0

ఆంధ్రప్రదేశ్ :— ఆంధ్ర దేశ పూర్వచరిత్ర 1850 నుండి 1956 వరకు క్లుప్తముగా సులభశైలిలో బాలురకు, పెద్దలకు దెలియునట్లు నాయకులబొమ్మలతో వ్రాయబడినది. రు 0 8 0

ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్,
వేపేరి, మద్రాసు - 7.



దీపావళి సౌభాగ్య శ్రేణిలో



తార!

మీ కేశములను అందముతో
పెంపొందించుటకు—దీనిని వాడుడు

# కేస్టరోమా

కేశములకు
మాతన పరిమళద్రవ్యము

**ఉచితము** 1 కొన్ని కేస్టరోమా తయారు సైజు (మాదిరి) సీసా ఉచితముగా పొం దుటకు, 3 అణాల పోస్టు బిళ్ళలు పంపుచూ మీ పేరు పూర్తి విలాసము కోవహా బీపిల్, పోస్టు బాక్సు 1611, బొంబాయి 1, కి వ్రాయుడు.

డిస్ట్రిబ్యూటరు: మెసర్సు జి. కె. నాగనాథన్, కర్నూలు
,, శ్రీ వెంకటేశ్వర ట్రేడింగ్ కంపెనీ, రాజమండ్రి.
,, శ్రీ శంకర్ జనరల్ స్టోర్సు, శ్రీకాకుళం.

# ★ అక్కన్న - మాదన్న ★

(16 వ పేజీ తరువాయి)

వచ్చాయి. మాదన్నగారు, కానీ చేత కబురంపలేదు. అలాగని, పొదిలి లింగప్పని పంపించలేదు; వెల ఇచ్చి కొంటాం, వీసెడు బంగారపుగొలుసులు పంపించమని మామూలుగా కబురంపారు. కంపెనీవారు ఎగిరి గంతేసి, అవి తెచ్చిదఖలు పరిచారుగాని, మూల్యం మాత్రం ససేమిరా ముట్టమన్నారు 1683 జనవరి 1న ఇంగ్లీషు సంవత్సరాది పేరు చెప్పి నాలుగు వందల వరహాలు కానుక పంపారు.

ఆనాడు, అవసరమున్న ఆంగ్లేయులే కాదు ; సర్వసర్వత్రా ఆబాలగోపాలం అక్కన్న మాదన్న మంత్రిద్వయాన్ని గౌరవించేవారు. పూజించేవారు. అభిమానించేవారు. అందరికన్నా ఎక్కువగా వారిపట్ల ప్రగాఢ విశ్వాసమూ, అంతటి అభిమానమూ గల వాడు తానీషా. (మంచిరాజు అని అర్థం.) ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుబడి సాగిస్తున్న ఈ సోదరద్వయం మహామంత్రి మాదన్న, శాహాలష్కర్ (సేనాధిపతి) అక్కన్నలను చూచి కన్నెర్ర అయినవారు, శతవిధాల తానీషాతో వారిమీద పితూరీలు చెప్పి, మనసు విరువచూచారు. కాని విఫలురయ్యారు. అంతటి సుదృఢస్నేహబంధం వారిది.

ఈ అక్కన్న మాదన్నలు నిజంగా అన్నతమ్ములు కారని ఒక కథ...

మాదన్న గారింట అతిథులూ, ఆ అతిథులకు అతిథులూ కూడా దిగి, ఉన్నవాళ్లు ఉండి వెళ్ళేవారు. వచ్చేపోయేవారితో, నిత్యం వేసేవి స్తరీ తీసేవి స్తరీగా, నిత్యకల్యాణం పచ్చతోరణంగా కలకలలాడేది వారి గృహం. ఒకరోజున ఒకాయన చనువుగా వచ్చాడు. ఆ వచ్చినవాడు పది రోజులు అయినా అలాగే ఉండేసరికి అంతా, అతణ్ణి ఈ ఇంటివారి బంధువనుకున్నారు. మాదన్నగారు తనభార్యవైపు చుట్టమనుకున్నారు. పదిరోజుల ముఖపరిచయాన్ని పురస్కరించుకొని, ఆయన తనకన్న పెద్దవాడుగదా అని, మాదన్నగారాయన్ను అన్నగారూ అని పిలచేవారు. అదిచూచి, భర్తకు వేలువిడచిన చుట్టంకాబోలని మాదన్న పంతులుగారి భార్య అనుకుంది. ఇలా కొన్నాళ్ళయ్యాక, భార్యాభర్తలొకనాడు ముచ్చట్లాడుకొంటూఉండగా అక్కన్నగారివిషయం ప్రస్తావనకు వచ్చింది. అక్కడితోనే అసలుసంగతి తేలిపోయింది ఇదేదో కనుక్కోవాలని కుతూహలం కలిగింది మాదన్న గారికి.

"మీరు మా కేమవుతారన్న గారూ" అన్నారు మాదన్నగారు.

"మీ రన్నదే అన్నగారే కాక," అన్నారక్కన్నగారు.

"నా ఎరికన, నాకు అన్నలెవరూ ఉన్నట్టు లేదే..."

"నా ఎరికన ఉన్నారులెండి... మీరూ నేను పెత్తల్లి పింతల్లి బిడ్డలం. మా అమ్మ జ్యేష్ఠాదేవి; మీ తల్లి కనిష్ఠాదేవిని (లక్ష్మి)" అన్నారు అక్కన్న గారు నవ్వుతూ.

ఇది కేవలం కథే అని భావించవచ్చు.

అక్కన్న, మాదన్నలు నిజంగా సహోదరులే. వీరింటి పేరు పింగళివారు. భారద్వాజ గోత్రము. వీరి తండ్రి భానోజీగారు. తల్లి భాగ్యమ్మ. కవి, పింగళిసూరన గౌతమ గోత్రీకుడు అయినందువల్ల ఇంటిపేరునుబట్టి వారు వీరు బంధువులని చెప్పలేము.

ఇటు కళింగంనుండి అటు పుదుచ్చేరి వరకూ వ్యాపించిన గోల్కొండ రాజ్యాన్ని 29 ఏళ్లు (1658 నుండి 1687 వరకూ) పాలించిన తానీషా అబూహసన్ కుతుబ్ శాహీ దగ్గర మాదన్నగారు ప్రధాన మంత్రిగాను, అక్కన శాహాలష్కర్ గాను కొలువు చేశారు. అయితే, అక్కన్న సేనాని అయినది 1682 లో నని, తానీషా అప్పట్లో సేనానిగా ఉన్న మహమద్ ఇబ్రహీంను తొలగించి వీరికిపదవి నిచ్చారని చారిత్రకాధారాలవల్ల తెలుస్తున్నది.

మాదన్నగారు ఆనాడు అత్యంత సామర్థ్యంతో, దక్షతతో గోల్కొండ రాజ్యరథాన్ని నిరాఘాటంగా నడపారు. ఔరంగజేబుకు అందకుండా ఉండాలన్న సంకల్పంతో, ఈయన తానీషాకు, శివాజీకి స్నేహం కలిపారు. శివాజీ మరణానంతరం, ఈ మైత్రి చెడకుండా, శివాజీ కుమారుడు సంభాజీతో కూడా మైత్రి కుదిర్చారు.

మహారాష్ట్రులతోనే నెగ్గుకు రాలేక తిప్పలు పడుతున్న ఔరంగజేబు ఈ మైత్రి చూచి మండిపడి అనేకసారు గోల్కొండ పైకి దండెత్తి వచ్చాడు. మహామంత్రి మాదన్న, శాహాలష్కర్ అక్కన్న గోల్కొండ కోటలో ఉన్నన్నాళ్లు గోల్కొండకు ఢోకాలేక పోయింది.

కాని, లోలోపల కుట్రలు సాగాయి. సేనానిగా పదవీచ్యుతుడైన మహమద్ ఇబ్రహీం అక్కన్నమీద పగపట్టాడు. తోటి తురుష్కులలో దుష్ప్రచారం చేసి, బలం కూడదీయసాగాడు.

ఈ ప్రచారం, రాజుపై కొత్తగా బయల్దేరుతున్న వత్తిడీ గమనించి అక్కన్న మాదన్నలు తామే తానీషాకు నచ్చచెప్పి ఆ కోటనుండి సెలవు తీసుకున్నారు.

ఇటు ఔరంగజేబుకూడా ఈ "శత్రుని శత్రుడు" ఇబ్రహీం పట్టినపగను సద్వినియోగం చేసుకున్నాడు. అతడూ కొంత దుష్ప్రచారం చేశాడు. సమయం రాగానే, గోల్కొండ తానీషా, కాఫర్లను మంత్రులుగా పెట్టుకున్నాడనీ, మహమ్మదీయ మత సిద్ధాంతాలను అతిక్రమించాడని సాకులు చూపి, దండెత్తాడు.

చివరకు గోల్కొండ సేనను నడిపినవాడు మహమద్ ఇబ్రహీమే. అతడు, అదను చూచి, స్వామిద్రోహానికి ఒడిగట్టి, ఔరంగజేబ్ సేనలో చేరిపోయాడు తన దండుతో.

తానీషా ఓడిపోయాడు. ఓడినట్లు ఒప్పుకున్నాడు. ఒప్పుకున్నట్లు ఔరంగజేబుకు పత్రం వ్రాసి ఇచ్చాడు.

ఆనాడు అక్కన్న మాదన్నలు అక్కడ లేరు.

కొద్దిరోజులతరువాత వారసలు లోకంలోనే లేరు. తానీషా ఓటమితో చెలరేగిన అల్లర్లను అదనుపెట్టుకొని, అక్కన్న మాదన్నల శత్రువులు, వారినికూడా హత్యచేశారు.

★




బ్రాంచీలు: హైదరాబాదు, విజయవాడ.

**END GREY HAIR**

రంగులనుచూచి మోసపోవద్దు. అది తాత్కాలికము మా సువాసనగల "హిమ కల్యాణ్ ఆయిల్" అనేక వనమూలికలతో ఆయుర్వేద పద్ధతిలో తయారైనది 60 సం॥ల వయస్సువరకు వెండ్రుకలను నల్లగా వుంచును. ఇదిగాక మెదడుకు బలవనిచ్చును. ఉన్మాదము, తలనొప్పి వగైరా జబ్బులు రానీయదు. జ్ఞాపక శక్తిని కంటిచూపును వృద్ధిచేయును. కొద్దిగా నెరసివుంటే ఒక సీసా రు 3-8-0. 3 సీసాలు రు. 9-0-0 సగము నెరసివుంటే ఒక సీసా రు. 5-0-0. 3 సీసాలు రు. 12/- పూర్తిగ నెరసివుంటే ఒకసీసా రు. 7/-లు 3 సీసాలు రు. 18/-లు

కోరినవారికి పూచీ యిచ్చెదము.

Sri Kalyan Aushadhalya

(A. P.) POKORARI (Patna)

# ★ బహువ్రీహి ★

(14 వ పేజీ తరువాయి)

తైనారా లాగిపోయాయి. కాని స్కంధావారంలో అక్కడక్కడ వేటకుక్కల అరుపులు, పరిచారకు లటూ ఇటూ మసులుతున్న సందడి మాత్రం మందగించలేదు.

ప్రతాపరుద్ర మహారాజు మేలుకొని స్వయంభూ దేవస్థలి పరిసరాలు నెమ్మదిగా నాలుగువైపులా పరికించి చూచాడు. శయ్యాగార ద్వారంలో పరిచారకులు దోసిలులొగ్గి నిలుచున్నారు. తిరిగి స్కంధావారం కొంతవరకు సద్దుమణిగింది.

అంతలో మేఘ గంభీర స్వరంతో ఒక శ్లోకం వినిపించింది. ఒకే గంభీరస్వరంతో వినిపించినా ఆ స్వరంలో రెండు గొంతులు ఏకీభవించినట్లు స్ఫురించింది. మొట్టమొదటగా ప్రతాపరుద్రదేవుని కా శ్లోకం స్పష్టంగా వినిపించలేదు: కాని అదే శ్లోకం మళ్ళీ మళ్ళీ మారుమోగింది: దానితో అది సుస్పష్టంగా అతని శ్రుతి కుహరంలో ప్రతిధ్వనించింది.

"సకలతు ధనుర్ధ రాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే
అభవత్పర మగ్రహార పీడా—"

"సకలతు ధనుర్ధరులకు అధినాయకు డైనటువంటి వీరప్రతాపరుద్రదేవ మహీపతి పృథివీ పరిపాలన చేస్తూ ఉండగానే, అగ్రహారాలకు పల్లమాలిన పీడ కలిగింది"

అదీ ఆ శ్లోక తాత్పర్యం! ఆ శ్లోకం విని వినగానే మహారాజు నిలువునా నీరయిపోయాడు! తన ధర్మపరిపాలనలోనే అగ్రహార పీడా? బ్రాహ్మణాగ్రహారాల కనేక మాన్యాలిచ్చి విద్వత్పోషకుడని బిరుదు వహించిన తన రాజ్యంలోనే అగ్రహార పీడా? ఇదేమిటీ దురన్యాయం?

అని మహారాజెంతో విచారించాడు. తన దండనాయకులవలనో లేక ఇంకా ఇతర అధికారులవల్లనో విశ్వేశ్వరాగ్రహారీకుల కెవరికో ఏదో అన్యాయం జరిగి ఉండవచ్చుననీ, అందువలనే వారెవరో ఆవిధంగా ఆక్రోశిస్తూ ఉండవచ్చునని అనుకొన్నాడు. వెంటనే నిలుచున్న పాటుగా బేతాళ నాయనింగారిని పిలిపించవలసిందని ఆజ్ఞాపించాడు. బేతాళనాయ డక్కడికివచ్చి చేతులు జోడించి సవినయంగా ప్రతాపరుద్రుని కెదుట నిల్చున్నాడు. మహారాజు వెంటనే ఆమొర విషయం విచారించవలసిందనీ ఆ మొరపెట్టేవారిని తన ఎదట నిలబెట్టవలసిందనీ ఆజ్ఞాపించాడు. సరిగా అదే సమయంలో మళ్ళీ ఆ ఆక్రోశం వినబడింది. వెంటనే బేతాళనాయకు డక్కడినుంచి నిష్క్రమించాడు.

మహారాజు తిరిగీ కొంతసేపు విశ్రమించాడు. తెల్లవారేసరికి స్కంధావారంలో ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన కొలువుకూటంలో క్రమంగా బేతాళనాయకుడు, అతని వెనక వెనక ఒదిగిపోతూ చేతులు కట్టుకుని నిలబడిన సోమయాజులు ప్రవేశించారు మరికొంత సేపటికి విద్యానాథుడు కూడా శిష్యుడు భీమేశ్వర శర్మను వెంటబెట్టుకుని అక్కడికి వచ్చాడు.

ప్రతాపరుద్రు డక్కడికి విచ్చేయడంతో అందరు సవినయంగా తలలు వంచి ప్రత్యుత్థాన మర్యాదలు నడిపించారు. మహారాజొక సుఖాసనం మీద కూర్చుంది కొంచెం విశ్రమించినతరవాత బేతాళ నాయకుడు సవినయంగా విజ్ఞప్తి చేశాడు:

"ఏలినవారి కేవిధంగా మనస్తాపం కలిగించినవార మైనామే అని మేమంతా చాలా నొచ్చుకొంటున్నాము. ఇంతకీ ఏమి జరిగిందంటే త్రిలింగదేశం అంతటా పేరుపోసిన విద్యానాథ విద్వాంసులు తమ దర్శనార్థమై విచ్చేసినప్పుడు మన అగ్రహారం కరణం సోమయాజులు వారి విద్వత్తు ఎంతటిదో తెలుసుకోలేక వారిని కొంచెం కించపరిచారట. కావడానికది గొప్ప విద్వదపచారమే! అయితే కవిలె కట్టలు కట్టుకుని కరణాలకు




దీపావళి పండుగకు
శృంగారవంతంగా
తయారగుటకు

దీపావళి రోజున హిందూ దేశమంతయు భాగ్యదేవతయగు శ్రీ మహాలక్ష్మిని పూజయొనర్ప యుత్సాహించుచుందురు.

ఆ సమయములో మీ ఆలోచనలు, ఊహాలు ప్రకాశవంతముగానూ, అందముగాను నుండుటలో ఆశ్చర్యమేమియు లేదు. అటులనే మీ దృష్టి ఆఫ్గన్ స్నో మీదకు పోవుటలో అది ఆశ్చర్యము కానేరదు మీరు కలిగియున్న అందమును పెంపొందించుటలో మీకు నిజము చూపించగలదు.

ఆఫ్గన్ స్నో అందానికి సాధనాలు

తయారు చేయువారు:

ఇ. ఎస్. పటన్‌వాలా,
బొంబాయి - 27.







EXPRESS ADVT.

E S P. D. 1956

విద్వత్తుగొడవలేం తెలుస్తాయి? తమరికి శ్రమ కలిగించవలసి వస్తుందనే భయంచేతనే అమాత్యులా విధంగా చేశారట! అపరాధం మన్నించవలసిందని వారు విన్నవించుకొంటున్నారు." అని భేతాళనాయకుడు సోమయామాత్యుణ్ని సమర్థించినట్లుగా సమర్థించాడు.

మహారాజు దృష్టి అలవోకగా ఒకసారి సోమయామాత్యుని వైపు తిరిగింది. అమాత్యుడు తల వంచుకున్నాడు.

"మహాప్రభూ! వారి విద్వత్తెంతటిదో తెలియక నేను వారియెడల అపచారం చేసినమాట నిజమే! అయితే వినోద సమయంలో తమ కనవసరంగా శ్రమ కలుగుతుందనే సంకోచం వల్ల నేనలా వ్యవహరించాను."

విద్యానాథుడింకా ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నాడు బేతాళనాయకుడు నిందంతా నెమ్మదిగా తనమీద తోసివేస్తున్నాడని ఆక్షేపించుకున్నాడు. ప్రతాపరుద్రుని వైపు తిరిగి ఏదో విన్నవించబోయాడు. అది కనిపెట్టి బేతాళనాయకుడడ్డు పడ్డాడు:

"మన సోమయామాత్యులేదో తెలియక తప్పు చేశారనే అనుకుందాము అయితే విద్యానాథ విద్వాంసులంతటి వారు తొందరపడి తమ ధర్మపరిపాలన కంతటికీ కళంకం ఆపాదిస్తూ అవిధంగా — విద్యలోకంలో శాశ్వతంగా నిలిచిపోయే శ్లోకం రచించడం మాత్రం భావ్యంకాదేమో అనిపించింది. ఆపైన తమచిత్తం!"

అని అతి వినయంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు. దానితో విద్యానాథుని కిక నోరు తిరగలేదు. రామయామాత్యుడు, బేతాళనాయుడు కలిసి చివరికింతా తన మీదికి తీసుకువచ్చారని గ్రహించుకొన్నాడు. దర్శనం ఇప్పించకపోవడం అపరాధమే అని వారంతటవారే అంగీకరించినప్పుడిక ప్రత్యేకంగా వారిని నిందించవలసింది ఏమి ఉంది? ఒక్క నిముషం ఆలోచించి అతి గంభీరంగా ఒక చిరునవ్వు నవ్వాడు:

"మహాప్రభూ! ఎంత శ్రమపడినా తమ దర్శనం కాలేదే అనే కించకొద్దీ తెల్లవారుఝామున నేను, నా శిష్యుడు కలిసి ఆ శ్లోకం అంత గంభీరంగా పఠించాము. అయితే అదంతా అసంపూర్తి శ్లోకమే! శ్లోకం అంతా పూర్తిగా చదివితే దానిలో తమ కీర్తి ప్రశంసే గాని అపకీర్తి ప్రస్తావనే లేదు! బేతాళనాయునిగారనవసరంగా నామీద నిందమోపుతున్నారు! అంతే!"

"అయితే ఆ శ్లోకంలో అగ్రహార ప్రస్తావనే లేదా?"


## కాన్వాసర్లు కావలెను

నెల 1 కి రు 100 నుండి 300 వరకు తీరిక కాలములో పెట్టుబడి పెట్టనక్కరలేకుండా సంపాదించండి. వివరాలు ఉచితము.

GIRSON KNITTING WORKS,
LUDHIANA (31).

## నారసింహ లేహ్యము

బంగారుతో చేరినది. మేహము రక్తాశ, విస్ఫుత్తువ వగైరా హరించి బలము రక్తవృద్ధి కల్గించును. 20తు. డబ్బీ రూ, 3-4-0 పోస్టేజి అ 1-1-0

పి. సి. ఏ అండ్ కో, (ఆయుర్వేద సమాజం) పెరిదేపి (పోను) — నెల్లూరుజిల్లా.

## MONEY'S DICTONARY

(English-English-Telugu)
BIGSIZE
20,000 పదములు!
424 పేజీలు!!
వెల రు. 8/4/-
పోస్టేజి రు. 1/2/
A. S. MONEY & Co.,
14, Sambier st, MADRAS-1.

## గెలవండి 32,000 గెలవండి

రిజిష్టర్డు నెం 1692

పోటి నెం. S A

మా సీల్డు అఫిషియల్ కి సొల్యూషన్ ప్రిమియర్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు వారివద్ద ఉన్నది. వారి అధికారముతో అది ప్రకటించబడును. ప్రథమ బహుమతి ఆల్ కరెక్టు రు. 18,000. రెండవ బహుమతి మొదటి రెండు లైనులు కరెక్టు రు. 6,000 మూడవ బహుమతి మొదటి ఒక లైన్ కరెక్టు రు. 4,000. నాలుగవ బహుమతి మొదటి రెండు నెంబర్లు కరెక్టు రు. 2,500 (మాకీ సొల్యూషన్ ప్రకారం నిలువుగా, అడ్డంగా వుండవలెను.) ఎక్కువ ఎంట్రీలు పంపినవారికి రు. 1,500 ప్రత్యేక బహుమానము. ఆల్ కరెక్టుగా పంపినవారికి 5 వి. జి. ఇ. సి. రేడియో నెం. బి. సి. 5149. అదనపు బహుమానము. Key S. No. G. (పూర్తిగా ఆల్ కరెక్ట్ పంపినవారు ఒక్కరికన్న యెక్కువగా నున్నచో బహుమానపు విలువ సమానముగ పంచబడును.

| | | | |
|---|---|---|---|
| | | | |
| | | | |
| | | | |
| | | | |

| 42 | | | |
|---|---|---|---|
| 10 | 11 | 17 | 4 |
| 5 | 10 | 14 | 7 |
| 12 | 9 | 3 | 18 |
| 15 | 6 | 8 | 13 |

50

**ఆఖరు తేది 9-11-56 ఫలితములు 15-11-56**

ప్రవేశ రుసుము: ఒక ఎంట్రీకి రు. 1/-; 4 ఎంట్రీలకు రు 3/-; 16 ఎంట్రీలకు రు. 10/- 50 ఎంట్రీలకు రు. 25/-; 100 ఎంట్రీలకు రు 41/.

సాల్వు చేయవలసిన విధానము:-ఈ చదరములో 5 నుండి 20 వరకు గల అంకెలు నిలువునా అడ్డముగా మూలగా ఎటు కూడినా 50 వచ్చేట్లు వేయాలి ఒక అంకె ఒకమారే వాడాలి. సాదా కాగితముమీద ఎన్ని ఎంట్రీలైనా పంపవచ్చును. ప్రతి ఎంట్రీకింద, పంపేవారి పేరు అడ్రసు అంకెలు స్పష్టంగా పెద్ద అక్షరాలతో ఇంగ్లీషులో వ్రాయాలి. సొమ్ము ఇండియన్ పోస్టల్ ఆర్డర్లుగా, లేక మనియార్డర్లుగా పంపాలి. మనియార్డరు రశీదులు ఎంట్రీల వెంట పంపవలెను. ప్రతి మనియార్డరు ఫారమునకు జతపరచు కూపనులో సొమ్ము పంపువారు తన పేరు, అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను. "వసూలును బట్టి బహుమతుల సొమ్ము మారుచుండును." మేనేజరు తీర్మానము ఆఖరు, కట్టుబడ్డ మైనది. 0-4-0 పోస్టు స్టాంపులు. పంపినచో పోస్టులో ఫలితముల లిస్టు పంపబడును. మా ప్రత్యేకరూల్సు, షరతులు బాగా తెలిసినవారేపోటిలో పాల్గొనాలి. ఎంట్రీలు పంపవలసిన అడ్రసు:-

STAR Syndicate, 8-A, Savarimuthu Street, Madras-1.

 బహుమతి 

అన్నాడు మహారాజెంతో ఆశ్చర్యపడి.

"ఇదిగో! ఆ శ్లోకం అంతా చదువుతున్నాను. ఆలకించండి!"

అని విద్యానాథుడా శ్లోకం అంతా పూర్తిగా చదివాడు:

"నవలక్ష ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే
అభవత్పర మగ్రహార పీడా
కుచకుంభేషు కురంగలోచనానామ్"

ఆఖరి పాదం చేర్చి చదవడంతో ఆ శ్లోకం అర్థం అంతా తారుమారైపోయింది.

"వీరప్రతాపరుద్ర మహీపతి పృథివి పరిపాలిస్తూండగా కురంగలోచనలైన అంగనల కుచకుంభములమీది అగ్ర-హారాలకు - అంటే ముందున్న ముత్యాల హారాలకు - పీడనం కలిగింది."

అని మాత్రమే అర్థం వచ్చింది. ఆ చమత్కారం గ్రహించినమహారాజు విద్యానాథుని కవితాశక్తి కొనియాడి అతన్ని అనేకవిధాల ప్రశంసించాడు. చివరికి బేతాళనాయనికీ, రామయామాత్యునికీ కూడా ఆ కొత్త అర్థం బాగున్నదనక తప్పలేదు. ఇక చేసేదేమీలేక వారుకూడా విద్యానాథుని పాండిత్యప్రశంస ప్రారంభించారు. మహారాజు విద్యానాథునికింకా ఎన్నో బహూకృతు లందించాడు: "విద్యానాథ విద్వాంసునకు విశ్వేశ్వరాగ్రహారంలో సస్యశ్యామలమైన పదిపుట్లు సుక్షేత్ర ఖండిక సర్వకర పరిహారంగా ధారాదత్తం చెయ్యవలెనని నిశ్చయించాము." అని బేతాళనాయనివైపు చూచాడు. బేతాళనాయడు సోమయామాత్యునివైపు చూచాడు. సోమయామాత్యుడు తడుముకోకుండా వెంటనే సమాధానం చెప్పాడు.

"మహాప్రభూ! అగ్రహారంలో మన తటాకోత్తర భాగంలో ఉండుకున్న పది పుట్లుభూమి సాక్షాత్తు బంగారంపండే సుక్షేత్ర ఖండిక! అన్నాడు.

"అయితే రేపుదయం అదేవారికి ధారాదత్తం చేస్తున్నాము."

అని మహారాజు విద్యానాథునికెంతో ఆదరంగా వీడ్కోలిచ్చి పంపించివేశాడు. ఆసమయంలో బేతాళనాయడు, సోమయామాత్యుడు ఒకరి మొహం లొకరు చూచుకుని చిరునవ్వులు నవ్వుకున్నారు. ఆ మరునాటి ఉదయమే ప్రతాపరుద్రుడు విద్యానాథునికాభూమి అంతా ధారాదత్తంచేసి వేట బలగంతో సహా గోదావరిదాటి వెళ్ళిపోయాడు.



మహారాజు చేసిన ఆ అఖండ సత్కారానికి విద్యానాథుడెంతో ఆనందించాడు. "త్రిలింగ ప్రభువుల విద్యాదరణ ఈనాటిదా!" అని కాకతీయ మహారాజుల వదాన్యత ఆకాశానికి ఎత్తివేశాడు.

మహారాజు గోదావరిదాటి వెళ్ళిపోయిన మరునాడు తనకు ధారాదత్తంచేసిన సుక్షేత్ర ఖండిక అంతా ఒక్కసారి కళ్ళారాచూచుకోవాలని ఉబలాటపడ్డాడు. శిష్యుడు భీమేశ్వర శర్మతో కలిసి అక్కడికి వెళ్లాడు.

అది ఆకాశమంత చెరువు అప్పుడప్పుడే వికసించిన తామరపూవులతో కలకలలాడుతూ వేయి చేతులతో అతనిని ఆహ్వానిస్తున్నట్లు కనిపించింది.

విద్యానాథుడు ఎంతో సంతోషంతో చెరువుగట్టెక్కి దానికి ఉత్తరదిక్కుగా ఉన్న తన భూభాగంఅంతా జాగ్రత్తగా పరిశీలించిచూచాడు. ఆ ప్రదేశం అంతా చూడగానే అతని నవనాడులూ కుంగిపోయాయి! అతనికెదురుగా కనిపించిన పదిపుట్లభూమి చాలాభాగం పట్టి చవిటిపఱ్ఱ!

అది చూడగానే అతనికి సోమయామాత్యుడు చేసినద్రోహం అంతా కళ్ళకుకట్టినట్టెదురుగా ప్రత్యక్షమైంది! ఎక్కడో రెండు మూడెకరాలలో మాత్రం కొంచెం మెట్టవ్యవసాయం సాగుతూంది. అంతే! మళ్ళీ దక్షిణంగా తిరిగిచూచాడు.

తటాకానికి దక్షిణదిశగా కనిపించిన పదిపుట్లభూమి నిజంగా బంగారుపండే సుక్షేత్రఖండికే! ఆభూమిచూడగానే విద్యానాథుని కళ్ళల్లో వేడికన్నీరంతా ఆవిరిగా మారిపోయింది.

"రామయామాత్యుడు నాకొంపనిలువునా తవ్వేశాడు! అలాంటి గోముఖవ్యాఘ్రంతో పెట్టుకున్న బలవద్విరోధంవల్లే నా కింతటి దుర్గతి పట్టింది."

అది అలాగ కుమిలిపోతున్న విద్యానాథుని కిక కాళ్ళాడలేదు. అయినా భీమేశ్వరశర్మను వెంటబెట్టుకుని సోమయామాత్యుని దగ్గిరికి వెళ్ళిపోయాడు. అమాత్యుడతని నెంతో ఆప్యాయంగా గౌరవించాడు. ఎక్కడా చెక్కుచెదర లేదు!

"మీ వంటి మహావిద్వాంసులకు నేమేమనిమనవి చెయ్యగలం! ఇదిగో మహారాజానుమతితో బేతాళనాయనింగారు స్వయంగా చెక్కించిన తామ్రశాసనం! చిత్తగించండి! దీనిలో తటాకోత్తర ఖండములో ఉండుకున్న పదిపుట్ల భూమి మీకు ధారాదత్తం చేసినట్లుంది ఇది స్వయంగా మహారాజే వేయించిన తామ్రశాసనం! దీనిలో మా ప్రమేయం ఏమి ఉంది?"

ఆ మాటలతో విద్యానాథుని తల కొట్టివేసినట్లయింది. కాని ఆ తామ్రశాసనం చూచిన క్షణంలో అతని కేదో స్ఫురించింది. వెంటనే భీమేశ్వరశర్మను వెంటబెట్టుకొని తటాకానికి దక్షిణంగా ఉన్న భూభాగంలోకి వెళ్ళి అక్కడి పాలికాపులతో ఆ భాగంలో పదిపుట్ల భూమి మహారాజు స్వయంగా తనకు ధారాదత్తం చేశారని ఇక వారంతా తనకే పాలికాపులుగా వ్యవహరించాలని ఆజ్ఞాపించాడు.

వారంతా మహారాజు సత్కారకథ విన్నారు. అందుచేత వెంటనే సరేనని అంగీకరించారు. ఆవిషయం చల్లచల్లగా సోమయామాత్యుని చెవిలో పడింది.

అది వినీవినగానే అతడు విద్యానాథుని దగిరకు వచ్చాడు. లేని దురహంకారం తెచ్చిపెట్టుకుని విద్యానాథుణ్ణి బెదిరించాడు:

"మీకు ధారాదత్తంచేసినది ఉత్తరఖండం గాని దక్షిణఖండం కానేకాదు! మీరు చేసింది క్షేత్రం దురాక్రమణం! వెంటనే అక్కడినించి తొలగకపోతే ఈ వ్యవహారం


# ఋతుక్రమం ఆలస్యమైతే

విచారపడవద్దు పేరొందిన దేవి పిల్సు వాడండి. ఇండియాలోను, విదేశాలలోను ఈ పిల్సు వాడిన వారు అయాచితంగా అనేక యోగ్యతా పత్రములను పంపియున్నారు. సూచనలు: "దేవిపిల్సు", ముఖ్యంగా ఆలస్యమైనా, క్రమంగా రాకపోయినా, బాధతోకూడిన, లేక ఆగిపోయిన బహిష్టు మరియు అమెనోరియా, డిస్మెనోరియా, ల్యుకోరియా మొదలైన అన్నిటికి దేవీపిల్సు బాగుగా గుణం ఇచ్చును ఖరీదు: పూర్తి కోర్సు 28 బిళ్ళలు రు. 11/-సగం కోర్సు 14 మాత్రలు రు. 6-8-0 (వి. పి. పి. అదనం) ప్రతిచోటా దొరకును.




సీనుఅండ్‌కంపెనీ, 28 K. తాండవరాయ గ్రామణివీధి, తండయార్ పేట, మద్రాస్-21

(Advt Permitted under G. O. Ms No 1121, Health.)

యావత్తూ మళ్ళీ మహారాజులుంగారిదాకా వెళ్ళిపోతుంది జాగ్రత్త!"

విద్యానాథుడు మండిపడ్డాడు

"నీ దిక్కున్నచోట చెప్పుకో! నేను చేసింది దురాక్రమణం కానేకాదు! నీవు చేసిన ద్రోహానికి సరీగా తగిన శాస్తి తెలిసిందా?"

"ఏమయ్యోయ్! నా మాట విను! ఇది ధర్మంకాదు అనవసరంగా ఆపద పాలై పోతావు సుమా!"

"పాపా! ఇంత చేసి ఇంకా ధర్మపన్నాలేకరువు పెడుతున్నావా?"

అని విద్యానాథుడతన్ని కసిరికొట్టాడు సోమయామాత్యునికి కావలిసిందీ అదే! వెంటనే ఆ వ్యవహారం అంతా మహారాజు వెంటనున్న బేతాళనాయని వరకు వెళ్ళిపోయింది నాయుడది చల్లగా మహారాజు చెవిలో వేశాడు



విశ్వేశ్వరాగ్రహారం అంతా విద్యానాథునికీ సోమయామాత్యునికీ మధ్య చెలరేగిన వివాదంతో అట్టుడికిపోయినట్టుడికిపోయింది అగ్రహారంలోనివారంతా ఏకగ్రీవంగా విద్యానాథునిదే తప్పన్నారు అమాత్యునికీ తనకు పడకపోతే ఆపగ మరోకవిధంగా సాధించుకోవాలిగాని అలాగ దురాక్రమణం చెయ్యడం చాలా తప్పని ఖండించారు

ప్రతాపరుద్ర మహారాజు మృగయా వినోదం ముగించుకొని తిరిగివస్తూ మళ్ళీ విశ్వేశ్వరాగ్రహారంలో విడిది చేశాడు ప్రత్యేకంగా విద్యానాథ సోమయామాత్యుల వివాదం పరిష్కరించడానికని అక్కడ తన ఉనికి ఇంకొక్క రోజెక్కువ పొడిగించాడు

స్కంధావారంలోను, ఆ పరిసరాలలోను, అగ్రహారీకులంతా కిటకిటలాడిపోయారు వివాదపరిశీలన ప్రారంభానికి ముందుగా బేతాళనాయుడు సవినయంగా లేచినిలబడి వివాదవ్యవహారం సంగ్రహంగా విశదపరిచాడు

"మహారాజా! తమరు విద్యానాథవిద్వాంసులకిప్పించిన భూభాగం విషయంలో పెద్ద వివాదం బయలుదేరింది తాము దయచేయించిన తామ్రశాసనంలో తటాకోత్తర భూభాగం అని స్పష్టంగా ఉల్లేఖింపబడి ఉంది అయితే విద్యానాథులు దానికివ్యతిరేకంగా తటాకానికి దక్షిణ భూభాగంలో పదిపుట్లభూమి ఆక్రమించుకొన్నారు 'తటాకోత్తర ఖండ'మని స్వయంగా తమరు కూడా వాచా సెలవిచ్చారు కాని చివరికి జరిగినదిది ఆపైన తమ చిత్తం"

మహారాజు దృష్టి విద్యానాథునివైపు తిరిగింది విద్యానాథుడు విన్నవించుకొన్నాడు "నేను అక్షరాలా తమరు దయచేయించిన తామ్రశాసనంప్రకారమే నడుచుకొన్నాను దీనిలో నేనుచేసినదురాక్రమణం ఏమీలేదు!"

దానిమీద బేతాళనాయుడడిగాడు

"తాము దక్షిణభాగం ఆక్రమించుకొన్నమాట నిజమే కదా?"

అవును! నిజమే!

"అయితే 'తటాకోత్తర భూభాగం' అంటే 'దక్షిణ భాగం' ఎలాగ అవుతుంది?"

విద్యానాథుడొక్క నవ్వు నవ్వాడు

"తటాకం ఉత్తరంగా కలిగిన భూభాగం అంటే దక్షిణభాగం కాదా? నామాటమీద నమ్మకలేకపోతే విద్వాంసుల నెవరినైనా అడిగిచూడండి!"

ఆ సమాధానంతో స్కంధావారంలో అంతటా ప్రశంసలు, సాధువాదాలు చెలరేగాయి సోమయామాత్యుడు షష్ఠీతత్పురుష సమాసం ప్రకారం తటాకమునకు 'ఉత్తరమైన' అని అర్థం చేసుకున్నాడు అయితే దానికి విద్యానాథుడు 'తటాకము ఉత్తరంగా కలిగిన' ని బహువ్రీహి సమాసం ప్రకారం అర్థం చెప్పాడు ఆ అర్థంతో ఉత్తర దక్షిణాలు తారుమారై ఉత్తరం దక్షిణంగా మారిపోయింది! ఆ అర్థం కాదనడానికింక ఎవరికి గుండెలున్నాయి? ఆనిర్వచనంవినగానే సోమయామాత్యుని గుండె దిగజారిపోయింది ముచ్చెమటలు పోశాయి మహారాజు విద్యానాథుని వాక్చమత్కృతికీ, చాకచక్యానికి ఎంతో ఆనందించాడు

"అయితే తామది 'బహువ్రీహి' చేశారన్నమాట! అంతేనా?"

అని ఎంతో ఆప్యాయంగా అడిగాడు

"తమవంటి వారు నావంటి వాడికి బహూకరించిన భూభాగం 'బహువ్రీహి' కాక 'అల్పవ్రీహి' అవుతుందా? తాము 'నాకు సస్యశ్యామలమైన' సుక్షేత్ర ఖండిక బహూకరించాలని సంకల్పించారు సోమయామాత్యులు పటిచవిటి నేల ఇప్పించాలని కుట్రపన్నారు కాని తమ సత్సంకల్పం ప్రకారం తామిచ్చిన నేల 'బహువ్రీహి' అయిందిగాని 'అల్పవ్రీహి' కాలేదు"

'వ్రీహి' అంటే ధాన్యమని అర్థం బహువ్రీహి అంటే బాగా ధాన్యం పండేనేల అనికూడా అర్థం చెప్పవచ్చును ఆ పదంమీద విద్యానాథుని వ్యాఖ్యానం వినగానే మహారాజు, సభాస్తారులు మళ్ళీమహాశ్చర్యంతో నిశ్చేష్టులై పోయారు

కాని సోమయామాత్యుడు, బేతాళనాయుడు వంచిన తలలిక పైకెత్తలేకపోయారు

"విద్యానాథ విద్వాంసు లీక్షణం నుంచీ మాత్రిలింగ సామ్రాజ్య స్థాన విద్యాధికారులు!"

అన్నాడు ప్రతాపరుద్రమహీపతి!

ఉత్తరక్షణంలో విద్యానాథుడు ముక్తకంఠంతో తన ప్రశస్తి శ్లోకం మళ్ళీ ఉచ్చస్వరంతో పఠించాడు

"నవ లక్ష ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే
అభవత్సర మగ్రహార పీడా
కుచకుంభేషు కురంగ లోచనానామ్"

వెంటనే స్కంధావారంలో అంతటా ప్రశంసాపరంపరలొక్కమారుగా మిన్నందుకొన్నాయి!




అధైర్య పడవద్దు
శాస్త్రీయమైన, నిజమైన SEX—ADVICE పొందవచ్చును మీకు ఉండుకొన్న లక్షణములు వ్రాయుచూ, యింకా వివరాలకు కవరు పంపేది
డాక్టరు రత్నంసన్స్,(Estd 1904)
మలకపేట బిల్డింగ్సు-హైద్రాబాద్-3.
(దక్కన్)



ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవ సందర్భమున
మా ఖాతాదారులకు శుభాకాంక్షలు
'మైలాండ్' సూపర్
వాచీలనే ఉపయోగింపుడు
21 జ్యూయల్సు స్విస్ వాచ్ రు 120 లు
ఏజంట్లు
మినర్వా వాచ్ కంపెనీ, విజయవాడ-1.

# ★ భాగానగరం ★

(11 వ పేజీ తరువాయి)

భాగానగరం వెలసిన కొన్నాళ్ళకు భాగామతి చనిపోయింది. అప్పుడు సాధుసత్తములు కొందరు నవాబుతో నగరం పేరు మార్చమని చెప్పారు. మహమ్మదుకులీవంటి మహమ్మదీయమతస్థుడు కేవలం కాముకుడై హిందూమతస్థురాలైన భాగామతివంటి ఉపభార్యకు వశవర్తుడై మహానగరానికి ఆమె పేరు పెట్టాడనే అపదూరకు గురికావద్దని వారు అతనితో తటేను చెప్పారు. ఆ పేరే వుంటే ఆనగరం ఉన్నంతకాలం తరతరాలకు అతని కాముకకళంకం ఉండిపోతుందని వారు చెప్పారు.

## కొత్త పేరు

ఈ వాదంలోని బలం అతనికి నచ్చింది. అప్పుడు అతను నగరం పేరు మార్చాడు. అలీ యొక్క బిరుదుల్లో ఒకటైన హైదర్ పేర హైదరాబాదు అనే పేరు ఆ నగరానికి ఉంచాడు.

ఈ సందర్భంలో మహమ్మదీయ మహోదయుగంలో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు ఇట్లు వ్రాస్తున్నారు: "దీనికి మొదట భాగానగరమని పేరు. నవాబు భార్యలలో నొకతెను భాగాయని పేరు. ఈమె భార్యకాదనియు భోగకాంత యనియు కొందఱు వ్రాసియున్నారు. నవాబు తానుకట్టించిన నగరమునకు మొదట నీమె పేరు పెట్టెను. తరువాత నీనవాబు కుమారుడైన హైదర్ అనువాని పేరిట నీనగరమునకు హైదరాబాద్ అని పేరువచ్చెను"

## హైదర్ పేర

హైదరాబాదు అనేది నవాబు కుమారుని పేర ప్రసిద్ధికెక్కినదని శ్రీ వారు అంటున్నారు. హైదరాబాదు నగరనిర్మాత ఐన మహమ్మదుకులీకి కొడుకులు లేరు. హయ్యత్ బక్ష్ బేగం అనే ఆమె ఒక్కతే కూతురు. అందుచేత పై వ్రాత సరికాదని అనవలసి వుంటుంది. మహమ్మద్ కులీ కొడుకు పేరిట కాక అలీయొక్క బిరుదుల్లో ఒకటైన హైదర్ పేరనే హైదరాబాదు పేరుపుట్టిందని నిర్ణయించాలి.

పుట్టినకొత్తలో ఊరు చిన్నదిగా ఉన్నప్పుడు అది భాగా నగరమనే వ్యవహరింపబడేది. ఈ ఊరు నిర్మించాక దాని నిర్మాత ఇరవై ఏళ్ళకుపైగా జీవించాడు. తన జీవితకాలంలోనే అతడు దాని మొదటి పేరును మార్చివేశాడు. అయినప్పటికి అతని మనుమడు రాజ్యం చేసేటప్పటికికూడా దానికి భాగా నగరమనే పేరే ఉంటూ ఉండేది. ఆనాడు గోల్కొండకు వచ్చిన విదేశయాత్రికుల వ్రాతల్లో అదిభాగ్‌నగరమనే పేర్కొనబడుతూ వచ్చింది. 1667 ప్రాంతంలో గోలకొండ రాజ్యాన్ని సందర్శించిన విదేశయాత్రికులు థెర్నోయరు మున్నగువారు హైదరాబాదును తమవ్రాతల్లో భాగ్‌నగర్ అనే నామంతోనే వ్యవహరించారు. 1667 నాటికి ఆనగరం నిర్మితమై డెబ్బయి ఐదేళ్లు అయింది. అప్పటికి కూడా భాగ్‌నగర్ అనే పేరే మంచిప్రచారంలో వుందని విదేశయాత్రికుల వ్రాతలవల్ల తేలుతూవుంది.

దరిమిలా అనగా ఊరు పెరుగుతూవచ్చిన కాలక్రమాన హైదరాబాదు అనే పేరు ప్రచారంలోకి వచ్చివుంటుంది.

## ఈనాటికి కూడా

అయినప్పటికీ భాగానగరమనే పేరు ఈనాటికికూడా పూర్తిగా మఱుగుపడిపోకుండా ఉంటూనే ఉంది.

రాజకీయ విషయాల్లో హైదరాబాదు అనే కొత్తపేరు క్రమక్రమంగా చెలామణీలోకి వచ్చింది. వాణిజ్యరంగంలో మాత్రం నేటికీ కూడా భాగానగరం అనే పేరునిలిచే ఉంది. ఈ నాటికిన్నీ సాహుకారు - హిందూమతస్థులైన వర్తకులు, వైశ్యులు మున్నగువారు - తమ చిఠాఅవర్జాలలో, ఎక్కవుంటు పుస్తకాలలో ఆ నగరం పేరును భాగా నగరం అనే పేర్కొంటారు.

## లక్ష్మినగరం

భాగామతి, భాగావతి, భాగ్యమతి మున్నగునవి పర్యాయపదాలు. ఆ పదాలకు అర్థం లక్ష్మీదేవి అని. భాగామతి అనే పేరునుపట్టి భాగానగర మన్నట్లే భాగ్యమతి అనే పేరునుబట్టి భాగ్యనగర మనిన్నీ అంటుంటారు. ఎట్లా అన్నా దాని అర్థం లక్ష్మీనగరమనే.

లక్ష్మీనగరం అని అర్థంవచ్చే భాగానగరం, భాగ్యనగరం అనే పేర్లు ఈనాడు అంతగా వాడుకలో లేకపోయినా, ఆ నామాలు సూచించే భాగ్యభోగ్యాలకు ఈనాడు హైదరాబాదు మునపటికంటె ఎక్కువగా నిలయమయ్యే వుంది.

ఈ దలవకు చాలవరకు భాగావతి కారణం అనడం సత్యసమీపమే అనిపించుకొంటుంది.

## ఉత్తంసురాలు

చరిత్రలలో మనం అనేక రాజుల్ని వారి ఉంపుడుకత్తెల్ని గురించి చదివి ఉన్నాము. ఆయా రాజులు ఆయా ఉంపుడుకత్తెల పేర సత్రవులు, బావిళు, గుళ్ళు, గోపురములు, మఠములు, మందిరములు, పేటలు, బాటలు మున్నగునవి కట్టించడం విన్నాము. కాని తన కాపురపు కాణాచికి రాజు రావడానికి వీలుగా నదిమీద వంతెన నిర్మాణానికి సన్నిహితము ప్రత్యక్షము ఐన కారణమై తన కాపురపు కాణాచికి సమీపస్థలం కావడంవల్లనే నూతన నగరస్థల వరణీయతకు ముల్లు చూపించి ఆ నగరానికి తన నామాన్ని ఉంచే ఉబలాటం పుంపగలిగిన ఉపస్త్రీ మరి ఒకతె చరిత్రలో లేదని చెప్పవచ్చు.

పేరుకేకాక పెత్తనానికి కూడా ఆమె భాగ్యమతి ఐ ఉండాలి. రూపవతి అనుటకు తోడు ఆమె ప్రజ్ఞామతి ఐ ఉండాలి. ఆమె మనికిపట్టు కావడంచేత ఒక మహారాజును ఆకర్షించిన ఆస్థలం నేడు తొంభై ఆరు చతురపు మైళ్ళ వైశాల్యం కలిగిన్నీ, పదిహేను లక్షల జనాభాతో సమృద్ధదాత్తమై సన్నాహసుందరమై ఒప్పుతూ ఉంది.

—'హైదరాబాదునగర చరిత్ర' నుండి




WZX 37 TEL




జామ్-బక్

కండరముల బాధలను మరియు నొప్పులను త్వరలో నివారించును

మూలికా సంబంధ ఆయింట్‌మెంట్ అయినట్టి జామ్-బక్‌ను మీ కండలలోనికి ఇముడునట్లు రుద్దుడు. ఇందలి అమోఘ ఔషధ తైలములు, అన్ని బాధలను, నొప్పులను మరియు చర్మ బిరుసును నిర్మూలించివేయుట వల్ల మీరు బాధా విముక్తిని పొందెదరు. అద్భుతమైన తైలములతో గూడినట్టి జామ్ బక్ శీఘ్రముగా పొచ్చుకొనిపోవు లక్షణముగలిగి యున్నది. ఇది మీ కండరములను కోమలంగాను బలిష్ఠమైనవిగాను వుంచును.




చర్మమునకు జామ్ బక్ ప్రపంచంలోకల్లా అత్యుత్తమ ఆయింట్‌మెంట్

అంతట క్రొత్త డబ్బీలో కలపబడని గ్యారంటీ వేయబడినది

అన్ని మందుల షాపులందునూ దొరకును

సోల ఏజెంట్లు దాదా & కంపెనీ,
86, నైనప్ప నాయక్ వీధి, మద్రాసు-1

 చిన్నాదేవి 

(48 వ పేజీ తరువాయి)

చి: పెద్దనగారు దీనిలో ఏమీ వివరములు వ్రాయలేదే. మీగురించే వ్రాసినారు. ఇదేమిటి క్రింద తిమ్మరుసుగారి సంతకముందే.

మల్లన: అదే యిప్పుడు కావలసినది. నన్ను పెద్దన్నగారు తిమ్మరుసుగారు పంపించారని నీకు తెలిస్తేచాలు. నీకు నేను వారి మనిషినని తెలిస్తేచాలు.

చి: మీరు చెప్పేది నాకేమి బోధపడటం లేదు. అసలు మిమ్మల్ని ఎవరు పంపారు? నాతో ఏంపని? దయచేసి చెప్పండి.

మల్లన: నన్ను మహామంత్రి తిమ్మరుసుగారు పెద్దనగారి సహాయంతో ఇక్కడకు పంపించారు. నేను అతిముఖ్యమయిన ఒక రాజకీయ కార్యంమీద వచ్చాను. అది జయప్రదంగా పూర్తికావటానికి నీతోడ్పాటు అవసరం.

చి: నేను మీకు తోడ్పడినందువల్ల నాకేమి లాభం?

మల్లన: నీకు లాభం లేకపోవట మేమిటి చివరకు నీకే తెలుస్తుందికదా. అయితే దీని విజయం నీమీద నామీద ఆధారపడివుంది. ఈ రహస్యం యిక్కడ యింతవరకు నీకూ నాకూ తప్ప యెవ్వరికీ తెలియదు. పని పూర్తయేవరకు తెలియకూడదు. ఇది ముఖ్యం.

చి: సరే యింతకీ నా సంగతి తిమ్మరుసుగారి కెట్లా తెలుసు.

మల్లన: అదేమిటి తిమ్మరుసుగారికి ఈ రాజ్యంలో యెక్కడ యేమూల ఏమి జరుగుతున్నదో తెలుసు. ఆయన సహస్రాక్షుడు. అదికాక పెద్దనగారు మిమ్ములను గురించి చెప్పి మీకు పరిచయపత్రం కూడా యిచ్చారుకదా.

చి: సరే అయితే. ఇంతకూ నేనేమి చేయాలి?

మల్లన: ముఖ్యపని ఈ రహస్యం కాపాడటం. తరవాత అవసరాన్నిబట్టి నీకు సమస్త విషయాలు తెలియగలవు. నీకూ నాకూ గల సంబంధం, నీ యింటికి నేను వస్తున్నట్లు యెవరికీ తెలియనీయకూడదు సుమా!

(చిన్నమ్మ పూలు, పండ్లు, ఆకువక్కలు ఇచ్చి సత్కరింపబోవును)

మల్లన: ఇటువంటివి యెందుకు కాని! అసలువిషయంమాత్రం మరిచిపోకు వెళ్ళొస్తాను పనుంది.

## మూడవ రంగము

[స్థలం:- లక్ష్మీపతి శాస్త్రిలుగారి ఇల్లు
కాలం:- రెండవరంగము జరిగిన తరువాత నెలరోజులకు. రాత్రి సుమారు ఏడెనిమిది గంటలప్పుడు]

లక్ష్మీపతిశాస్త్రిలు: ఒరేయి మల్లన్నా ఇందాక ఆస్థానములో వీరభద్రగజపతి తన స్థితికి కారణ మడిగినప్పుడు నిన్ను అడగమన్నాడేమిటి

మల్లన: ఏమి చెప్పమంటారు గురువర్యా నేను మహాఘోరమైన పాపంచేశాను మీరు క్షమిస్తానని మాట ఇచ్చేవరకు ఇలాగ మీ కాళ్ళమీద పడివుంటాను (కాళ్ళమీద పడును)

ల: అదేమిటిరా. నీవేంచేశావు లే లే. చెప్పు. అసలు జరిగినదంతా చెప్పు.

మల్లన: (రుద్ధకంఠంతో) నేను మీకు ద్రోహంచేశాను గురువుగారూ

ల: నువ్వు నాకు ద్రోహముచేయట మేమిటిరా వివరంగా చెప్పు ఇట్లా కూర్చుని.

మ: వీరరుద్రగజపతి మహారాజులవారిని నేనే చేజేతులా శత్రువులకు అప్పగించాను స్వామీ!

ల: అదేమిరా వీరరుద్రగజపతి నీకెట్లా చిక్కాడు. నేను ఆయనకు ఈ మాసాలు మీకు మంచివి కావు కోట కదలకండి. రోజూ నేను జపంచేసి పంపించే మంత్రో


ఫిలిప్స్

★ రేడియోలు

★ బల్బులు



BCA 645 A
7 వాల్వుల
కరెంటు రేడియో
రూ. 650



BCA 235 B/U 5 వాల్వుల
కరెంటు లేక డ్రైబ్యాటరీ రేడియో
రూ. 175




కృష్ణా జిల్లాకు డీలర్లు:-

మోడరన్ ఆటో స్టోర్సు

కాన్వెంట్ వీధి :: విజయవాడ-1.

# ★ చిన్నాదేవి ★

పాకం పుచ్చుకోండి అని చెప్పారు కదా నీతో అసలు ఎట్లా వచ్చారురా మహారాజా

మ: మంత్రోదకం ఇచ్చి వచ్చేది నేనే కదా రోజా వెళ్ళినప్పుడు మీరు ఆయనకు చెప్పిన చెడు రోజులను గురించి, అర్ధశ యోగాన్ని గురించి చర్చించేవాళ్ళం

అ: అయితే

మ: మొన్న యీ నృత్య ఆలయంలో కూర్చుని ఒక వేశ్యకుమార్తె జాతకాన్ని పరిశీలించాం జ్ఞాపకముందా?

అ: అవునవును ఆ జాతకానికి విపరీత రాజయోగం ఉందని చెప్పానుకూడా

మ: ఆ జాతకాన్ని గురించి చెప్పి, శత్రువులు కోటముట్టడించినప్పుడు మహారాజులుంగారు ఆ విపరీత రాజయోగం కలదాని యొక్క గృహములో వుండి, రాబోయే


జలుబులను
మరియు
చలిని
ఆపుటకు
పెప్స్
సేవించుడు

జలుబు, చలి, దగ్గు, గొంతు నొప్పి, ఇన్ఫ్లుయంజ లేక రొమ్ము పడిసెముల చిహ్నం కనిపించగానే పెప్స్‌ను సేవించుడు పెప్స్‌లోని శమనకర అంటు విరోధక ఔషధ సారములు, గుండెలు, ఊపిరి తిత్తులలోకి లోతుగా చొచ్చి—త్వరగా ప్రమాదకర క్రిములను వశింపజేయును—మంటతో గూడిన వాపును రహిత మొనర్చును—రేగిన నొప్పిని శమనపర్చి వేయును డాక్టర్లు పెప్స్‌ను శిఫారసు చేసి యున్నారు పిన్నలు పెద్దలు కూడ సేవించవచ్చును, ఇందు ప్రమాదకర ఓషధులు లేవు.



PEPS

పెప్స్ గొంతు మరియు గుండెల అంటు విరోధక బిళ్లలు

FPY-41-TEL

సోల్ ఏజెంట్లు ద ఖ & కంపెనీ, 86, సైనప్ప నాయక్ వీధి, మద్రాసు-8


అర్ధశ యోగాన్ని తప్పించుకోవచ్చని నన్ను చెప్పాను.

అ: నన్ను చూపిలేమాత్రం ఆయన విన్నాడటరా. అవును పాపం వారుమటుకు వినకేం చేస్తారు. భగవదిచ్ఛ అంత బలవత్తరంగా వుంటే.

మ. ఆయనను ఆ సానిదానింట్లో పెట్టి నేను వెళ్ళి కోటతలుపులు తెరవటంలో విజయనగర సైనికులకు సహాయపడ్డాను.

అ: ఆ రాత్రిలో ఆ వర్షములోనా అవును లే నీకు చలేమిటి

మ: క్షమించండి గురువర్యా నా మహా పాపాన్ని (గాద్గదికంగా)

అ: అవును నీపాపం మటుకు ఏమిటి? మీ మేనమామ తిమ్మరుసువలలో చిక్కకొని వుంటావు సరే నీకు ఆ సానిది ఎట్లా తెలుసు

మ: అది మొన్న విజయదశమి ఉత్సవాలకు విజయనగరం వచ్చింది దర్బారులో నృత్యం చేసింది.

అ: సరే యింకేమి తక్కువ అది సరే యిదికూడా చెప్పు. తిమ్మరుసు వీరభద్ర గజపతికి గ్రహస్థితి బాగు లేనప్పుడే దండయాత్రకు ముహూర్తం ఎట్లా పెట్టించగలిగాడు.

మ: అదికూడా నేనే చెప్పాను నన్ను దగ్గర కూర్చోబెట్టుకొని అన్నీ ఆలోచించాడు

అ: సరే ఈ ముహూర్తం ఎవరు పెట్టారు దండయాత్రకు

మ అదికూడా మీరు పెట్టినదే మనిద్దరము ఒక రోజున ముహూర్త బలములను చర్చించాముకదా.

అ అది దీనికోసమే నన్నమాట ఘోర తిమ్మరసూ! నీది రాజనీతి రాయల దండయాత్రకు గజపతి ఆస్థాన పురోహితునిచేత ముహూర్తం పెట్టించావు

మ: (కాళ్ళమీదపడి) నన్ను క్షమించండి గురువర్యా, నా పాపానికి నిష్కృతి ఉపదేశించండి నన్ను గురువంచనా మహాపాతకం నుండి విముక్తుణ్ణి చెయ్యండి

అ: లే మల్లన్నా నీవు చేసిన మహా వంచనకు నీ తల వెయ్యి వ్రక్కలయ్యేట్లు శపించకపోవటానికి నీవు నా శిష్యుడవటమే కారణం అయినా నిన్న ననలసిన పని ఏముంది నీవు నిమిత్తమాత్రుడవు (మల్లన్నను లేవనెత్తును)

మ: గురువర్యా నా మహాపాతకానికి నిష్కృతి ఏమిటి? ఈ పాతకం నన్ను నిలువునా దహించి వేస్తోంది

అ: మల్లన్నా, రోజుకు యిరువది యైదు వేల శివపంచాక్షరీ మహామంత్రాన్ని నీయావజ్జీవం జపించుము అదే నీకు నిష్కృతి

## నాలుగవ రంగము

కాలం అదే

స్థలం—రాజభవనంలోని చంద్ర శిలామండపం. (శ్రీకృష్ణదేవరాయ సార్వభౌములు అటూ ఇటూ పచారు చేస్తూ వుంటారు వెన్నెట్లో ఇంతలో అప్పాజి ప్రవేశం)

అప్పాజి—చక్రవర్తులకు జయము నన్ను రమ్మనమని ఆజ్ఞాపించారట

శ్రీకృష్ణ—అవును అప్పాజి పిలిపించాము మీకు మా కృతాజ్ఞతాభి వందనాలు సమర్పిద్దామని

అప్పాజి.—నాకా! ఎందుకు?

శ్రీకృష్ణ:—నాకు యింతకంటె ఎవరు మటుకు ఏమి యివ్వగలిగారు జయలక్ష్మి, రాజ్యలక్ష్మితోపాటు.

అప్పాజి.—ఓ అదా. ప్రభువులు సంతోషించుట తృప్తికంటె నాకు యేమి కావాలి

శ్రీకృష్ణ—సరే అప్పాజి మీకు అసలు ఈ ఊహ ఎందులకు కలిగింది

అప్పాజి.—తమరు ఆమెను ఈ ద్యావనవనములో కలుకోటం, మరునాడు దర్బారులో ఆమెకు నాట్య ప్రదర్శనకు అవకాశం ఇప్పించటం అందులో ఇది వరకు ఉన్న కార్యక్రమాన్ని మార్పించి దీన్ని నేనేవిధంగా అర్థం చేసుకోవాలి? ప్రభువులను మేము వారించగలమా? మా నుండి తప్పించుకోటానికి ఆయనకు అనవసరంగా శ్రమ కలిగించటం కాని

శ్రీకృష్ణ అప్పాజీ మీ ఆలోచన మీరు యెంత మాబోటి వారికి ఏమి అర్థమవుతాయి? మీకు నా కృతజ్ఞత ఎట్లా చెప్పాలో అర్థం కావటం లేదు

(పాదాభివందనం చేయబోతాడు)

అప్పాజీ—తప్పు తప్పు మహారాజా! మేము మీ సేవకులం మాత్రమే

శ్రీకృష్ణ—పోనీ ఈ హారాన్ని గ్రహించండి

అప్పాజి—క్షమించాలి ప్రభువులు అది నాకంటె యిప్పుడు కాసేపట్లో రాబోయే చిన్నాదేవి గారి మెడలో ఉంటే మరింత శోభిస్తుంది.

అదిగో ఎవరో వస్తున్నట్లు మంజీర రవళి వినిపిస్తోంది చిన్నాదేవిగారు కావచ్చు నాకు సెలవిప్పించండి మహారాజా!

(నిష్క్రమణ) ★


Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S Sambhu Prasad



ఇది ఆనంద సమయం . ఏడాది పొడుగునాగల తాపత్రయాలను మరచి,
ఆహ్లాదంగా, ఉత్సాహంతో—సుందరంగా మణులవలె మెరుస్తుండే
ప్రమిదె దీపాలతో ఇంటిని అలంకరించే సమయం.

కుటుంబమునకు, మిత్రులకు రుచికరమైన భోజన పదార్థాలను వడ్డించే
సమయం కూడ—కూరగలు పలావులు సమోసాలు జంతికలు గులాబ్
జాములు జిలేబీలు, లడ్డూలు—అన్నియు శుద్ధమైన పుష్టికరమగు డాల్డా
వనస్పతితో వండబడినట్టివి అవును దీపావళిని ఆహ్లాదకరమైన
పండుగను మీరు ఆనందముగా గడుపుటకు డాల్డా సహకరించును




10 పౌనులు*, 5 పౌనులు*, 2 పౌనులు*, 1 పౌను, ½ పౌను డబ్బాలలో అమ్మబడుచున్నవి

*రెండు మూతలుగల డబ్బాలలో

## డాల్డా శుద్ధగం వనస్పతి



HVM. 284

